









# మీపాపాయి సంక్షేమమే మాముఖ్యఆశయం

ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లంతా తల్లి పాలను పసిపాపలకు కావలసిన పోషక పదార్థాలతో పాటు, రోగ నిరోధక శక్తిని పరిపూర్ణంగా యిచ్చే పౌష్టిక ఆహారంగా అంగీకరించారు.

తల్లి పాలు సమృద్ధిగా లేనప్పుడు పాపాయికి 'విజయ స్ప్రే' వంటి 'శిశు ఆహారం' ఇవ్వడం మంచిది. సెంట్రల్ ఫుడ్ టెక్నాలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియావారి ఫార్ములాను అనుసరించి విజయస్ప్రేను స్వచ్ఛమైన పాలు, విటమిన్లువంటి పోషక పదార్థాలతో కలిపి రూపొందించారు. లోపల పక్కాగా సీలు వేసి, ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ మరియు కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రీసెర్చి ఆఫ్ ఇండియావారి అనుమతి పొంది మీ వద్దకు వస్తోంది. మీ పాపాయికి కావలసిన అన్ని పోషక పదార్థాలతో శాస్త్రీయంగా అత్యంత శ్రద్ధతో ఉత్పత్తి చేయబడుచున్న అమూల్య ఆహారం.

## విజయస్ప్రే

తల్లిపాలు పసిపిల్లలకు అత్యుత్తమమైనవి.

శిశు సంక్షేమం కోరి విడుదల చేసినవారు ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్.

విజయ స్ప్రే తయారు చేయువారు

FDS APDDCFL 38 83 Tel

జూలై నెల **వెరయిటీ** సంచికలో

* ఇంటావిడకు చెప్పదలసినవీ, చెప్పకూడనివీ!
* రాముడు ఒక్క భార్యతోనే ఎందుకు సరిపెట్టుకున్నాడుట?
* **బీద** స్త్రీలను శృంగారానికి ఎందుకు రెచ్చగొడుతోంది?
* **బొంబాయిలో దయ్యాల నాట్యం!**

**ఆ పుణ్యక్షేత్రంలో నగ్నంగానే పూజలట!**










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు .
**దేశోద్ధారక కాశీనాథుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908
*శివలెంక శంభుప్రసాద్*
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం · 29–7–'83
రుధిరోద్గారి నామ సం. ఆషాఢ బ చవితి
**సంపుటము 75 సంచిక 48**
సంపాదకుడు :
*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు 1 50
ఆరు మాసాల చందా రు 42 90
పోస్టులో ఏడాది చందా రు. 85 80
**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
నటి మాధవి
(ఫొటో. 'కాజాస్')

*కథలు :*
కుంటికాలు . 8
దొంగలు ... 20
ఓ సీత కథ .. 46
విముక్తి .. 58

*సీరియల్ నవలలు :*
తిరు చరణాలు 12
మానస మురళి ... 24
మూగముత్యాలు (ప్రారంభం!) . 30
జీవన్ మృతులు . 50

*వ్యాసాలు, శీర్షికలు :*
ఉత్తరాలు–5, న్యూఢిల్లీ లేఖ–6, లోకంపోకడ–7, వ్యక్తిగతం,వారఫలం–10, ఇ'వేమన' పద్యాలు–16, ధర్మపథం–17, ప్రశ్నావళి–18, కొత్త గొంతులు – 23, సినిమా – 38, ఫాలాక్షుని డైరీ – 48, డాక్టర్ సలహాలు–56, హైదరాబాద్ నోట్ బుక్ – 62.

## ముఖచిత్రం

8–7–83 ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రము ప్రసిద్ధ వరప్రసన్నుడు శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనము ప్రత్యక్ష సాక్షాత్కారమువలె పరవశ ఆనంద వైభవము కల్గించింది. సినిమా తారలు చిత్రములు వినుగు మీ కింకను రాలేదా ? ఇట్టి అద్భుత దైవ చిత్రములు తరుచూ నెలకొకమారైన వేసి పుణ్యము కట్టుకొని మాలాటి భక్తులకు పరవశము కల్గించలేరా! ఇకముందు సంచికలలో నా ప్రార్థన ఆలకించి — శ్రీరాముడు — శ్రీశంకరుడు — కనకదుర్గాంబ — ఆంజనేయుడు — మొదలైన ముఖచిత్రాలు ప్రచురించి ధన్యత కల్గించ వేడుచున్నాను. మీకు, మీ పత్రిక ఆంధ్ర పత్రికకి శ్రీరామరక్ష సర్వరక్ష కల్గుగాక !

హనుమ శరణార్థి,
రామచంద్ర అప్పారావు (మదరాసు)

* * *

అట్టమీద అరుదుగా కనిపించే శ్రీ వేంకటేశ్వరస్వామివారి వుత్సవ విగ్రహం చూసే భాగ్యం కలిగించిన మీరు అభినందనీయులు.

డా. జయ్‌దుబాషిగారి న్యూఢిల్లీ లేఖ మనసున్న ప్రతి వ్యక్తిని ఆలోచింపచేసేదిగా వున్నది.

కె. వి. రెడ్డి (హైదరాబాదు)

* * *

"తిరుపతి బ్రహ్మోత్సవాలలో వజ్ర కిరీటాలంకృతుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి" ముఖచిత్రం నయనానందకరంగా వుంది.

కలిమిశ్రీ, కేశి, కొమ్మినేని (గుంటూరు)

* * *

శ్రీ వేంకటేశ్వరస్వామివారి విగ్రహము మమ్ము అందరిని ఆకర్షించినది.

టి. జగదీశ్వరరావు (పాలకొల్లు)

* * *

8–7–83 నాటి ఆంధ్రసచిత్రవారపత్రిక పై వజ్రకిరీటాలంకృతుడైన శ్రీ వెంకటేశ్వర స్వామి ముఖచిత్రం అత్యంత శోభాయమానంగా ఉంది. ఆ చిత్రాన్ని ఫ్రేమ్ కట్టించేంతవరకూ నా మనసాగలేదు.

కె. జీవన్‌బాబు (హైదరాబాదు)

* * *

ఈ వారం "ఆంధ్రసచిత్ర వారపత్రిక" "తిరుపతి బ్రహ్మోత్సవాలలో వజ్రకిరీటాలంకృతుడైన శ్రీ వెంకటేశ్వరస్వామి" ముఖచిత్రం కనులకు పండుగ చేసింది.

కుమార్ గంటాఉమాశంకర్‌రెడ్డి, న్యాయపతి రమేష్‌బాబు, (బరంపురం)




వజ్రకిరీటంతో శ్రీ వెంకటేశ్వరస్వామి చిత్రము మమ్ములను ఎంతో ఆకర్షించింది.

ఎన్. నారాయణ (ఆర్మూరు)

## సీరియల్ నవలలు

నవరత్నాల్లాంటి నాలుగు సీరియల్స్‌లో ఏది ముందు చదవాలో తెలియడం లేదు.

గిడుతూరి బేబిసుశీల (పెదనిండ్రకొలను)

* * *

డా॥ కేశవరెడ్డిగారి 'అతడు అడవిని జయించాడు' సీరియల్ చాలా బాగుంది.

ఆ ఇతి వృత్తం యెన్నుకున్నందుకు ఆయన్ని అభినందించితీరాలి ...

ముసలివాని ద్వారా ఆయన చెప్పిన వేదాంతం, అడవిలో రాత్రిపూట జంతు జీవనక్రమం అత్యద్భుతంగా చిత్రించిన తీరు, శ్లాఘించదగిన విషయాలు. ముగింపు ఊహకు భిన్నంగా వున్నా, ఫరవాలేదు. అంత మంచి రచయితకు పాఠకుల ఉత్తరాల ప్రోత్సాహం ఎక్కువగా లభించనందుకు చింతిస్తున్నాను.

బి. యస్. రాజు (మదరాసు)

* * *

ఆంధ్ర సచిత్ర వార పత్రికలో "అతడు అడవిని జయించాడు" సీరియల్ మంచి రసపట్టుతో పోవుచున్నది. మళ్ళీ మళ్ళీ చదవాలని అనిపించుచున్నది. రచయిత అయిన డా. కేశవరెడ్డికి నా హృదయపూర్వక నమస్కారములు.

జె. కుమారస్వామి, సిలిగురి (ప. బెం.)

## అద్భుతము

డా॥ కేశవరెడ్డిగారి, 'అతడు అడవిని జయించాడు' యొక్క సహజ రచనా విధానము మాటలతో వర్ణించరానిది. వారి రచనలోని సంఘటనలు చదువుతున్నపుడు, అవి నిజముగా కళ్ళ ఎదుట ప్రత్యక్షమగుచున్నవి. ప్రతి విషయమును నిశితమైన వివరణతో వర్ణించి, వ్రాయగల వారి రచనా శక్తి అద్భుతము.

ఎ. గోపాలరెడ్డి (నరసారావుపేట)

## సూచన

మీరు ప్రచురిస్తున్న సీరియల్ 'అతడు అడవిని జయించాడు' వెరైటీగా ఉంది ఇట్లాంటి వెరైటి సీరియల్ మీరు ప్రచురించేటప్పుడు ఆయా రచయితల రచయిత్రుల ఫోటో, వారిని గురించిన క్లుప్తమైన సమాచారం ప్రచురిస్తే బావుంటుందండి.

గాజుల అచ్చాయమ్మ (గుంటూరు)

## అతడు అడవిని జయించాడు

కేశవరెడ్డిగారి నవల 'అతడు అడవిని జయించాడు' చాలా బాగున్నది. అనేక యుగాల్నుంచీ ప్రకృతిలో తాదాత్మ్యం చెందుతూ, దానితో పోరాడి గెలుపును సాధిస్తూ వస్తున్న మానవజాతి చరిత్ర, మనిషిలోని పట్టుదల, ఆత్మ విశ్వాసం, స్థైర్యం— అన్నిటనీ ప్రతి ప్రతిబింబిస్తూ ముసలివాడు ! జీవితాన్ని గురించిన అవగాహన, ఆ అవగాహనలో ఇమిడి వున్న ప్రేమ, మానవుడి అమరత్వం, జీవితంలోని గాఢత— వీటన్నిటినీ రచయిత చక్కగా చూపగలిగారు. ముసలివాడు ఉదాత్తమైన జీవిత సత్యాలను అనుభూతి పొందటం సహజమేగాని వాటిని మాటల్లో పెట్టడానికి అతనికి భాష వుండదేమో! అందుకే రచయిత నాగరికమానవుడి భాషను స్వీకరించక తప్పలేదు. ఈ నవలను వ్రాసిన కేశవరెడ్డిగారికి అభినందనలు.

ఆర్. వసుంధరాదేవి (రాజమండ్రి)

[65 వ పేజీ చూడండి]

# దుబాషీకి దొరికిన రహస్య నివేదిక

ప్యూర్టోరికోనీ ఖలిస్తాన్‌నీ ఒకే దృష్టితో చూడగలిగిన వాడు ఒక గొప్ప మేధావి అయి ఉండాలి. భారతదేశంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాయబారి అంతవాడే ననటంలో సందేహంలేదు. అమెరికా రాయబారుల పితామహుడనతగిన జాన్‌ఫాస్టర్ డల్లెస్ కూడా పెద్ద మేధావే. గూర్ఖాలు మహమ్మదీయులు అనుకున్నాడట ఆయన. ప్రస్తుతం రీగన్‌కి జాతీయ భద్రతా సలహాదారుగా ఉంటున్న విలియమ్‌క్లార్క్ అనేవాడు సయితం గొప్ప మేధావే. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వ పదవులలో నియమింపబడినవాళ్లకి కొందరు శాసన సభ్యులు పరీక్ష పెడుతూ ఉంటారు. వారి ప్రశ్నలకి వీరు సమాధానాలు చెప్పాలి విలియమ్ క్లార్క్ తనకి బోట్‌స్వానా, బురుండీలనే దేశాలు ఉన్న సంగతి తెలీదని పరీక్షలో వెల్లడించాడు. ఆయనే తాజ్‌మహలు న్యూయార్క్‌లో ఉండే ఒక హోటల్ పేరు అనుకున్నాడుట.

హారీబార్‌న్స్ గొప్ప మేధావి కదా, ఆయన ప్రవచనాలు కొన్ని సేకరిద్దామని నేను ఆయన తమ ప్రభుత్వానికి పంపే నివేదిక కాపీని సంపాదించగలిగాను. ఎలాగంటారా? అమెరికా గూఢచారి సంస్థ సి. ఐ. ఎ. ద్వారానే, వేరే ఎలాగ? ఈ సంస్థ భలే మంచి సంస్థ. నాలుగు వారాల ముందు అడిగితే చాలు, ఇవ్వవలిసిన డబ్బు ముట్టచెబితే చాలు. నివేదికలో ఇలాగ ఉంది :

''ముందు అస్సామ్‌ని గురించి రాస్తాను. అసలు అస్సామ్ ఉందో లేదో నాకు తెలీదు, ఎందుకంటే అస్సామ్‌లోకి విదేశీయులని రానివ్వరు. ఆ ప్రాంతాన్ని ఎవరూ చూడలేదు. బ్రహ్మపుత్ర నదిలో కొంచెం కొంచెంగా కొట్టుకు పోయి బర్మాలో కలిసిపోయింది అస్సామ్ — అన్న వదంతులు ఉన్నాయి. కాని ఇది వట్టి ఊహ మాత్రమే. అస్సామ్‌లోనుంచి వచ్చేదానిలో ఇంచుమించు అంతా నకిలీయే. ఎన్నికలు నకిలీవి, హత్యల వార్తలు నకిలీవి. ఎవరో ఎవరినో చంపారంటారు అదీ నిజంకాదు. అస్సామ్‌లో శిశువులని చంపినట్లు చూపే బొమ్మలు నకిలీవని శ్రీమతి గాంధీ నాకు చెప్పారు. తటస్థదేశాల సమావేశంలో తమని ఇబ్బంది పెట్టటానికనే ఈ బొమ్మలు తయారుచేశారుట. శ్రీమతి గాంధీకి ఇలాంటివి బాగా తెలుసు. ఆమె సి.ఐ.ఏ. వారి ''అబద్ధాల పరీక్షలు'' తీసుకుని బాగా కృతార్థులయ్యారు. అస్సామ్‌మీద మరొక నివేదిక త్వరలోనే పంపుతాను. ఇంతలో మీరు అక్కడ కేంద్ర శాసనసభ వారికి అస్సామ్ కాస్తా బంగళాదేశ్‌లో కలిసి పోయిందని చెప్పెయ్యకండి. అంత పని ఇంకా జరగలేదు.




''కాశ్మీరు సంగతి. ఇక్కడ మనకి సమాచారం బాగానే అందుతోంది. ఫరూక్ అబ్దుల్లా కూడా సి. ఐ. ఎ. మనిషే—1970 ప్రాంతంలో మొరార్జిదేశాయిలాగా, 1930 ప్రాంతంలో నెహ్రూలాగా. [అసలు సి. ఐ. ఎ. అంతపాతదా? చూడాలి.] ఫరూక్ మన మనిషే కాబట్టి కాశ్మీరుని అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కలిపేసుకోవచ్చునేమో తెలీదు. ఐక్యరాజ్య సమితిలో కాశ్మీరు సమస్యని లేవదియ్యమని జీన్‌కిర్క్ ప్యాట్రిక్‌కి చెప్పాలి. సేమూర్‌హెర్‌ష్‌నీ అడగండి కాని జాగ్రత్తగా ఉండమని చెప్పండి అతనితో! కాశ్మీరులో ఎంతమంది అబ్దుల్లాలు ఉన్నారో లెక్కలేదు. మొరార్జీ విషయంలోలాగే ఇక్కడ ఆయన పొరపాటు పడవచ్చు.

మన అస్థిమిత వ్యవహారాల శాఖకి చెప్పి కాశ్మీరులో పని మొదలుపెట్టమని చెప్పాలి శ్రీనగర్ లోయలో అబ్దుల్లా గెలిస్తే, జమ్మూలో శ్రీమతి గాంధీ గెలిస్తే, రెండు ప్రాంతాలలోనూ సి. ఐ. ఎ. గెలిచింది. జీన్ కిర్క్ ప్యాట్రిక్‌కి భూగోళంమీద కాశ్మీరు ఎక్కడ ఉందో తెలుసుకో గలిగే తీరిక ఉంటే ఆమెకే ఈ పని అప్పగించ వచ్చు.

''పంజాబులో కొట్టుకునేది శ్రీమతి గాంధీ, అకాలీలు కాదు. అక్కడ పోట్లాడుకునేది ఖలిస్తాన్‌వాదులూ, ప్యూర్టోరికన్‌లూ. ''ఎక్కడ ప్యూర్టోరికో, ఎక్కడ జలందర్?'' అని నన్నడగకండి. అదొక పెద్ద కథ. దానిని గురించి సేమూర్ హెర్‌ష్ ఎప్పుడో అప్పుడు ఒక పుస్తకం రాసెయ్యకుండా ఉండడు. ఒకటి మాత్రం గుర్తు ఉంచుకోవాలి — బంగారు గుడిలోపల ఉండేవాళ్ళు ఖలిస్తానీలూ, బయట ఉండేవాళ్ళు ప్యూర్టోరికన్‌లూ. అకాలీ సమస్య విషయంలో పరస్పరావగాహన లేదని శ్రీమతి గాంధీ అంటారు. ఇది నిజం. అమృత్‌సర్‌లో ప్యూర్టోరికన్‌లు చెప్పేది ఎవరికీ అర్థంకాదు; అలాగే వాషింగ్‌టన్‌లో జగజీత్‌సింగ్ చౌహాన్ చెప్పేదీ ఎవరికీ అర్థంకాదు. సి. ఐ. ఎ. ఎప్పుడూ ఇంతే. ప్యూర్టోరికన్‌లకి పంజాబీ భాష నేర్పి మరీ పంజాబుకి పంపించి ఉండవచ్చుకదా? మీరు అనుమతి ఇస్తే ఆ పని నేను చేస్తాను. వాళ్లకి ఇక్కడ తరగతులు పెడతాను. స్పానిష్ భాష బదులు పంజాబీ మాటలాడవచ్చు వాళ్ళు.

''అసలు ఈ ప్యూర్టోరికన్‌ల మాట ఎత్తటం భలే ఎత్తు. ప్యూర్టోరికన్‌లు భారతీయులలాగే ఉంటారు. రంగు తలపాగా పెట్టుకుంటే సిక్కులలాగే ఉంటారుకూడా. భాషలంటారా, అదేమీ ఫరవాలేదు. భారత దేశంలో భాషా సమస్య అనేది ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. తాము చెప్పేది ఎవరూ సరిగ్గా అర్థం చేసుకోరంటూ ఉంటారు శ్రీమతి గాంధీ. ఇది నిజమే. ఇక సాంత్‌లాంగోవాల్‌కి పంజాబీ మాత్రమే వచ్చు, పి. సి. సేఠీ రాసే ఉత్తరాలు హిందీలో ఉంటాయి. ఎలాగ వెంటనే సమాధానం

ఇవ్వగలడు సాంత్‌లాంగోవాల్ ? అందుకనే సి. ఐ. ఎ. రంగంలోకి దిగింది. సేఠీ ఉత్తరాలని పంజాబీలోకీ, లాంగోవాల్ ఉత్తరాలని హిందీలోకీ తర్జుమా చేస్తారు అమృత్‌సర్‌లో మనవాళ్ళు. ఇదీ అంత తేలికకాదు. ఎందుచేతనంటే అన్నిటికీ ఇంగ్లీషు అవసరం. ప్యూర్టోరికో నుంచి మనం తెప్పించిన వ్యక్తికి ఇంగ్లీషు అంత బాగా రాదు. ఆయనకి స్పెయిన్ భాష ఒకటే బాగా వచ్చు. అయినా, ఇంత స్వల్పకాలంలో భాషలు నేర్చుకునే మనవాళ్ళని మెచ్చుకోక తప్పదుకదా ?

"అంతా అనుకున్నట్లే జరుగుతోంది. మన పాచికలు పారుతున్నాయి. అస్సాంలో కల్లోలం, కాశ్మీర్‌లో అలజడి, పంజాబులో ఆందోళన. బహుగుణ ఢిల్లీలో ప్రతిపక్షాల సమావేశాన్ని ఏర్పాటుచేశాడు. అంటే ఉత్తరప్రదేశ్‌లో సయితం అల్లరులు మొదలవుతాయన్నమాట. బహుగుణ విషయంలో జాగ్రత్తగా ఉండాలి. ఆయనని సంప్రదించాలంటే కె. జి. బి. ద్వారా వెళ్ళాలి. ఈ ప్రాంతంలో మనకీ కె. జి. బీ. కీ మధ్య సంబంధాలు ఎలాగ ఉన్నాయో మీకూ తెలుసు. కాని, బహుగుణ పిడివాదపు మనిషి కాదు, ఆయనని ఒప్పించటం అసాధ్యమూ కాదు. అమృత్‌సర్ నుంచి వచ్చే అకాలీ బృందంలో కొందరు ప్యూర్టోరికన్‌లు ఉంటారు.

"నేను చెప్పిందంతా అర్థమయిందా ? కాకపోతే క్షమించండి. భారతదేశంలో రాజకీయాలు చాలా గడ్డుగా ఉంటాయి. ఇక్కడ 200 సంవత్సరాలు ఏలిన బ్రిటిషువారికే వాటి తలాతోకా తెలీలేదు, చివరికి అర్థం అయ్యేసరికి వ్యవహారాలు చెయ్యిదాటిపోయాయి. పాపం వాళ్ళకి ప్యూర్టోరికన్‌ల సహాయమూ లేదు, సి. ఐ. ఎ. సహాయమూ లేదుకదా ! అన్నట్టు ఒక్క విషయాన్ని గురించి చెప్పాలి. ఒక సి. ఐ. ఎ. మనిషి ఫరూక్ అబ్దుల్లాతో సంస్కృతంలో మాటలాడేశాడు. బ్రిటన్ రాణితో స్వాహిలీ భాష మాటలాడితే ఎలాగ ఉంటుంది ? అలాగ ఉంటుంది ఇది ! సంస్కృతం భారతదేశంలో దేశ భాషగా ఉండేదనుకోండి, కాని అది వేల సంవత్సరాల కింది మాట.

ఈ నివేదిక కాపీని విలియమ్‌క్లార్క్‌కి పంపుతున్నాను. ఆయన అక్కడ కేంద్ర శాసన సభవారి ముందు మాటలాడితే అన్నీ తప్పులే ! కాశ్మీరు, అస్సాం, అమృత్‌సర్‌లని గురించి నేను ఎప్పుడూ వినలేదని ఆయన అపవాదు ! తాజమహలు అంటే ఏమిటో కూడా చెప్తాను గమనించండి. అది న్యూయార్కులో ఒక హోటలు కాదు. అది బొంబాయిలో ఒక హోటలు పేరు. జార్జిషుల్‌ట్జ్ అక్కడ ఒక రాత్రి ఉన్నాడు. "మూడు వందల ఏళ్ళ క్రితమే భారతీయులు ఇంత గొప్ప కట్టడం కట్టారా ?" అని ఆశ్చర్యపోయాడు ఆయన." ★






సంక్రాంతి సెలవులిచ్చేరు. పండక్కి రమ్మని అత్తవారు పిలిస్తే పది రోజుల క్రిందనే శ్రీమతిగారు ఉడాయించేసేరు. మరి నేనిప్పుడు బయల్దేరేను.

బస్సు రావడానికింకా ఓ అరగంట టైముంది. బస్టాండంతా పండుగనాటి అత్తారిల్లులా వుంది. మంచుతెరలు చీల్చుకుంటూ కొత్తల్లుడిలా సూర్యుడు ధగధగ మెరిసిపోతున్నాడు. చలిచలిగా ఉన్న ఆ సమయంలో సూర్యకిరణాలు తగలగానే అదోరకమైన గిలిగింతలు పెడుతున్నాయి.

స్టార్టుచేసిన బస్సుల మోతతోనూ, హారన్ల రొదతోనూ చెవులు దిబ్బెళ్ళు పడిపోతున్నాయి. అప్పుడేవచ్చి ఆగుతున్న బస్సుల్లోంచి అత్తారింట్లో అరిసెలు దక్కవేమోనన్నంత ఆత్రుతగా ప్రయాణీకులు తోసుకుంటూ దిగేస్తున్నారు. పేపరు కుర్రాళ్ళు పేపర్లు అంటగట్టడానికి ప్రయత్నిస్తున్నారు టీ కెటిల్స్‌తో కొంత మంది అటూ ఇటూ తిరుగుతూ 'వేడివేడి చాయ్' అంటూ ఊరిస్తున్నారు. మరింక ఊళ్ళపేర్లని దండకం వల్లిస్తున్నాడు మరొహాడు.

ఈ హడావిడి మధ్యనున్నవాడు ఆకర్షించేడు.

టక్కుటక్కుమని నేలని కర్రతో తాకుతూ, గెంతుతూ బస్సు డోర్‌మీద దబ్బుదబ్బునకొట్టూ "రై... రైట్" అని కేకేస్తున్నాడువాడు. వీణ్ణి... ఎక్కడ చూసాను చెప్మా అంటూ దీక్షగా చూస్తూంటే... వాడు నా పక్కకే గెంతుకుంటూ వస్తున్నాడు.

"నేను... చందుగాణ్ణి... బాగున్నావా ?" అంటూ వాడే పలకరించేసరికి అవాక్కయిపోయేను.

"ఒరే... నువ్వు... చందుగాడివా..." అంటూ ఆశ్చర్యంతో ఆనందపడిపోయేను. వెంటనే వాడి అవిటితనానికి విచారమూ, జాలీ కలిగేయి.

"ఊఁ... బాగున్నావా" అన్నాడు వాడు.

"బాగున్నానుగాని... నువ్వేవిట్రా చందూ...ఏం జరిగింది?..." అనబోతున్నాను... నాముందే నేనెక్కాల్సిన బస్సు దూసుకుని వెళ్ళి అంత దూరంలో ఆగింది.

"సరే వస్తాను... తిరిగి వచ్చేటప్పుడు వివరాలు చెప్పూగాని..." అంటూ బస్సెక్కేను.

పరిగెడుతూన్న బస్సులో నేను... సినిమా తెరలా కిటికీ... పరుగులిడుతున్న చెట్లూ, చేమలూ, కొండలూ, కోనలూ చూపెడుతోంది అది. కాసేపటికి నా మనసులోని ఆలోచనలనే అది ప్రతిబింబించడం మొదలెట్టింది...

నేనూ, చందూ చిన్నప్పుడు ఒకే బడిలో చదువుకున్నాం. మా ఇద్దరివీ దగ్గర దగ్గర ఇళ్ళే కావడంవల్ల కలిసేవెళ్ళి కలిసే వచ్చేవాళ్ళం.

చందూ... నల్లగా నిగనిగలాడుతూ, బలంగా, హుషారుగా ఉండేవాడు. ఆటల్లోనూ అల్లరిలోనూ వాడిదే పైచేయి. మరి నేనో సన్నగా, నీరసంగా ఉండేవాణ్ణి. అయినా చదువులో బాగా వుండేవాణ్ణి.

మేస్టారిచేత దెబ్బలు తినని రోజంటూ ఉండేదికాదు వాడికి. ఎన్ని దెబ్బలుతిన్నా ఆ ఒక్క క్షణమే... ఆట స్థలంలో వాడి చురుకుదనం, చెలగాటం చెప్పనలవికాదు. దొంగాటలో వాడిని పట్టుకోవడమంటే పిల్లలందరికీ ప్రాణాంతకం. ఆటల్లో వాడికి పేరు తెచ్చే ఆట కుంటికాలు ఆట. ఆ ఆటలో వాడు రాజు. వాడు కుంటుకుంటూ పరిగెడితే క్షణంలో అందరూ ఔటయిపోయి కోర్టు క్లీనయిపోయేది.

ఆ బళ్ళో చదువు పూర్తయ్యేసరికి...ఏద్దైనా

పనిలో వాణ్ణి పెడితే గాని కుటుంబం జరగని స్థితి రావడంతో వాళ్ళ నాన్న బడిమానిపించేడు. వాడికీ చదువంటే ఆసక్తి లేదు.

కొన్నాళ్ళు హోటల్లోనూ, మరికొన్నాళ్ళు సైకిలు షాపులోనూ, ఇంకొన్నాళ్ళు మోటారు షెడ్‌లోనూ పని చేస్తూండగా వాణ్ణి చూసేను. చివరికి బస్ క్లీనర్‌గా స్థిరపడ్డ యువకుడిగా చందూని గుర్తించేను.

అప్పటికి హైస్కూల్లో బడి పంతులుగా రూపుమార్చుకుని ఇంకా బడికి వెళ్తూండటం చూస్తూ... ఫుట్‌బోర్డు మీద ఒంటి కాలితో నిల్చుని తలుపుమీద దబ్బునకొడుతూ 'రైట్ .రైట్' అని ఓ వైపు అరుస్తూనే ''బడికా .'' అని అడిగేవాడు చందూ.

ఫుట్‌బోర్డు మీంచి ఒక్క ఊపుతో డోర్ మీదికి, అక్కడి నుండి టాపుమీదికి, చెంగున గెంతి లగేజి అందుకునే చందూని చూస్తూంటే ఒక్కోసారి భయం కలిగేది.

నా భయం వ్యక్తం చేద్దామనుకున్నాను. కాని వాడి తత్వం నాకు తెలుసు. ప్రమాదాన్ని ఎదుర్కోవటంలో ఎంతో థ్రిల్ ఉంటుందనీ, ఇటువంటి థ్రిల్సుంటే జీవితం నిర్భయంగా కొనసాగుతుందనీ వాడి నమ్మకం.

మా అత్తవారి ఊరు దగ్గరకు వచ్చేసరికి బస్సు కిటికీమీద ఒంటికాలితో నిల్చున్న బస్ క్లీనర్— స్టిల్ ఫోటోగ్రాఫ్‌లా చెరగని ముద్ర వేసేసింది నా మనస్సుమీద.

పండగ నాల్గురోజులూ అత్తవారింట్లో నాల్గుక్షణాల్లో గడిపేసి తిరుగుముఖం పట్టేను.

బస్ దిగుతూనే చందూగాడి కోసం నాకళ్ళు వెదికేయి. అల్లంత దూరాన టీకొట్టు దగ్గర నుండి చేయెత్తి పిలుస్తున్నాడువాడు. ''స్ట్రాంగ్ టీ... రెండు...'' అంటూ కేకేసేడుకూడాను.

టీ సిప్‌చేస్తున్నంత తేలిగ్గా వాడు వాడికి జరిగిన ప్రమాదాన్ని చెప్పేడు...

ఆ రోజు —

బస్‌లో బంపర్ రష్... తన వాటాకి ఎలా లేదన్నా పాతిక రూపాయలిస్తాడు కండక్టర్... మరి హుషారు కంతులేకపోయింది. డోర్‌పట్టుకు వేలాడుతూ ఈలకొడుతున్నాడు... ముందు వెళ్తున్న ఎడ్లబండి గజలక్ష్మిలా కదుల్తూ వెనికపడ్డ బస్సుని ఓరకంటితో చూసి బెంబేలెత్తి పోయింది. అంతే సడన్‌గా వేసిన బ్రేకు— చందూగాణ్ణి విసిరేసింది. ఆ పడడం పడడం ముందుచక్రం ముందుపడి చక్రాన్ని భరించేసింది వాడి కాలు.

పి. ఈశ్వరరావు

ఆనాడు ఆటలో సరదాకోసం కుంటివాడై గెలిచేడు ఈనాడు జీవితంలో కుంటివాడై... లేదులేదు ఓడిపోలేదు. వాడి ముఖంమీద ఎప్పటికీ చెరగని చిరునవ్వే. .

నా కళ్ళు చెమర్చేయి.

బస్సు యజమానులకు లాభాలమీద లాభాలు చేకూర్చడంకోసం... అలా చేకూరుస్తే తమకు వచ్చే పాతికా పరకా కోసం ఓవర్‌లోడ్ చేసేస్తూ ఆశపడుతూనే ఉంటారు బక్క జనం... కాని వాడి ప్రాణాలు పోయినాసరే లాభంలోంచి ఒక్క పైసా ఎక్కువ ఇవ్వడానికి కూడా ప్రాణం పోతుంది యజమానికి. ఇటువంటి తత్వాలు తెలుసుండీ యజమాని ఒక్క మంచిమాట చెప్తే పొంగిపోయే పనివాళ్ల వర్గానికి చెందినవాడు చందూ. .

సంబరపడుతూ చెరగని చిరునవ్వుతో ఉండే చందూని చూసి నేను విచారించనవసరం లేదు ఈనాడు కూడా వాడి కుంటికాలే అతన్ని నిలబెడుతోంది 

# వ్యక్తిగతం

ప్రూడెన్షియల్ వరల్డ్ కప్ పోటీలలో భారత క్రికెట్ జట్టు వెస్ట్ఇండీస్ పై చరిత్రాత్మకమైన విజయాన్ని సాధించింది. కపిల్‌దేవ్ నిఖంజ్ నాయకత్వంలో భారత జట్టు కలసికట్టుగా ఆడినతీరు, ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తి, ఈ అత్యద్భుత విజయానికి దారి తీసింది ...





రాబర్ట్ కెన్నెడీని 1968లో చంపినందుకు సిర్హాన్ సిర్హాన్‌కి మరణ దండన విధించారు. విష వాయువుతో నిండిన గదిలో పెట్టి చంపుతారన్న మాట.



నైనా, శారదలు అప్పచెల్లెళ్ళు. ఇద్దరూ హర్షద్, హష్‌ముఖ్ లనే అన్నతమ్ములని పెళ్లిచేసుకున్నారు. ఇద్దరూ బొంబాయిలోని బోరా బజారులోని ఒక 4 అంతస్తుల మేడమీదనుంచి ఒకరి చేతులు ఒకరు పట్టుకుని కిందకి దూకి మరణించారు. నైనాకి 3 ఏళ్ల కూతురు ఉంటే, శారదకి కొంచెం ఎక్కువ వయసుకల కొడుకు ఉన్నాడు. సోలంకీ కుటుంబంవారు దర్జీ వృత్తి చేస్తారు. ఆత్మహత్య కారణం తెలియటంలేదు.

# వారఫలం

29-7-1983 శుక్రవారం మొదలు 4-8-1983 గురువారం వరకు

♈ **మేషం:** ధన లోపం లేని వారమే. రాజకీయంగా మేలు చేకూర గలదు. ప్రసిద్ధులతో, సంపద గలవారితో పరిచయం ఏర్పడ గలదు. స్త్రీలకు: రాబడిని మించిన ఖర్చు చెప్పదగిన వారం. కళా సాహితీ రంగాన ప్రసిద్ధి ఏర్పడ గలదు. హితులతో మంతనాలు సాగించే అవకాశ మున్నది.

♉ **వృషభం:** మీతో చెలిమి చేయాలని ఆశింప గల వారున్నారు. స్తోత్ర ప్రియులను దాపునకు చేర్చ రాదు. ముఖ్య బంధువులతో పేచీలు రాగల వారం, 'మౌనం సర్వార్థ దాయకమ్' అని గుర్తుంచుకోండి. స్త్రీలకు: బంధు మిత్రాదరణ, విద్యా వైజ్ఞానిక రంగాలలో మీకు అనుకూలత చేకూరుతుందని గ్రహించి, శ్రమించండి.

♊ **మిథునం:** అనుకూల వాతావరణం అన్ని రంగాలలో చెప్ప దగిన ముఖ్యాంశం. పత్రికా ప్రకటన కర్తలకు, రచయితలకు సదవకాశాలు చిక్కనున్నవి. కొందరకు 'ఆకాశవాణి' లాంటి సంస్థలతో సదవకాశం లభ్యం. స్త్రీలకు: ఉద్యోగంలో చాలమంది 'ప్రమోషన' ఆశింప దగిన సమయం.

♋ **కర్కాటకం:** ఉద్యోగంలో, రాజకీయ రంగంలో, రచనా విధానంలో, గృహ నిర్మాణ కార్యక్రమంలో ఆటంకాలు రానున్నవి. ఎలాగైన శాంతంగా, నిబ్బరంగా దాటుకోవాలి. స్త్రీలకు: వస్తు వాహనం కొనుగోలు చేయగల అవకాశం చిక్కటం, నలుగురలో ఆదరణ లభించటం, చాల కాలంగా రాక నిలచిన పైకం అందటం వార విశేషం.

♌ **సింహం:** ఉత్తమ ఫల దాయక వారం. మీ ప్రజ్ఞ, వాక చక్యం ధైర్య స్థైర్యాలు మూలాన ఒకానొక కార్యంలో విజయ సాధనకు అవకాశ మున్నది. స్త్రీలకు: ప్రగతి, ఆనందం, ఆదాయానికి, ఉద్యోగాభివృద్ధికి అవకాశం గల వారం.

♍ **కన్య:** చాల కాలంగా ఒకానొక శుభ కార్యం మీ అంచనాకు అంద లేదు, ఆలోచనకు సరిపడ లేదు, కలిసి రాలేదు, అలాంటి వ్యవహారంతవారం అనుకూల దాయకం. ఉద్యోగ మందు ప్రగతి సిద్ధం. స్త్రీలకు: నూతన నౌద్యోగ యత్నాలు సాగి రాగలవు.

♎ **తుల:** 'అను కొన్న దొకటి, అయిన దొకటి' గా కనిపిస్తుంది. రాజకీయ వ్యవహారం, కోర్టు వ్యవహా

'ఏది జరుగదు' అని అనుకొన్నారో అదే సానుకూలమవుతుంది. స్త్రీలకు: సర్వత్ర అనుకూలమే.

♏ **వృశ్చికం:** కొందరకు దుస్సాంగత్యపు బెడద ఉంటుంది. కొందరకు చికాకులు అధికం కాగలవు. కొందరకు రాజకీయంగా 'అను కొన్న దొకటి, అయిన దొకటి' గా పరిణమిస్తుంది. స్త్రీలకు: రాజకీయంగా, సాహితీ పరంగా మేలు చేకూర గల వారం

♐ **ధనుస్సు:** అధికారుల ఆదరాభిమానం, రాజకీయ రంగానుభవం గల వారికి సర్వానుకూలత చేకూర గలదు. విరోధి వర్గం వారిని ఒక కంట కని పెట్టి ఉండాలి. చాల అవసరం, 'రోడ్డు' ప్రమాదం జరుగకుండా చూచుకోవాలి. స్త్రీలకు: ప్రయాణ సన్నాహాలు చాలమంది విషయంలో చెప్పదగిన అంశం.

♑ **మకరం:** ధన లోపం రాదు, వ్యాపార లోపం కూడా లేని వారం. అవకాశవాదులను దగ్గర చేర్పకండి ఏదో యిబ్బంది రానున్నది. వృత్తిలో ప్రగతి, కార్మిక వర్గానికి జయం గలవారం. స్త్రీలకు: ముఖ్య బంధు సందర్శనం, శుభ కార్య ప్రస్తావనలు, మాటకు విలువ పెరగటం గమనిస్తారు.

♒ **కుంభం:** చాల చనువుగా ఉన్న వారు ఏదో యిబ్బంది తేగలుగు చున్నారు. జాగ్రత్త! ధన రాబడికి లోపం లేదు, అప్పులు వసూలు కాగలుగుటకు లోపంలేదు, అయినా శుభ వ్యయం చెప్పదగిన అంశం. స్త్రీలకు: చుట్టపక్కాలు చేరటం, శుభ కార్యానుకూలతకు అవకాశం గలవారం.

♓ **మీనం:** మీ యింట శుభ కార్యం జరుగ నున్నది. మీ కోరికలు ఫలితానికి రానున్నవి. పదిమందిలో మీ మాట చెలామణి కానున్నది. నూతన వ్యాపార ప్రయత్నాలు కొందరకు అనుకూలింపనున్నవి. స్త్రీలకు: సాహితీ రంగానుకూలత, ప్రతిష్ఠ, ఆనందం, ఉద్యోగానుకూలత, ఆదరణ చేకూర గల వారమే. గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక




# వజ్రోత్సవ సంచిక

## [16-9-1983]

## వినాయక చవితి సంచిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1908లో స్థాపించినప్పటి నుంచి నేటి వరకు ప్రవర్థమాన మవుతూ 75 సంవత్సరాలు పూర్తిచేసుకొని వజ్రోత్సవ సంవత్సరంలో అడుగు పెడుతోంది.

ఈ సందర్భములో ఆంధ్ర సచిత్ర వారపత్రిక వినాయక చవితి సంచిక జన్మదిన సంచికగా ప్రముఖుల రచనలు, చిత్రాలు, వ్యాసాలు, కార్టూన్లు, మరియు అనేక విశేషాలతో సర్వాంగ సుందరంగా, పూర్తి ఆఫ్ సెట్ ముద్రణతో యెక్కువ పుటలతో వెలువడనున్నది.




(గత సంచిక తరువాయి)

ఏకవీర మందహాసం చేసి అన్నది —

"ఎవరు నా తండ్రి ? నాకు తల్లీ తండ్రీ సోదరుడూ ప్రియుడూ అన్నీ ఆ శ్రీనివాసుడే. ఆయనకే అంకితమయిన యీ తనువుకూ, మనసుకూ నా — నీ — అన్న భేదం లేదు. నీవు ఎవరయినా నాకు ఒకటే. నా స్వామి క్రీడా వినోదంలో నీవుకూడ ఒక పావు మాత్రమే."

ఎదురుచూడని యీ మాటలు జైనస్వామికి ఆశ్చర్యం కలిగించేయి. తనకు పుట్టిన యీ పసికందు యింతగా ఎదిగిపోయిందా ?

"అమ్మా ! యీ సృష్టి ఎవరి క్రీడా వినోదమూ కాదు. మనం చూస్తున్నది, వింటున్నది అంతా నిజం" అన్నాడు జైన సిద్ధాంతాలు వల్లిస్తూ.

"అయితే యిప్పుడు నీవు విన్న నా మాటలు కూడా నిజమే !" అన్నది ఏకవీర. ఏ తత్త్వ శాస్త్రమూ, ఏ తర్కశాస్త్రమూ చీల్చిచెండాడలేని ఆమె బుద్ధి నైశిత్యానికి తలక్రిందులయ్యేడు జైనస్వామి. ఆమెకు చెప్పే సమాధానం ఆయనకు మిగలలేదు.

"అమ్మా ! నీకు జన్మ యిచ్చిన తండ్రిని. యిరవై ఏళ్ళకు మొదటిసారిగా కనుపించేను. నామీద అనురాగం కలుగలేదా నీకు ? సుకుమార మయిన నీ రూపం వెనుక యింత కాఠిన్యం దాగివుందా ?" ఆర్ద్రమయిన గొంతుకతో అడిగేడు జైనస్వామి.

"ఈ జన్మలో నీవు నాకు తండ్రివి. పోయిన జన్మలో నీవు నాకు ఏమి అవుతావో చెప్పగలవా ? వొచ్చే జన్మలో ఏమి కాగలవో చెప్పగలవా ! నిరాఘాటమూ, అప్రతిహతమూ అయిన యీ కాలచక్రంలో ఒక మానవజీవి జన్మకుండే నిడివి ఏపాటిది ? యీ కాస్తదూరం నీవు నా తండ్రివలె నటిస్తావు. ఆ తరువాత ఏమి అవుతావు ? యీ కాస్తదానికి యింత లంపటం ఎందుకు పెంచుకోవాలి.

చెప్పేనుగా ! నాకు అన్నీ ఆ దైవమే ! నా శ్రీనివాసుడే !" అన్నది ఏకవీర. జైనస్వామికి మనసు తడిసి బిగిసిన కొయ్యలా చలనం కోల్పోయింది.

"ఏకవీరా ! పూర్వజన్మలూ, పునర్జన్మలూ యివన్నీ భ్రాంతి తల్లీ. నీవు భ్రమలో ఉన్నావు."

"అలాగా !!"

"అవును తల్లీ !"

"యీ యిరవై సంవత్సరాలనుండీ యీ ఏకవీరతో మీ అనుబంధం ఎలాంటిదో చెప్ప గలరా ?"

"నీవు నా కుమార్తె అన్న విషయం తెలియదుగా."

"యిప్పుడు తెలిసింది కనుక మీకు నామీద పుత్రికా వాత్సల్యం మోసులెత్తింది. నేను నేను కానని తెలిస్తే అది మళ్ళీ అంతరిస్తుంది. కాబట్టి యీ రవ్వంతసేపు మీకు కలిగిన వాత్సల్యం భ్రమ అని తేలిపోవటంలేదూ ! నన్ను కూడ ఆ భ్రమలోకి లాగివెయ్యాలని మీరు కోరటం స్వార్థం కదూ !" అన్నది ఏకవీర.

జైనస్వామికి యిక వాదించే శక్తి లేకపోయింది.

"అయితే అమ్మా ! నీ తుది నిర్ణయం ఏమిటి ?" అన్నారు నాలిక మడతపడిపోతూ వుండగా.

"నా ఏకాంతానికి నన్ను వదలివెయ్యండి" అంటూ అభ్యర్థించింది.

జైనస్వామికి యిన్ని దశాబ్దాలుగా అజ్ఞాత వాసం చేస్తున్నా కలుగని మనస్తాపం యీ క్షణాన కలిగింది.

ఆయనది రాజసప్రవృత్తి. అందువల్ల ప్రతిఫలంగా ఆయనలో ప్రతీకారవాంఛ ప్రజ్వరిల్లింది.

"నీవు తప్పించుకునిపోయావు. అయినా పూర్ణాహుతిని నిర్విఘ్నంగా ఎలా సాగుతుందో చూస్తాను. రాణి రుద్రాంబ క్షేమంగా ఓరుగల్లు చేరితే నేను శిరోముండనం చేయించుకుంటాను" అని భీకరంగా ప్రతిజ్ఞచేసి పెద్ద పెద్ద అంగలతో ఆ చోటు విడిచి వెళ్ళసాగేడు.

ఏకవీరకు ఆ తరువాత అరక్షణం కూడ ఆ విషయం గుర్తులేదు. ఆమె శ్రీనివాసుని దర్శనం కోసం పరితపిస్తోంది.

ఆమె చాలసేపు విలపించేక స్వామి దర్శనం అయింది.

"స్వామీ ! ఎందుకిలా నన్ను ఒంటరిని చేసేవు. నన్ను బాధించటంవల్ల నీకు కలిగే ఆనందం ఏమిటో వివరించవూ ?" అన్నది ఏకవీర.

స్వామి ఉలుకలేదు. పలుకలేదు. స్వామి కోసం మేలైన పూలను ఏర్చి, స్వయంగా తన చేతులతో కూర్చిన మాలను వేస్తే "—నాకోసం తెచ్చావా యీ మాల. ఎంత బాగున్నది ఏకవీరా ! నీవే ఒక పూమాలవై నా వక్షఃస్థలాన్ని అలంక రిస్తే ఎలా వుంటావో అలా వున్నది యీ మాల" అంటూ పరిహాసాలు ప్రారంభించలేదు. మూగ నోము పట్టేరు స్వామి.

యీ సృష్టి భారమంతా తన భుజస్కం

**జరిగిన కథ — 13 :** పద్మగంధి వెంకన్నదొర ఇంటికి వస్తుంది. రాబోయే కురుక్షేత్ర సంగ్రామంలో తన కూతురు బలిగాకుండా కాపాడుకోడానికై ఆమె జన్మ రహస్యం వెంకన్నదొరకు చెపుతుంది. అది విని ఆశ్చర్యపోతాడు వెంకన్నదొర. ఏకవీర కృష్ణస్వామి, పద్మగంధిలకు జన్మించిన పుత్రిక అని హరిజనులతో అబద్ధం చెపుతాడు. ఈ సంగతి తెలుసుకొని కృష్ణస్వామి విచారపడి పద్మగంధిని పిలిపించి ఆమె కూతురుని ఆమె కప్పగిస్తాడు. సృష్టిలో అన్నింటికన్న పవిత్రమైనది మాతృస్థానం అని తెలుసుకుంటుంది ఏకవీర. త్రిపురాంతకుడు కృష్ణస్వామి ఆశ్రమానికి వచ్చి ఆయనమీద వెంకన్నదొర చేసిన అభియోగం అబద్ధమని అక్కడివారికి చెపుతాడు. రేపు పూర్ణాహుతి అనగా రాణి రుద్రాంబ, ఆమె కుమార్తెలు మొగలిచర్లలో విడిది చేసారు. శివదేవయ్య జైన మహాసభల గురించి తెలుసుకోవాలని ఆసక్తి కనపరుస్తారు. శ్రీదేవుని శిల్ప నైపుణ్యానికి మెచ్చి అతన్ని ఆస్థాన శిల్పిగా ఓరుగల్లుకు ఆహ్వానిస్తాడు శివదేవయ్య. జైనానుయాయిత్వం వహించలేదని హరిజనులను హింసిస్తాడు వెంకన్నదొర. ఆ హింసాకాండను ఆపడానికి వెళ్ళిన కృష్ణస్వామిపై కర్రతో విసిరిన దెబ్బ గౌరిదేవమ్మ అడ్డు రావడంతో ఆమె తలపై పడింది. శ్రీదేవుడు ఏకవీరకు తన ప్రేమను వ్యక్తంచేయగా ఆమె ఆ ప్రేమను సమాజపరం చేయనుంటుంది. జైనస్వామి ఏకవీర దగ్గరకు వస్తాడు.

ధాల మీద అవలీలగా మోసే స్వామికి యింత దిగులెందుకో అని ఆలోచిస్తోంది ఏకవీర.

ఆమెకు కారణం కనుపించలేదు. స్వామి పలుకనూలేదు.

"స్వామీ ఏమిటి నాకీపరీక్ష—?" గోముగా అడిగింది ఏకవీర.

స్వామి పలుకలేదు. కన్నెత్తి అయినా ఏకవీరను చూడలేదు. ఏకవీరకు మనస్తాపం అధికం అయింది.

ఆమె స్వామి చుబకాన్ని పట్టుకుని బ్రతిమాలింది. స్వామి తల ఎత్తేరు. ఆమె కన్నులలోకి జాలిగొలిపేలా చూచేరు. ఆయన కన్నులు ఆర్ద్రమయి ఉన్నాయి. ఏకవీర చకచ్చకిత అయింది

'స్వామీ! నీ కనులు ఆర్ద్రము అయి వున్నాయి ఎందుకని? చతుర్దశ భువనాలలోని జీవుల కన్నీరు తుడిచే స్వామివి. నీవు కన్నీరు నింపుకుంటున్నావా? ఆ కన్నీరు నేల రాలితే యీ భూమి మీది జీవులన్నీ ఏమయిపోతాయి. భూమి నీ కన్నీటి బిందువును భరించగలదా స్వామీ? ఏనాడూ లేని యీ విపరీతం ఏమిటయ్యా? ఎందుకయ్యా అలా వున్నావు? నవ్వుతూనే పరిహాసాల పన్నీటిజల్లు కురిపించే స్వామివి యీ ప్రొద్దు కన్నీరు తెచ్చేవా? ఏమిటయ్యా యీ విపరీతం యిదొక నాటకమా? లేక నేను కల కంటున్నానా? నిన్ను నొప్పించిన వారు ఎవరయ్యా! నీ చమత్కారపు చూపులు సోకగానే కఠిన శిలాతల్పాలు కూడ స్ఫటిక శిలా శయ్యలవలె ఆనందాన్ని కలిగించేసి. యీనాటి నీ ధోరణి వల్ల మనసంతా వ్యాకుల మవుతోంది కదయ్యా! నేను ఏదయినా అపరాధం చేస్తే క్షమించు యీ జీవితమూ నాలోని సర్వశక్తులూ పణంగా చెల్లించి నీ కన్నీరు తుడుస్తాను అయినా మనసు ఉండబట్టక నేను అంటున్నానే కాని, అల్పమానవ కంకాళంలో ఉన్న యీ జీవి నీ ఆర్తిని ఎలా తీర్చకలదు? అయినా నేను భరించలేను. నీ బాధకు కారణం ఏమిటో చెప్పాలి నువ్వు. లేకపోతే నా మీద ఆన?" అంటూ తొందరించ సాగింది ఏకవీర.

స్వామి ఏదో మాట్లాడాలని ఉద్యుక్తులు అయ్యేరు ఆయన పెదవులు విచ్చుకున్నాయి. తెల్లని పలువరుస చూచి నక్షత్ర దర్శన మయినట్లు భ్రమించింది ఏకవీర.

"ఏకవీరా! ఆనందమూ దుఃఖమూ వెలుగు నీడల వంటివి. అవి నేనే సృష్టించాను. వాటిని నాలోనే ఆవిష్కరించాను."

"వేద వేదాంగవేత్తలయిన మహా పురుషు లంతా నీవు ఆనందమూర్తివని పొగడుతారే. సుఖంతోపాటు, ఆనందంతోపాటు దుఃఖాన్ని నీలో ఆవిష్కరించేవా? యిది నేను ఎలా నమ్మ వలెనయ్యా నా స్వామీ?"

"అయితే నన్ను అనుమానిస్తావా?" ప్రశ్నించేరు స్వామి.



"అనుమానం కాదు స్వామీ. ఆవేదన. ఆర్తి."

"నాకు కలిగిన తాపం కేవలం నిష్కారణం కాదు ఏకవీరా! అందుకు తగినంత కారణం ఉన్నది."

"ఏమిటి దొరా ఆ కారణం?"

"ధర్మానికి హాని సమకూడుతున్నది." యీ సమాధానం విని ఏకవీర మధురంగా నవ్వింది.

"ఎంత చక్కగా చమత్కరిస్తున్నావయ్యా! నీవు సృష్టించిన ధర్మానికి హాని అయితే నీవు రక్షించుకోలేవూ! హిరణ్యాక్షుడు వేదాలను దొంగిలించినప్పుడు నీకెవరు సాయం చేశారు? రావణుడు అజేయుడై లోకంమీద విరుచుపడితే ఎవరు లోకాన్ని అతడి బారినుండి కాపాడారు శిశుపాల దంతవక్త్రుల్ని ఎవరు సంహరించేరు స్వామీ అయినా అంతటి హాని యిప్పుడెలా సంభవించింది. ఎవరివల్ల?"

"అవును ఏకవీరా! అవి కలియుగపు రోజులు కావు. నన్ను నేనే సృజించుకుని అధర్మాన్ని ఎత్తివేసేవాడిని. కాని యిప్పుడు నాకు ఒక నిమిత్తం అయిన వస్తువు కావాలి. సరాసరి నేనే ఏమీ చేయలేను" అంటూ వివరించేరు స్వామి.

ఏకవీరకు అర్థమయింది. తాను చేయవలసిన

పని ఏదో ఉన్నదని. ''స్వామీ! యిప్పుడు ధర్మానికి హాని ఎలా అయింది. ఎవరివల్ల?''

''ఏకవీరా! నేను యజ్ఞమూర్తిని. యజ్ఞానికి అధిష్ఠాతను. యజ్ఞం విఘ్నమయితే ధర్మానికి హాని అవుతుంది. అది జరుగుతున్నది కూడ మానవులవల్ల. నేను ప్రత్యక్ష చర్య పూనుకొనటం అసాధ్యం. యిది కలియుగం అయినందువల్ల—'' అంటూ ధర్మ సంకటాన్ని వివరించేరు స్వామి. ఆ పని బహుశః తనవల్ల జరగాలనికాబోలు అనుకున్నది ఏకవీర.

అంతకన్నా తనకు కావలసింది ఏమున్నది? స్వామి సేవలో తన బ్రతుకు పునీతమయితే అంతకన్నా కోరవలసింది ఏమున్నది. ఈ బ్రతుకులో పరమార్థం అదే కదా!

'స్వామీ! గొప్ప చిక్కే వచ్చిందయ్యా! ఇప్పుడేం చెయ్యాలని సంకల్పించావు?'

''యజ్ఞానికి పూర్ణాహుతి జరగాలి. దాన్ని విఘ్నంచేసేందుకు ప్రయత్నాలు ప్రారంభమయినాయి. జైనులు యజ్ఞ వేదికమీదికి దాడి రావాలన్న కోరికతో బయలుదేరు తున్నారు. ఈ దురంతాన్ని ఆపగలిగిన దానవునీవే! వెంటనే బయలుదేరు!' అంటూ ఆదేశించారు స్వామి.

స్వామి ఆదేశాన్నివిన్న తక్షణమే ఏకవీర లేచి రివ్వురివ్వున తారాజువ్వలా పరుగుతీసింది. ఆమెకు తన స్వామి వెన్నాడివస్తున్న అనుభూతి కలుగుతోంది.

## తిరుచరణాలు

ఉద్విగ్నతవల్ల ముఖం జాజ్వల్యమాన మయిపోయింది. చరిత్రలో ఎన్నో కథలున్నాయి. ధర్మం స్వామివల్ల రక్షించబడుతుంది. ఇప్పుడా ధర్మరక్షణ భారాన్ని తన మీదుంచాడు స్వామి.

ఏకవిర చక చకా నడుస్తోంది. తన కర్తవ్య మేమిటో ఆమెకు స్పష్టంగా తెలుసు. కాని ఎక్కడకువెళ్ళాలో ఏ పని చెయ్యాలో తెలియదు. స్వామి దారి చూపుతున్నారన్న భావంతో నడుస్తోంది.

ఏకవీరాదేవి ఆలయం దాటి వచ్చేసరికి వేద మంత్రాలు శృతిమధురంగా విన్పిస్తున్నాయి. మహాప్రవర చెప్తున్నారు కృష్ణస్వామి. అంటే... పూర్ణాహుతి జరిగేసమయం ఆసన్నమయింది.

తలవొంచుకుని ఎకా ఎకిన వెళ్తున్న ఏకవీర ఆశ్రమప్రాంతాలకు రాగానే తలఎత్తి చూచింది.

దూరంనించి ఆకాశంలోకి దుమ్ములేస్తూ కన్పించింది. ఆశ్రమంలో రుద్రాంబ,శివదేవయ్యా అందరూ యజ్ఞవేదికముందు నిలచి పూర్ణాహుతి జరిగే ఆ మధురక్షణాలకోసం ఎదురు చూస్తున్నారు.

వారు మిన్ను విరిగి మీదపడినా క్రతువు పూర్తికానిదే కాలు కదపరాదు. విరోధులు మీద పడి తల నరుకుతున్నా కదలకూడదు.

దూరంనించి కన్పించే ధూళి మేఘం దగ్గర అయింది. దాదాపు నాలుగువందల అశ్వికులున్న దళం అది. అందరి చేతుల్లోనూ ఆయుధాలున్నాయి. వారికి నాయకుడు జైనస్వామి.

జైనసభలు విఘ్నమయినాయి. వెంకన్నదొర తన అర్థాంగి చావుబ్రతుకుల మధ్య పడి ఉండటంతో అన్నీ వొదిలివేసి విరక్తుడయిపోయాడు నిస్సంగు డయినాడు. అంతటితో జైనస్వామి ఉద్యమానికి వెన్నెముక విరిగినట్లే అయిపోయింది కాని జైనస్వామి అసంతృప్తితో వెనుదిరిగిపోలేదు అతడు ఆశాజీవి

జైనసభలు విఫలమయినాయి. యజ్ఞం సఫలమయితే పాలకులదృష్టిలో తాను పలుచన అవుతాడు. ఇక వెన్నంటి తరుముతారు, అందునించి యజ్ఞం విఘ్నం చేసి తీరాలని అతని సంకల్పం

పూర్ణాహుతి అర్ధంతరంగా ఆగిపోతే యజ్ఞం విఫలమయినట్లే. రాణి రుద్రమ్మ యజ్ఞవేదిక దగ్గరకు నామమాత్రపు అంగరక్షకదళంతో వెళ్తోంది. కాబట్టి ఇదే చక్కని అవకాశం.

యజ్ఞమూ విఫలమవుతుంది రుద్రమదేవి బందీ అవుతుంది. ఆనందంతో మరింతవడిగా అశ్వాన్ని అదలించాడు.

కాని అది కదలక ఆగిపోయింది. ముందు కాళ్ళు పైకెత్తి నిలిచింది. ఎదురుగా అగ్నిశిఖ వలె నిలిచి ఉంది ఏకవీర.

ఆమె ఒక చేతితో గుర్రపు కళ్ళాన్నిపట్టి







నిలిపివేసింది. జైనస్వామి గుర్రం దిగాడు. అనుచరులంతా దిగిపోయారు.

ఆమె ముఖంలోకి చూడగానే జైనస్వామి రౌద్రం కొంతవరకూ శాంతించింది. భావతీవ్రత తగ్గింది. ప్రశాంతమయిన ముఖముద్రతో అంత సైన్యాన్ని ఏకాకిగా నిలువరించిన ఆమెను చూచి చకితుడయినాడు జైనస్వామి.

'అమ్మా! ఇది శాంతి యజ్ఞం కాదు. హిందువులు జైనులు తమ ప్రతిష్టల్ని తేల్చుకునే సమయం. దీన్ని నీవు ఆపలేవు. తప్పుకో' వాత్సల్యం నిండిన స్వరంతో హెచ్చరించాడు జైనస్వామి.

వాస్తవానికి యీ పనిని మరొకరు చేసి వుంటే జైనస్వామి తన కరవాలంతో అశ్వంమీద నుండి దిగకుండానే వారి తలను నరికివేసి మార్గం సుగమం చేసుకునేవాడు. కాని యిప్పటి స్థితి వేరు. యీమె ముఖంలో ప్రజ్వరిల్లే తేజస్సు వేరు.

ఆయనకు బుద్ధి తెలిసినప్పటి నుండీ యింత దివ్యమయిన తేజస్సును ఎవరిముఖంలోను చూడలేదు.

"శాంతి యజ్ఞమయినా సమరాంగణమయినా తక్షణమే మీరు వెనుదిరిగి పోవాలి" అన్నది ఏకవీర. ఆమె కంఠం గంభీరంగా తొణుకు బెణుకులు లేకుండా ఉన్నది.

ఆమె తెగింపును చూచి ఆశ్చర్యపోయేడు జైనస్వామి.ఆయన ప్రక్కనే ఉన్న అశ్వంమీద నుండి ఆహవమల్లు క్రిందికి దూకేడు.

"గురుదేవా! పార్శ్వ నాధునికి తొలిబలంగా కావాలని కోరుతున్న యీమెను మీరు బతిమలాడవలసిన అవుసరం లేదు. మీరు తప్పుకోండి. నా కరవాలం రక్త కండూతితో తహతహలాడుతోంది" అంటూ స్వరున ఒర నుండి కరవాలాన్ని లాగేడు. అతడు బలంగా గురిచూచి కత్తిని ఏకవీర మీద విసిరేడు. క్షణంలో ఆమె తల కందుకంలా దొర్లుతూ వెళ్ళి యజ్ఞవాటికలో పడవలసిందే.

కాని; జైనస్వామి అంతకన్నా లాఘవంగా మెరుపు వేగంతో తన కరవాలాన్ని ఆహవమల్లు కరవాలానికి అడ్డు వేసేడు. అనుకోని యీ సంఘటనకు ఆశ్చర్య పడిపోయాడు ఆహవమల్లు. ఆయనకు తమ గురువుగారి తత్త్వం బాగా తెలుసు. తన కర్తవ్య దీక్షకు అడ్డు వచ్చినవారిని నిర్దాక్షిణ్యంగా వధిస్తాడాయన. కాని యీమె విషయంలో యిలా ఎందుకు జరిగిందో అర్థం కాలేదు. రాపడిపోయేడు.

"గురుదేవా! ఏమిటిది? ఏమిటి మీ సందేహం" అన్నాడు ఆహవమల్లు.

"స్వార్థం నాయనా" అన్నారు జైనస్వామి.

"ఒకవేళ యీమెను వధించటం మీకు సమ్మతం కాకపోతే లాగి ప్రక్కకు తీయండి. ముందు మన కర్తవ్యం పూర్తి చేయాలి. ఆ తరువాత ఈమె విషయం విచారించవచ్చును" అంటూ ఆమెను మార్గానికి అడ్డు లాగాలనే ఆమె మీదికి లంఘించేడు ఆహవమల్లు.

అప్పటివరకూ తన స్నేహితురాలి అద్భుత తేజస్సును తనివితీరా చూస్తున్న లక్ష్మి ప్రమాదాన్ని పసికట్టింది. ఆహవమల్లు మరుక్షణంలో ఆమెమీద చేయి వేయబోతాడనగా వెనుకకు రెండు అడుగులు వెళ్ళి విసురుగా వచ్చి ఒక్కతాకు తాకింది. ఆహవమల్లు వెల్లికితలా పడిపోయేడు.

వెనుక సైన్యంలో హాహాకారాలు చెలరేగాయి. తమ గమనానికి అవరోధం కలగటమూ, ఆ వెంటనే జైనస్వామి అశ్వాన్ని అవరోధించటమూ, అహవమల్లు ఆవుదూడ తాకిడితో విల విల లాడుతూ నేలమీదపడి తన్నుకోవటమూ ఇదరితా వారికి అర్థం కాలేదు. కొందరు సైనికులు అశ్వాల మీది నుండి దిగారు. వారిని చూచి ఇంకా కొందరు, వారిని చూచి మరికొందరు యీ విధంగా అందరూ గుర్రాలు దిగిపోయేరు

జైనస్వామికి ఆవుదూడ లక్ష్మి మీద విపరీతమయిన కోపం వచ్చింది. కాని ఏమీ చేయలేకపోయేరు. అది తనకూతురు పవిత్రతనూ, ప్రాణాలనూ కాపాడింది మరి!!

మనిషిలో నుండి స్వార్థమనేది ఎన్ని రూపాలలో వెలువడుతుందో ఊహించటం కష్టం జైనస్వామి స్థితి అంతే అయింది

యీ యిరవై సంవత్సరాల నుండీ ఆయనకు నా అని చెప్పకునే రక్తసంబంధీకులు ఉన్నట్లు తెలియదు. ఆయనకు నా అనేవారు ఎవరూలేరు పద్మగంధి ప్రియురాలే కానీ రక్తబంధం ఎలావొస్తుంది యిప్పుడు ఏకవీర తన రక్తం అనుకోగానే ఆయన ఆలోచనలకు సంకెలలు పడ్డాయి. ఆయనలో ఎక్కడో, ఏనాడో యింకిపోయిన మమతా, మానవత్వమూ మళ్ళీ తల ఎత్తేయి. హృదయం యిన్నాళ్ళుగా రాజకీయాలతో బండబారిపోయి యిప్పుడు చిగురించింది. అది ఆయనకు ఇతఃపూర్వం తెలియని ఒక మహత్తరమయిన అనుభూతి

ఆ అనుభూతి ఆయనకు గిలిగింతలు పెడుతోంది. కఠిన శిలాసదృశమయిన ఆయన హృదయంలో పితృత్వం క్షణంసేపు తలఎత్తింది ఇంతకుముందు ఏకవీరను కలసింది రాజకీయ కుతంత్రంతోనే. కాని యిప్పుడు యీ దివ్యమూర్తిని చూచి తన రక్తం కాదు అనీ,

## కంప్యూటరు వైద్యం!

జపానులో, ఒక మందుల షాపు యజమాని, అతని అనుచరులు కలసి ఒక కంప్యూటరును రూపొందించారు. దీని సహాయంతో, వైద్య పరిజ్ఞానం లేని వ్యక్తులు కూడా వివిధ రకాల వ్యాధులకు వైద్య సలహాలను పొందగలరు. అయితే దీనిద్వారా జపాను, చైనా దేశాల ఔషధాల (మూలికల) ఉపయోగాన్ని మాత్రమే తెలుసుకొనటానికి వీలవుతుంది. ప్రయోగాత్మకంగా ఫిబ్రవరిలో విడుదల చేసిన కంప్యూటర్లు అమితంగా ఆదరణ పొందాయి వ్యాధిని గుర్తించేందుకు పాశ్చాత్య వైద్య సమాచారాన్ని ఈ కంప్యూటరులో పొందుపరిచారు.

# ఇ'వేమన'పద్యాలు




మఱపు తెఱపుచేత మానవ దేహంబు
నెత్తవలసెగావి యిహమునందు
మఱపు లేకయున్న మరణమెక్కడిదన్న
విశ్వదాభిరామ వినుర వేమ.

## తిరుచరణాలు

కర్తవ్యానికి రక్తసంబంధం లేదు అనీ అనుకోలేక పోయింది ఆయన హృదయం.

ఇటువంటి ఆలోచనల నుండి, మమకారపు బంధాల నుండి, రక్తసంబంధపు సంకెళ్ల నుండీ ఆయన మనసును త్రెంచుకోవటానికి చాల సమయమే పట్టింది.

ఆయన తేరుకుని మళ్లీ తన హృదయాన్ని కఠినశిలా సదృశం చేసుకుని; కర్తవ్యాన్ని స్మరించేసరికి సమయం మించిపోయింది. యజ్ఞం పూర్తి అయింది. పూర్ణాహుతి హవ్యవాహనుడి వశమయింది. ఆయన నాలుకలు చాపి దానిని స్వీకరించి అధిష్టాతలకు అందించ సాగేడు.

త్రిపురాంతకదేవుడు అంతకు ముందే పరిస్థితిని గమనించి మరొక మార్గం నుండి

రెండు సైన్యాలు ఆశ్రమ ముఖద్వార వద్దనే ఢీకొన్నాయి. పరిస్థితి విషమించింది అని గ్రహించిన జైనస్వామి ఏకవీరతో అన్నారు.

"అమ్మా! హృదయాన్ని కఠిన శిలా సదృశంగా మార్చి యింత కాలము కర్తవ్యమని దేనిని భావించానో దానినే ఆచరించాను ఈనాడు నా హృదయంలో చెలరేగిన మమతానుబంధం నా ఓటమికి దారి అయింది. అందువల్లనే కర్తవ్య నిష్ఠకు మమతానుబంధాలు ప్రతిబంధకాలు అవుతాయి అని గ్రహించాను సమయం మించిపోయింది. నేను మళ్ళీ అడవులకు పారిపోతున్నాను" అంటూ శలవు తీసుకున్నాడాయన. అశ్వాన్ని అధిరోహించి అదలించేడు. అది ఆయనను మోస్తూ సురక్షితమయిన అటవీ ప్రాంతాలవయిపు దారితీసింది.

యజ్ఞం పరిసమాప్తి అయింది ఏ కొంచెమో సంశయాత్ములయివున్న మొగిలిచర్ల గ్రామ ప్రజలకు మహదానందదాయకమయింది. కృష్ణస్వామి ఆనందానికి అవధుల్లేవు.

అంతా అయ్యేక అప్పుడు ఏకవీర విషయం ప్రస్తావనకు వచ్చింది. ఆశ్రమానికి వెలుపల జరిగిన కథ వారికి అప్పుడు తెలిసింది.

జైనస్వామి వెనుదిరిగిపోగానే, యజ్ఞం పరిపూర్తి అయిందని తెలియగానే ఏకవీర హృదయం కడలితరంగమే అయింది. యిక నేను వచ్చిన కార్యం పూర్తి అయింది అని ఆమె హృదయం చెప్పసాగింది.

తన ప్రాణాలను కాపాడిన లక్ష్మినీ, పుట్టిన తదాది తన కొంగు పట్టుకుతిరిగిన పద్మనూ కడసారిగా ముద్దాడి ఆమె విసవిసా ఆలయంకేసి నడువసాగింది.

రుద్రాంబ వెంట శివదేవయ్యా, కృష్ణస్వామీ యీ విచిత్రాన్ని చూస్తూ ఆలయానికేసి రాసాగేరు. ఆ గ్రామంలో అందరికీ ఈ జరుగుతున్నది ఏమిటో చూడాలన్న ఉత్సుకత అధికమయింది. మొత్తం గ్రామం కదలి ఏకవీర ఆలయానికి వొచ్చింది. ఏకవీర ఆలయంలో ప్రవేశించేముందు ఆమె తేజస్సును చూచి విచలితుడయ్యేడు అర్చకస్వామి. ఆయన యితః పూర్వమే ఆమెతో వేదాంత చర్చలు చేసి, ఆమెలోని తన్మయభావుకతను అర్థం చేసుకుని ఉన్నాడు. ఆమె అతిలోక మానసిక స్థితిని పొందిన స్త్రీమూర్తి అని ఆయనకు తెలుసు.

ఆమె నిర్వికారంగా నడుస్తూ ఏకవీర ఆలయంలో ప్రవేసించి గర్భాలయంలో అడుగు పెట్టేముందు క్షణంసేపు నిలిచి వెనుదిరిగి చూచింది. కృష్ణస్వామి వొస్తూ కనిపించేరు.

"అమ్మా ఆగిపోయేవేల. గర్భాలయంలోకి నీవు రావొచ్చు తల్లీ!" అంటూ పిలిచేరు అర్చకస్వామి.

"మీరే వెలుపలకు రండి" అన్నది ఏకవీర. ఆమె పిలుపును ఆజ్ఞగా శిరసావహించి వెలుపలకు






బులుసు వేంకటరమణయ్య

# రావణునకు పది తలలున్నాయా?

విశ్రవసుని భార్య కైకసికి ముగ్గురు కుమారులు; ఒక కుమార్తె. కుమారులు రావణ, కుంభకర్ణ, విభీషణులు. కుమార్తె శూర్పణఖ. రావణునికి దశకంఠుడు, దశాననుడు, దశశిరస్కుడు మొదలైనవి స్వభావాన్నిబట్టి వచ్చిన పేర్లేకాని, తండ్రి పెట్టిన పేర్లు కావు. తక్కిన సోదరులిద్దరికీ ఒక్కొక్క తల ఉండగా, రావణునికి పది తలలు ఉండడం వింతగానే కానవస్తుంది.

పదిమంది అరిస్తే ఎంత ధ్వని అవుతుందో, ఇతడు ఒక్కడూ అరిస్తే అంత ధ్వని అవుతుందనే భావంతో రావణునికి దశకంఠుడనే పేరు వచ్చినదనీ, దాన్నిబట్టే దశాననుడు, ఆ ముఖాలనుబట్టి దశశిరస్కుడూ అనే పేర్లు వచ్చాయనీ కొందరు విచక్షణాల అభిప్రాయం. పది తలలనుబట్టే ఇరవై చేతులు పెట్టబడినవి. మరి కాళ్లు మాత్రం రెండే!

కార్తవీర్యార్జునుడు సహస్రబాహుడు. అంటే అతనికి వెయ్యి చేతులున్నాయని అర్థం కాదు. వెయ్యి చేతులతోనూ చేసే పనిని రెండు చేతులతోనూ చేయగలడన్నమాట! రావణుని విషయంలోనూ అదే పద్ధతిని గ్రహించాలి.

ఇదిః యిలా ఉండగా — రావణునికి పది తలలు ఉన్నాయని అనుకోడానికి ఒక పురాణ కధ ఆధారంగా ఉన్నట్లు కానవస్తున్నది.

శ్రీహరి నరసింహావతార సమయంలో హిరణ్యకశిపుడు, స్తంభంలో శ్రీహరిని చూపవలెనని ప్రహ్లాదుని కోరినప్పుడు ఉగ్రనరసింహమూర్తి స్తంభం నుండి వెలువడినప్పుడు ఆ రాక్షసరాజు ఆ దేవదేవునితో యుద్ధానికి సిద్ధపడ్డాడు. నరసింహమూర్తి ''వాడియైన నాపది నఖాలతోనూ ఇప్పుడే నీ గుండెలను చీల్చి నిన్ను చంపుతాను.నీవు మళ్లీ జన్మపొంది,పదితలలతో ఉండి, నాతో విరోధించగలవు. అప్పుడు నీ పది తలలని తెగ్రవేసి నిన్ను సంహరించగలను''అని చెప్పి మరీ హిరణ్యకశిపుని గుండెలను చీల్చి చంపాడట! ఆ హిరణ్యకశిపుడే త్రేతా యుగంలో రావణుడై పది తలలతో జన్మించాడట! సీతాదేవిని అపహరించి, రామునితో విరోధించి, యుద్ధంలో అతనిచేత సంహరించబడినాడు. రాముడు రావణుని పది తలలు ఖండించాడు. ఈ గాధ ప్రకారం ఆ రాక్షస రాజుకు పది తలలు ఉన్నట్లు తోస్తుంది. వాస్తవానికి— పదిమంది గొంతుకులవలె పెద్ద ధ్వనిగల గొంతుక ఉండుటవల్లనే అతడు దశకంఠుడై, దశాననుడై యుండునని గ్రహించడం సముచితంగా తోస్తున్నది. ★

---

నడిచేదు అర్చకస్వామి. ఆమె తేజస్సును చూచి విచలితుడయ్యేడు.

''తాతగారూ! మరి నాకు శలవా?'' అన్నది ఏకవీర దగ్గరగా వొస్తున్న కృష్ణస్వామిని ఉద్దేశించి,

''అమ్మా! ఏకవీరా! ఏమిటిది?'' ఆయన గొంతు గద్గదమయింది.

''స్వామి నాకు నిర్దేశించిన పని పూర్తి అయింది'' అన్నది ఏకవీర. కృష్ణస్వామి ఏదో మాట్లాడాలని ప్రయత్నించి విఫలమయారు. కంఠం రుద్ధమయింది.

''తాతగారూ! నా స్వామి పిలుపు వినిపిస్తోంది. నా స్వామి! నా వెంకన్నదొర!! కొండమీద నిండుగా కొలువైన స్వామి నన్ను పిలుస్తున్నారు. నన్ను మీరు పెంచి పోషించేరు. ఎవరూలేని నాకు అన్నీ మీరే అయినారు. మీ రుణం నేను ఎప్పటికి ఎలా తీర్చుకోగలనన్న విషయం కాలపేటికలో నిక్షిప్తమయి వుంటుంది. ఇప్పుడు మీ కారుషయాన్ని వివరించేందుకు ఈ అల్పురాలు అనర్హురాలు.

మనసా, వాచా, కర్మణా పాదాభివందనం చేసి శలవు తీసుకుంటున్నాను. అంతకన్నా యీ పేదరాలు; యీ దీనురాలు, బహుకాలం నా స్వామితో కలసి వుండవలసిన యీ పాంధురాలు మీకు యిచ్చుకోగలిగింది మరి ఏమీలేదు''అంటూ ఆయన పాదాలమీద ప్రణమిల్లింది.

ఆవేశానికి లోను అయినందువల్ల ఆమె అలా మాట్లాడుతోందని భావించారు కృష్ణస్వామి.

ఆమె ఉద్వేగం తగ్గిపోయేందుకు శాంతి సూక్తం చదవటం ప్రారంభించేరు; వేదఘోష వింటూ ఏకవీర గర్భాలయంలోకి వెళ్ళింది. అందరూ ఆశ్చర్యంతో చూడసాగేరు.

ఏకవీరాదేవి పాద కుంకుమను శిరస్సున దాల్చింది ఏకవీర. కృష్ణస్వామి స్వరం నుంచి వెలువడుతున్న వేదఘోష ఆలయమంతా ప్రతిధ్వనించింది. అందరి హృదయాలు ఉత్తేజితమయినాయి.

ఏకవీర తలుపులు మూసివేసింది.

శాంతిసూక్త పఠనం పూర్తి అయింది. తలుపులు తెరిచారు. గర్భాలయంలో అమ్మవారి పాదాలమీద శిరస్సు ఉంచి పడివుంది ఏకవీర! ఆమె ప్రాణ వాయువులు శ్రీనివాసునిలో అనుసంధాన మయినాయి. అందరూ వింటూవుండగా కృష్ణస్వామి మహామంత్రి శివదేవయ్యగారితో అన్నారు —

''హిందూ ధర్మం అవిచ్ఛిన్న మయినది. సర్వకాలీనమయింది. దానికి సంకటస్థితి ఏర్పడినప్పుడు ఏకవీరలానే ఎవరో ఒకరు అవతరించి దాన్ని కాపాడుకుంటారు.

తాను వచ్చినపని యజ్ఞ సంరక్షణ. ఆ పని పూర్తి అయింది. అందుకే శ్రీనివాసుడు ఆమెను ఆహ్వానించేడు!''

అందరి కన్నులకు కన్పిస్తోంది ఒకే రూపం.

అదే శ్రీనివాసునిలో ఐక్యమవుతున్న ఏకవీర! చిరునవ్వుల సిరులొలికే శ్రీనివాసుని సన్నిధిలో ఒదిగిపోయిన ఏకవీర!!

*[ అయిపోయింది ]* ●

## ఎం. జి. ఆర్. — విజయనగరం

ఆడది శీలం కోల్పోతే "శీలం కోల్పోయినది" అని ఎత్తి చూపుతారే — మరి మగవాడిని శీలం దోచుకున్నాడని గేలి పరచరేం ?

★ ఎందుకంటారు ? ఇది పురుషాధిక్యత గల సమాజం కదా ... ఇక్కడ పురుషుని పొరపాట్లకి, పొగరుకి కూడా ఆడదాన్నే అవమాన పరుస్తారు.

## ఎస్. ఆర్. ఎస్. — ఇల్లెందు

ప్రేమికులు రాసే పుత్తరాలను విమర్శగా జవాబిస్తారెందుకు? మీకు ప్రేమంటే గిట్టదా ?

★ గిట్టును. కాని ఎవరి ప్రేమ వారికి వ్యక్తిగత విషయం. దాన్నిలా పబ్లికులో చర్చించడం చూస్తేనే తెలియడంలేదా — ఇది విలువ యివ్వదగినది కాదని.

## ఎస్. సిహెచ్. ఆర్. — కొల్లాపూరు

నేను ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాను. లెటరిచ్చి నీ అభిప్రాయం ఏమిటి అంటే మౌనంగా వెళ్లిపోయింది. ఆ చూపులకు, ఆ మౌనానికి అర్థం ఏమిటి ?

★ నేనెలా చెప్పను ? లెటరిచ్చింది మీరు. చూసింది అమ్మాయి. నేనక్కడ వుంటే కనీసం ఆ చూపులకేనా అర్థం గ్రహించేదాన్ని ? ఎందుకంటే మౌనానికి అర్థాలు చాలా వుండొచ్చు. (ఎప్పుడూ మౌనం అంగీకారమే కానక్కరలేదు!)

## ఎస్. ఎస్. — విశాఖ

మన కార్టూనిస్టుల కెందుకంత ఉగాది పచ్చడి అంటే అంత చిన్నచూపు ?

★ వాళ్లది 'ఒన్ ట్రాక్ మైండు' సీజనల్ గా ఆలోచిస్తారే తప్ప — ఒరిజినల్ గా ఆలోచించరు.




## వెంకట్ — ఉరవకొండ

మన చిత్రాలలో ప్రేమ ఘట్టాలలో చంద్రుణ్ని చూపడంలో కల అంతరార్థం వివరిస్తారా ?

★ చంద్రుణ్ని యింకా ప్రేమకు దోహద కారిగానే కవులు వూహించుకోడంవల్ల కావచ్చు. లేదా మీరు చంద్రుణ్ని చూస్తున్నప్పుడు గదిలో ఏం జరుగుతోందో వూహించుకోండి అన్న సజెషన్ కావచ్చు. లేదా — అక్కడో సెన్సారు కట్ వుండి అసలుకి బదులు చంద్రుణ్ని చూపవచ్చు !!

## డి. బి. — కాకినాడ

కూటికి గతిలేక వ్యభిచారం వృత్తిగా పెట్టుకున్న ఆడదానికి మీ సలహా ఏమిటి ?

★ కూటికి గతిలేక కాదు, కాస్త ఎక్కువగా డబ్బిచ్చేది యీ వృత్తేనన్న నమ్మకం వారినలా ఊబిలోకి లాగేస్తోంది; దళారులు వీరి అవసరాలని గుర్తించి వలలో సులభంగా వేసుకోకల్గుతున్నారు...వ్యాపారం ముమ్మరంగా సాగించుకోకల్గుతున్నారు; సమాజం కూడా యీ వృత్తిని వృత్తిగా గుర్తించేసింది ! అందుకే ఒకసారి యీ కూపంలో పడిన ఆడదాన్ని — తిరిగి సభ్యసమాజంలో తలెత్తుకు తిరగనివ్వదు. చావుదెబ్బ కొడుతూనే వుంటుంది.

జాతీయ బహుమతి అందుకున్న 'మేఘసందేశం' దర్శక నిర్మాతలు శ్రీ దాసరి నారాయణరావు, శ్రీమతి దాసరి పద్మగార్లకి 'కళాసాగర్' మొమెంటోని బహూకరిస్తున్న డా. అక్కినేని నాగేశ్వరరావు




## జి. బి. ఎస్. — పెదవిండ్రకొలను

ఈ కాలం అబ్బాయిలు అమ్మాయిలు అందానికా చదువుకా డబ్బుకా దేనికి ప్రాధాన్యమిస్తున్నారు ?

★ అక్కడికి మీకు తెలియనట్లు ! డబ్బుకి (హోదా రడీమేడుగా కావాలి కనక) చదువుకి (అప్పుడే సరైన ఉద్యోగం దొరుకుతుంది కనుక) అందానికి (నా వైఫ్ సార్, అంటూ షోకి అవసరం కాబట్టి).

## బి. ఎస్. పి. కె. — హైదరాబాదు

మగవాడు ఎక్కడ తిరిగినా ఏమి చేసినా ఆడది సహిస్తుంది. కాని ఆడది తిరిగితే మగవాడు సహించడు ఎందుకు ?

★ ఎందుకేమిటి మగమహారాజు — తన బానిస స్వేచ్ఛని సహించకలడా ? !

మీరు ఎన్ని నవలలు రాశారు ? మీకు నచ్చినది ఏది ?

★ ఓ పాతిక రాశానో లేదో — సరిగ్గా లిస్టు చేయలేదు ! నాకు అన్నీ యిష్టమే. నేను 'సిగ్గుపడవలసిన' రచనలింకా చేయడం ప్రారంభించలేదు తమ్ముడూ.

## కె. ఎస్. — హైదరాబాదు

వరకట్నం బదులుగా ఆస్తిలో ఆడపిల్లకి భాగం యివ్వడంపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ ఆస్తిలో భాగం లేకపోవడం; వరకట్నం యివ్వవలసి రావడం — రెండూ ఆడవారిని కించపరిచే విషయాలు, వ్యక్తిగా ఆమెని గుర్తించని విషయాలు. అంచేత వరకట్నానికి బదులు కాదు ఆస్తిహక్కు—మనిషిగా భాగస్వామిగా గుర్తించి యివ్వాలి. వరకట్నానికి ఆస్తిహక్కుకి ముడిపెట్టడం అసలు సమస్యని దాటవేయడమే అవుతుంది.

## పి.యి.ఎమ్. — కాశీబుగ్గ

మీరు యిచ్చే సమాధానాలు ఎక్కువగా స్త్రీలను అందలం ఎక్కించే విధంగా వుంటాయి. అంటే పురుషులనందరినీ హీనంగా చూస్తున్నారనేగా అర్థం ?

★ అలాగా ? నాకు తెలియదే. ఆడదాన్ని అందలం ఎక్కించాలని తాపత్రయపడడం — మగవారిని కించపరచాలన్న ప్రయత్నంకాదు.

## సుజయశ్రీ — ఆదోని

అన్నీ కాకపోయినా కొన్ని మీ జవాబులు ప్రతి ఒక్కరి జీవితానికి వుపయోగకరంగా వున్నాయి. వీటిని పుస్తకంగా ప్రచురిస్తే బాగుంటుందని మనవి.

★ మరీ అంత పెద్ద పీట వేయకు సోదరీ; ఏదో 'సమయానికి తోచిన సమాధానాలు' అనండి. చాలు. ప్రశ్నావళి నేను సేకరించలేదిప్పటి వరకూ.



# పెరిగే పాపాయిలకు
## కావాలి ఒక ప్రత్యేకమైన ఘన ఆహారం...
# ఫారెక్స్



## ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

**మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్**

ప్రొటీన్ కొరత నుండి పాపాయిని రక్షించడానికి బ్రాండ్ చేయబడిన ఘన ఆహారంలోని ప్రొటీన్ పరిమాణం మరియు ఘన ఆహారం తయారు చేసి ఇచ్చే తీరుకు సంబంధించిన కొన్ని ప్రమాణాలను విశ్వ ఆరోగ్య సంస్థ నిర్థారించినది. నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ ఘన ఆహారం తయారు చేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌ను సమృద్ధంగా కల్గి వుంటుంది.

**ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్**

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగి పోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

—డా. సుభాష్ సి. ఆర్య.

పాపాయి రక్తానికీ, రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికీ, అతి సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదల కోసం అత్యంత ముఖ్యమైన ఐరన్ అదనంగా కల్గి వున్నది ఫారెక్స్.

**పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్**

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని, 2:1 — ఈ నిష్పత్తిలో ఈ రెండూ కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శ ప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. అది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

**ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్**

మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్ ®**

గ్లాక్సో ఉత్పాదన

CASGLF-40-244 TEL




అయోమయంగా అడుగులేస్తూ కొత్త రోడ్డు చేరుకున్నాను.

ఆసీలు మెట్టనుండీ కొత్తరోడ్డు జంక్షన్ వరకూ ఆలోచిస్తూ నడుచుకొచ్చానుగానీ, ఈ గంటన్నర నడకలోనూ నాకు తెలిసిన మొహం ఒకటీ తారసపడలేదు.

నా దురదృష్టమేమోగాని కనీసం పూరివా ళ్లొక్కరూ కనిపించలేదా గంటన్నర కాలంలోనూ.

అటూ — ఇటూ ఇరువైపులా పరికిస్తూ సూపర్ 'టీ' స్టాల్ ముందు నిలబడ్డాను

మొట్టమొదటిసారిగా నేనీ దరిద్రావస్థకు దెబ్బతిన్నది — దొరికిపోయినది — ఈ క్షణమే!

ఏ రోజూ నేనూ జేబులో ఇరవయ్యో — ముప్పయ్యో రూపాయినోట్లు లేకుండా వైజాగ్ రాలేదు. ఇవాళ నా కర్మకాలి పది రూపాయలతో పట్నం రావడమేమిటి? వచ్చాను. వచ్చాక వచ్చిన పని సవ్యంగా చేసుకుపోక సినిమాహాలుకు ఎందుకు వెళ్ళాలి? వెళ్ళాను. వెళ్ళినట్టు, సినిమా అవస్థలు పడుతుంటే తానెందుకు తిరిగి వచ్చెయ్యలేదు.

రాలేదు... రాలేదు... రాలేదు. సినిమా బావుందని విని వూరుకోలేక ఉసూరుమంటూ ఓ అరగంట నిలబడి ఏ మహానుభావుడైనా స్పేర్ టికెట్ ఆఫర్ చేస్తాడేమో ఎదురు చూడక — చూడకుండా — స్టైల్‌గా బ్లాక్‌లో ఎందుకు బేరమాడాలా ? ఆడాను. బేరమాడేనే అనుకో ! రెండు రూపాయల టిక్కెట్టూ రెండు పదులకీ చేరేసరికి బుద్ధిగా హాలునుండి బయటపడక జేబులో బధ్రంగా దాచిన పది రూపాయలనోటునీ అక్కడ — ఆ బ్లాక్ మార్కెటీర్లందరి ముందూ ఎందుకు ప్రదర్శించవలె !

ఆ పది రూపాయల ప్రదర్శనేకదా నాకీ ప్రారబ్ధాన్ని తెచ్చిపెట్టింది.

అంతవరకూ బాగా గుర్తు ఆ తర్వాత .. తర్వాత సంగమ్ థియేటర్ దాటి ఆర్టీసీకాంప్లెక్స్ దగ్గరకొచ్చి బస్సెక్కుతూ జేబులు తడుము కుంటే ఇంకేముంది ? ఖాళీజేబు ఎంత కెలికినా ప్రయోజనమేముంది ?

పద్మవ్యూహంలాంటి పదినుంది బ్లాక్‌వాళ్ల మధ్య రూపాయి కాగితం తీస్తే బధ్రంగా అది బైటపడుతుందా ?

నాకా క్షణం ఏడుపొచ్చినంత పనైంది.

నిక్షేపంలాంటి పది రూపాయలూ పరుల పాలు అయిపోయాయి. కనీసం పది పైసలు పెట్టి పకోడీ ముక్కలు కొనుక్కోవడానికి మనసొప్పక — పది రూపాయలూ ఇంటికెళ్లే వరకూ సరిపోతుందో — లేదోనన్న భయంలో కడుపు కాల్చుకొని — కోరిక చంపుకొని — తీరా పారేసుకున్నాడు. కాదు... కాదు... పోరంబోకుల పాలిట పడేసాడు.

సీతమ్మధార నుండి సీమటపాకీల్లాంటి కాలేజీ అమ్మాయిల్ని మోసుకొచ్చి ముందరాగింది మా రూటు బస్సు.

నా కుర్ర వయసు ఉసూరుమంటూ మూలిగింది.

గుంటలు... గున్నమామిలా ఉన్న రవ్‌జైన రామచిలుకలు. కిలకిలా నవ్వుతూ — కేరింతలు కొడుతున్నారు. ఆ అమ్మాయిలందరిముందూ ఇద్దరు ముగ్గురు అబ్బాయిలు ముసలమ్మల్లా నిలబడి ఉన్నారు.

ఆ అమ్మాయిల ప్రేలాపన పెట్రేగి పోతోంది.

బస్సు ఇంజను శబ్దంలా ఉండుండీ విర్రవీగి పోతున్నారా కాలేజీ కన్యలు.

తదేకంగా వాళ్లవైపు చూడలేక తలదించు కున్నాను.

నాలోని కుర్రవయసు కుర్రో — ముర్రో అంటూ కూనిరాగం తీస్తోంది

పరిస్థితి ఫిఫ్టీ ఫిఫ్టీకు నిలబడింది.

సిసింద్రీ దట్టించినట్టూ ప్రయాణీకుల్ని బస్సులో సర్ది రైట్ చెప్పాడు కండక్టరు.

నిప్పంటిన తారాజువ్వలా నా ముందు నుండి దూసుకు పోయింది ఇరవయ్యేడో నెంబరు సిటీబస్సు.

చేతులు రెండూ జేబుల్లో పెట్టుకుని మళ్ళా చుట్టూ పరికించిచూసాను.

నా కళ్ళు జిగేలుమన్నాయి.

రామలక్ష్మి !

రామలక్ష్మి !

మా వూరి ముద్ద మందారం. కుర్రకారు కళ్ళల్లోని ఆశాజ్యోతి.

బుట్ట బొమ్మలా అలంకరించుకొని — సింగారా లద్దుకొని వయ్యారంగా నడుస్తూ వస్తోంది. నా వైపే... నావైపే... క్షణం తొట్రుపడ్డాను. మరుక్షణం సర్దుకొని దర్జాగా నిలబడ్డాను.

తిన్నగా నా ముందుకొచ్చి నిలబడింది. తల దించుకొని బస్సుకోసం ఎదురు చూస్తోంది.

ఆమె తన వ్యానిటీబ్యాగ్ తెరిచి లోపలనున్న రూపాయినోట్లు సరిచూసుకొని రెండ్రూపాయల కాయితం తీసి రుమాల్లో పెట్టి చుట్టి పట్టుకు నిలబడింది.

బహుశా బస్సు చార్జీకోసం తీసి పట్టు కొనుంటుంది.

బస్సు చార్జీ... చార్జీ... చాచి లెంపకాయ తగిలినట్టయింది. ఉలిక్కిపడి ఆమె మొకంనుండి తేరు కున్నాను.

రూపాయి... రూపాయి... రూపాయి... కనీసం ఒక్కరూపాయి ఏ ఒక్కరైనా దానం చేస్తే బాగుణ్ను. ఎవరైనా 'ఇందా'అని అందంగా అందిస్తే బాగుణ్ను !

అడగంది అమ్మైనా అన్నం పెట్టదు. నోరు తెరచి తన దీనావస్థ మొరపెట్టుకోకుండా ఎవరు పిలిచి ఇస్తారు ?

ఛీ !... ఛీ ! ఎవర్నడిగేస్తాం. ముక్కూ— మొహం తెలియని ప్రతీ వాణ్ణీ చెయ్యిచాచి అడిగెయ్యడమే ! వెధవది రూపాయికోసం కాణీకి టెకానాలేని ప్రతీ దద్దమ్మని అడిగేయటమే !

నా ఆలోచనలకి నేనే తిట్టుకున్నాను. నా బట్టలవైపు హుందాగా ఓసారి చూసు కున్నాను.

కొరియా పోలిస్టరు పేంటుమీద ఇండియా గ్వాలియర్ షర్టువేసి క్రింద కాళ్ళకి పాయింట్‌షూ నిగ... నిగ లాడుతోంటే కళ్ళని అంటి పెట్టు కున్న కళ్ళద్దాలు నాజూగ్గా చేత్తో సర్దుకొని నిలబడ్డాను.

జేబులో చిల్లిగవ్వలేక వూరివాడెవడైనా కనిపిస్తే కనీసం బస్సు ఛార్జీల కోసం ఓ రెండు రూపాయలు అప్పడుగుదామనుకొని ఆరుగంటల నుండీ ఇక్కడ కాచుక్కూర్చున్నాడు తను.

ఒక్కడంటే ఒక్కడూ కనిపించలేదు.

ఇప్పుడు — !

నా కాళ్ళు కట్టేసినట్టూ ముందుకు కదల నంటున్నాయి.

ఇన్నాళ్ళూ ఆమె ముందు హీరోలా ఉర్లో పోజులిచ్చుకు తిరిగి ఇప్పుడు — ఛీ ! ... ఛీ ! ... ఆమెనా ఓ రెండు రూపాయలు దానం చేయమని దేవుల్లాడాలి ! నో ! ... నెవ్వర్ !

ఆమె కూడా తన అందానికి ముగ్ధురాలై ఆశగా చూస్తోన్న తరుణంలో — ఆమె తన హృదయ సామ్రాజ్యానికి విహారానికి విచ్చేయా లనుకుంటున్న తరుణంలో —

తను ... తను .. ఓ బికారిలా — దిక్కు మాలినవాడిలా — దరిద్రగొట్టు దద్దమ్మలా — హీనంగా — దీనంగా ఆఫ్ట్రాల్ ఓ రెండు రూపాయల కోసం తన హీరోయిజాన్ని హీనపరచుకోవాలా ?

ఆమెకాక ఇంకెవరైనా కనిపిస్తారేమోనని చుట్టూ పరికించాను. ఇంతలో ఆమె నావైపే చూస్తోంది. ఆశ్చర్యపోయింది. కళ్ళింతచేసుకొని చూసింది.

నేనూ ఆమెవైపు అప్పుడే చూసిన వాడిలా చూసాను.

తెలిసిన మొహం — వూర్లో పదే — పదే తనకు తారసపడే మొహం పైవూర్లో కనిపించే సరికి ఎవరైనా — ఎవరికైనా ఆ క్షణం ఆ మొహాన్ని పరామర్శించాలనిపిస్తుంది.

ఆ అమ్మాయి కూడా అదే ఉద్దేశ్యంతో నా వైపు చూస్తోన్నట్టనిపించింది.

చిన్నగా నవ్వి పలకరించాను.

మొట్టమొదటిసారి ఆమెతో మాట్లాడటం నాకెందుకో ఏనుగెక్కినంత సంబరంగా ఉంది.

ఆమె కూడా నవ్వుతూ పలకరించింది.

ఆమె పలకరించటమే తడవుగా ఆమె దగ్గరకు వెళ్ళి నిలబడ్డాను.

''ఎక్కడినుండి వస్తున్నారు'' ఏదో మాట కలపాలని అన్నాను.

''సంగమ్ థియేటర్లో సినిమా చూసుకొని ఇలా షాపింగ్‌కని వచ్చాను. మీరూ ?!'' కమలా పండు తొనలా తియ్యగా ఉన్నాయామె పలుకులు.

''నేను ... నేను ...ఇక్కడ మా ఫ్రెండొక దున్నాడు. వాణ్ణి కలవాలని ఇప్పుడే వచ్చాను.''

''ఇంటికి వచ్చేస్తారా ?''

''ఆఁ ! ఎందుకు రాను !'' నా గొంతులో నుండి మాట పెగలడం లేదు.

ఇంతలో చినవాల్తేరు నుండి వస్తోన్న ఇరవైఆరో నెంబరు బస్సు చిందులేసుకుంటూ మా ముందుకొచ్చి ఆగింది.

బస్సు వచ్చీరావడంతో జనాలు జోరీగల్లా 'గీ' పెడుతూ బెల్లాన్ని చూసిన చీమల్లా బస్సులోకి ఎగ్రబాకారు.

ఆ అమ్మాయి కూడా బస్సు ఎక్కడానికి ఉపక్రమిస్తూ నా వైపు చూసి — ''మీరు రారా ?'' తీయగా పెదవి విరిచి నవ్వుతూ అంది.

నా గొంతు ఎండిపోయింది. క్షణం .. ఒక్కక్షణం స్తబ్దగా ఉండిపోయాను.

''వచ్చేస్తాను ! ... వచ్చేస్తాను ... '' అయోమయంగా అన్నాను.

''రండి ... మళ్ళా ఫస్టు షో వదిలే టైం కావస్తోంది. మరికసలు మనం ఇల్లు చేరుకో లేం !'' చేయిపట్టుకు లాగుతున్నట్లున్నాయా మాటలు.

రామలక్ష్మి రమ్మనిపిలిచే సరికి నాకు మతి పోయింది.

మరిక ఏదైతే అది అయిందని బస్సెక్కే సాను.

జనంతో కిట — కిట లాడులోంది బస్సు.

మనసులో ముక్కోటి దేవతల్నీ తలచు కున్నాను.

'దేవుడా !

ఈ బస్సు సింహాచలం చేరుకున్నేవరకూ ఏ టికెట్ కలక్టర్ రానివ్వకుండా కాపాడు !' మనసు లోనే వేనోళ్ళ ప్రార్థించాను.

ఎవడైనా టి. సీ వచ్చి టిక్కెట్టు అడుగు తాడనే భయంతో బిర్రబిగుసుకు పోయాను.

అయినా—నాలాంటి నీతి గలవాడెవడో ఇలా టిక్కెట్టు తీయక భయపడతాడు గాని — ఎంత మంది దర్జాగా — దొరబాబుల్లా తిరగటంలేదు. ఫుట్‌బోర్డు మీద నిలబడటం — స్టాప్ వచ్చేసరికి దిగి జారుకోవటం.

ఒకవేళ కండక్టరు తప్పి జారీ టిక్కెట్టు అడిగితే 'పాసని' ఫోర్సుగా చెప్పడం— !

జనంతో కిక్కిరిసిన బండిలో కండక్టరు టిక్కెట్లే కొడతాడా ? పాసులే చెక్‌చేస్తాడా ?

నాలో కొంచెం ధైర్యం రాజుకుంది.

ఆడాళ్ళమధ్య నుండి విరాభిమన్యుడిలా చీల్చుకుంటూ నా ముందు నుండి మగాళ్ళను నెట్టుకుంటూ వెనుక డోర్ వైపు 'టిక్కెట్... టిక్కెట్' అని అరచుకుంటూ వెళ్ళాడు కండక్టరు.

కండక్టర్ నా ముందు కొచ్చేసరికి నాకు ముచ్చెమటలు పోసాయి. నోటమాట రాలేదు. రాతిబొమ్మలా దిక్కులు చూస్తూ నిలబడి పోయాను.

ఒకవేళ తన్ని కండక్టరు టిక్కెట్టు అడిగితేనో ? తీసానని చెప్తే—? ఏదని--చూపమని అడుగుతాడేమో ? పాసని చెబితే చూపించమం డేమో ! వెనుక ఎవరైనా తీస్తారని చెప్పి తప్పించుకుంటే — గోపాలపట్నం వచ్చాకయినా దొరికిపోతాడు. ఆసరికి జనాలంతా దిగిపోయి బస్సంతా ఖాళీగా ఉంటుంది. అబద్ధం ఆడినందుకు నానా దుర్భాషలూ ఆడుతాడు.

అప్పుడు —

రామలక్ష్మి... రామలక్ష్మి... రామ ! రామ ! అంటూ నోరు నొక్కుకుంటుంది. కళ్ళతోనే 'ఛీ' కొడుతుంది.

## దొంగలు

నా అదృష్టం బావుండి కండక్టర్ నావైపైనా చూడకుండా వెళ్ళిపోయాడు.

మరిక గోపాలపట్నం చేరేవరకూ బస్సు లోపలకు రాడు. ముందు గేటు దగ్గరా – వెనుక గేటు దగ్గరా ఎక్కేవాళ్ల దగ్గరే టిక్కెట్లు వసూలు చేసేస్తాడు.

నా మనసు కొంచెం కుదుటపడింది.

గుండెనిండా గాలి పీల్చుకొని నిలబడ్డాను.

అయిదు నిమిషాలయినా అయినట్టు అనిపించలేదు నాకు. బస్సు గోపాలపట్నం చేరుకుంది.

కనీసం ఏభై నిమిషాలైనా ఉంటుంది వైజాగ్ నుండి గోపాలపట్నం రావడానికి. అటువంటిది ఇంత వేగంగా వచ్చేసిందేవిటి ?

వాచీ చూసుకున్నాను.

నిజమే ! తానప్పటికే బస్సెక్కి గంటయింది. అయిదు నిమిషాలు ఆలస్యమయింది. అయినా – తన కెందుకలా అనిపించింది.

బస్సు కాళీ అయిపోయింది.

ముందర సీట్లోకెళ్లి కూర్చున్నాను.

గోపాలపట్నంలో చాలామంది ఎక్కేరు. అంతా మా వూరివాళ్ళే. బస్సుకు కూడా మా వూరే ఆఖరు స్టేజీ. సింహాచలం చేరుకున్న తర్వాతమళ్లా తిరిగి వైజాగ్ బయలుదేరుతాయి బస్సులన్నీ.

విశాఖకు మా వూరికి ఏభై సిటీబస్సులున్నాయి. ఉదయం నాలుగ్గంటలనుండీ రాత్రి పండ్రెండు గంటల వరకూ ఎడతెరిపిలేకుండా తిరుగుతూనే ఉంటాయి.

బస్సు డిపో కూడా ఉంది. బస్సులు ఆగాలన్నా – బయలుదేరాలన్నా మా వూరే కేంద్రం.

పెట్రోలు బంక్ దగ్గరకొచ్చేసరికి అందరి దగ్గరకూ వెళ్లి టిక్కెట్లు వసూలు చేసుకు వచ్చాడు కండక్టరు.

నా దగ్గర కొచ్చేసరికి నాకు ఒళ్లు జలదరించింది.

తలబైటకు త్రిప్పి ఎటో చూస్తున్నట్టు కూర్చుండిపోయాను. నా దృష్టి మాత్రం ఆయనమీదే ఉంది.

మరోసారి 'టిక్కెట్టు ... టిక్కెట్టు... అంటూ రౌండు కొట్టాడు.

"నాయనలారా ! ఎవరైనా టిక్కెట్టు తీయనివాళ్లుంటే టిక్కెట్టు తీసుకోండి. ఎవరైనా వచ్చి చెక్‌చేస్తే మీకే ప్రమాదం" గట్టిగా గొంతు చించుకొని అంటున్నాడు కండక్టరు.

నా పిడికెడు గుండెని ఎవరో పిసికేసినట్లనిపించింది.

మౌనంగా కూర్చుండిపోయాను.

ఆ క్షణం – నా అంతరాత్మ అనుభవించిన క్షోభ అంతా – ఇంతా కాదు. ఆ క్షణం ఊహించలేనిది. ఆ ఘడియ వర్ణించలేనిది.

"గురూ ! కొంచెం జరుగ్గురూ !" ఎవరో నన్నే భుజం తట్టి పిలిచేసరికి ఉలిక్కిపడ్డాను తలఎత్తి తేర – పారా చూసాను,

కండక్టర్ !

కంఠాన్ని ఎవరో పిండేసినట్లయింది.

ఏం చెప్పాలో – ఏం చేయాలో – అసలా క్షణం నేనేవిటో తెలీకుండా శిలలా ఉండిపోయాను.

"కొంచెం జరుగ్గురూ!" అని నా ప్రక్కన సర్దుకు కూర్చుంటూ అన్నాడా కండక్టర్.

జరిగి కూర్చున్నాను. కొంచెం మనసు తేలిక పడింది. కండక్టర్ వలన భయంలేదు.

కానీ, దిగేటప్పుడు ఏ టీ.సీ. అయినా చెక్ చేస్తేనో ?!

ఆ భయం ఇంకా బిగించేస్తోంది నన్ను

కండక్టర్‌వైపు ఓసారి కళ్లెత్తి చూసాను అతనూ నావైపు చూసి డబ్బులు లెక్కపెడుతున్నవాడల్లా నాకో ఇరవై రూపాయలనోటు అందిస్తూ ఇలా అన్నాడు –

"గురూ! ఈ ఇరవయ్యీ నీ దగ్గరఉంచు. కొంపదీసి స్క్వేడ్ వచ్చిందంటే పిట్టలా దొరికిపోతాను. స్టేండులో దిగాక ఎవరూ రాకపోతే ఇచ్చేద్దువుగాని."

నాకు ఆశ్చర్యం వేసింది.

ఈ ఒక్క ట్రిప్పులో – చిన వాల్తేరు నుండి ఇక్కడకు ఎచ్చేలోపులో ఇరవై రూపాయలు సంపాదించాడా ?

మరిక ఆలోచించలేకపోయాను. ఇరవై రూపాయలనోటు జేబులో పెట్టాను.

డబ్బులు లెక్కపెట్టి బేగ్‌లో పెట్టుకొని నావైపు నవ్వుతూ చూసాడు కండక్టరు.

"నా దగ్గర ఏభైనోటుంది. చిల్లర లేదు. ఓ ఏభైపైసల టిక్కెట్టు ఇస్తావేంటి గురూ!" తెలివిగా అదే అదనని అడిగాను.

"దానికేముంది గురూ! ఇదిగో! ఎవరైనా అడిగితే గోపాలపట్నంలో ఎక్కేనని చెప్పు !"

టికెట్టు నా చేతిలోపెట్టి నిలబడ్డాడు.

బస్సు ముందుకు విమానంలా దూసుకుపోతోంది.

కండక్టరు మరోసారి టిక్కెట్టు.. టిక్కెట్టు... అంటూ ఓసారి బస్సంతా తిరిగేసి మళ్లా ఇందాకటిలాగే 'టిక్కెట్టులేని ప్రయాణం నేరం' అని గట్టిగా అరచి చెప్తున్నాడు.

నేను దర్జాగా సీటుకు జారగిలబడి కాలు మీద కాలు వేసుకొని కూర్చున్నాను. ★

# కొత్తగొంతులు

— టి.యల్. కాంతారావు

సంఘం దేహం మీద
పుట్టిన మహా వ్రణం
పిచ్చి పసరులు పూస్తే
నయం కాదు
కుళ్ళిన భాగాన్ని తొలగించడానికి
కత్తి పట్టడానికి చెయ్యి వణకరాదు
ఏది ఏమైనా నొప్పి తప్పదు
నొప్పులు పడకుండా
నీ తల్లి నిన్ను కనలేదు
ఏ తల్లీ ఎవరినీ కనలేదు

— ఏ. సూర్యప్రకాశ్

సూర్యప్రకాశ్‌గారు 1971 లో సంస్పందన, 80 లో మళ్ళీ సూర్యోదయం, 81 లో కాగితం పువ్వు రచన గేయ కవితా సంకలనాలు ప్రచురించారు. వీరి కవితా ఖండికలన్నీ వివిధ వార మాస పత్రికలలో ప్రచురితమైనవే. నిరంతర తపనతో, సంఘర్షణతో, సాంద్రతరమైన అనుభూతుల ఒత్తిడితో, ఆలోచనాతీవ్రతతో తల్లడిల్లిపోయే మనస్తత్వంతో, క్షోభ, ఉద్వేగం, సహానుభూతి, ఆనందం, అశాంతి, ఆరాటం, ఆవేశం, తన రచనకు ఆలంబనాలుగా, తన చుట్టూ విస్తరించిన సమాజంలోని ప్రజల ఆకలిని, దారిద్ర్యాన్ని, బాధలను, కన్నీళ్లను, ఆశయాలను, అవరోధాలను తన కవితలో పలికిస్తున్నాడు. సంఘంలో ఉన్న పరిస్థితులకు రాజీ పడలేక, బూటకపు విలువలపై చావుదెబ్బ తీయడానికి ప్రయత్నిస్తూ, నేటి అస్తవ్యస్త సమాజంలో జీవిస్తున్న మనిషి స్థితిని కళ్ళకు కట్టించి మనిషి బ్రతుకులో రేకెత్తించాలనే ఆశతో తాను కవితాయుధాన్ని ధరించానని సూర్యప్రకాశ్ గారేచెప్పారు. కవిత్వం ప్రజలకోసమని, సమకాలిక జీవితం కవిత్వంలో ప్రతిబింబించాలని, ఆధునిక కవిత్వానికి వాస్తవికత ప్రాణ లక్షణమని, తన అనుభూతిని తనదైన ప్రత్యేక మార్గంలో కవిత్వ రూపంగా ప్రకటించాలని సూర్యప్రకాశ్‌గారి ఆశయము,ఆకాంక్ష.

సంస్పందన కవితా ఖండికల సంకలనం; మళ్ళీ సూర్యోదయం కూడా కవితా ఖండికల సంకలనమే కాగితంపువ్వు మాత్రం నగర జీవిత వర్ణనకు సంబంధించిన సంపూర్ణ వచన గేయ వర్ణనాత్మక కావ్యం. లుప్తమైన మానవతా విలువల మధ్య, డబ్బుకోసం నానా గడ్డి మేస్తూ, రూపాయి వెనుక పరుగులు తీస్తూ, సర్వమానవ సౌభ్రాతృత్వమూ, వసుధైక కుటుంబం వాస్తవం కాని కలగా మిగిలిపోయిన లోకంలో, మనుషులు మనస్సును పోగొట్టుకొని యంత్రాలుగామారిన సంఘంలో, స్వాతంత్ర్యం కోతి చేతికి దొరికిన కొబ్బరి కాయగా మారి, పిచ్చివాడి చేతి కత్తిగా మారి జాతీయ జండాలు మనుషుల గుండెల్లోబదులు వీధుల్లో ఎగురుతున్న దేశంలో, కృత్రిమ నాగరికత, కుహనా సంస్కృతి, చమట బిందువులను, కన్నీటి చుక్కలను, రక్తపు బొట్లను హీనంగా, హేయంగా దుమ్ములో, ధూళిలో కలుపుతున్న గడ్డమీద, మానవ మస్తిష్కంలో చీకటి గడ్డ కడుతున్న సమయాన, ఖద్దరు లాల్చీల క్రింది కల్మషాన్ని నింపి, విషభావనల మీద గాంధీ టోపీలను మూతపెట్టి, చెట్టుపేరుచెప్పుకొనికాయలమ్ముకుంటున్న కాలాన కవుల కలాలు కరవాలాలై ఈ అవినీతి విష వృక్షాన్ని ఖండ ఖండాలుగా తెగవేస్తాయి. సూర్యప్రకాశ్‌గారి కలం కత్తిగా ఈ కుష్ఠు వ్యవస్థ శరీరాన్ని శస్త్రచికిత్స చెయ్యడానికి పూనుకొంది. మృత్యువు కళ్లల్లో



కళ్లు పెట్టి అంతకంటె గట్టిగా నేను నవ్వలేనా అనేటంతటి తీవ్ర ఆశావాద కవిత ఈయనది. నిరాశ మంటల్లో కాలిపోతున్న ప్రపంచాన్ని ఆలింగనం చేసుకొని, నీరసాన్ని నీరసింపజేసి, ఆకాశమంత చేతులెత్తి మంటలను ఆర్పే ప్రయత్నంలో చివరి ఊపిరి వరకూ తన గుండెను వెలిగిస్తాననీ చెబుతున్నారీ కవి.

వెలుగు కత్తై చీకటి కడుపును చీలుస్తానని, వజ్రాయుధమై అవినీతి కొండను ఛేదిస్తానని, కొత్తబాట తీస్తూ, కొత్త రాత రాస్తూ తెరవకూడని ద్వారం తెరిచి చూడకూడని దృశ్యాన్ని చూపిస్తానని, మనిషిలో నున్న భయాన్ని ముక్కలు ముక్కలుగా నరికి విశ్వమానవ జాతికి అభయహస్తం ఇస్తానంటున్నారీయన. ఈ వ్యవస్థను దిశమొలతో చూసి, ఇది ఎన్నడో మానభంగం చేయబడిందని తెలుసుకొని, అకృత్యాలు నిత్య సత్యాలుగా మారటం తెలుసుకొని ఈ సంస్కృతి సిఫిలిస్ సంస్కృతి అని, ఈ నాగరికత గనేరియా నాగరికత అని సూర్యప్రకాశ్‌గారు భావించారు. అంతు తెలియని రోగాల్తో, లోతు తెలియని గాయాల్తో, కళ్ళనిండా చక్రవడ్డీల లెక్కల్తో ఇక్కడ ప్రతి ఒక్కడూ భీకర భూకంపాలను గుండెల్లో పెనుతుఫానులను, కళ్ళల్లో గరళాన్ని గళాల్లో బంధించి నిష్క్రియాత్వాన్ని భజన చేస్తుంటే — అసుర శక్తులను తుద ముట్టించడానికి, అసలైన, సిసలైన సూర్యోదయం కోసం భవిష్యదాశా గీతాన్ని సూర్యప్రకాశ్‌గారు ఆలపిస్తున్నారు. నగర జీవితంలోని భయంకర దృశ్యాలను కాగితం పువ్వులో ఈ కవి చూపించిన తీరు ప్రతీకాత్మకతను, వ్యంగాన్ని ఆశ్రయించింది. నగరం ఒక విషవలయమని, నగర జీవితం చేదువిషమని, నగరం ఒక కత్తుల బోనని, నగరం కాగితం పువ్వు అని, నగరం పలుచని ముసుగేసుకున్న వేశ్య అని, నగరం ప్లాస్టిక్ పువ్వు అని, లిప్‌స్టిక్ నవ్వు అని అక్కడ అణువణువులో అవినీతి అందెల రవళులు వినబడతాయని ఈయన చెప్పటంలో ఉన్న కవిత్వ వ్యగ్యం ఆధునిక నగర జీవితం యొక్క కృతకత్వాన్ని సహస్రాక్షులతో మన ముందుంచుతుంది.

సూర్యప్రకాశ్‌గారి వచన గేయానికి కుంటుపడని నడక, శైలీసర తత్వం. ప్రతీక, వ్యంగ్యం, వాటితోపాటు సూటిదనం, స్పష్టత ముఖ్య లక్షణాలు. వస్తువు అభ్యుదయకరమైనది; తత్వం మార్పును ఆశించటం. ★

సీరియల్

# మౌనమురళి

కొద్దాలి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

"చూడమ్మా సరస్వతీ! నేను ఒక ముఖ్యమైన పనిమీద వచ్చాను —" అని అసలు విషయం నెమ్మదిగా బయట పెట్టింది రాజమణి.

సరస్వతి ఆమె మాటలు నమ్మశక్యం కానట్లు చూసింది.

"అమ్మగారూ! మీరు చెప్పేది నిజమేనా? మా మురళిని మీ మనవడికి చేసుకుంటారా?—" అని నోరెళ్లబెట్టింది సరస్వతి.

"అవునమ్మా. మా వాడు మీ అమ్మాయిని చూసి ఇష్టపడ్డాడు. లంకంత కొంప, బోలెడంత ఆస్తి, ఒక్కగానొక్క వారసుడు. వాడి ఆనందమే నాకు కావాల్సింది. అందుకే పేదవాళ్లయినా మీతో వియ్యమొందాలని వచ్చాను. మీ అమ్మాయి ఎలా వుంటుందో కూడా చూళ్లేదు నేను. అయినా మావాడు ఇష్టపడ్డాడు. అందుకే నేనూ వెంటనే ఆమోదించాను. ఈ పెళ్లి జరిగితే మీ సంసార బరువు బాధ్యతల్ని నేను చూస్తాను. లక్షణంగా బ్రతికే ఏర్పాట్లు చేస్తాను. ఏమంటారు?—" అని అడిగింది రాజమణి.

సరస్వతి ఏమంటుంది? దేవత వచ్చి వరమిస్తానంటే కాదనే మూర్ఖురాలు కాదు. సరస్వతి స్వతహాగా తెలివైనది. అడిగిన వెంటనే ఒప్పుకుంటే లోకువైపోతామని కాస్సేపు బెట్టు చేసి, చివరకు ఒప్పుకున్నట్లుగా అన్నది — "మీరంతగా చెబుతుంటే కాదనటం ఏం బావుంటుంది· అలాగే కానీయండి. మురళి మా పిల్లని చెప్పకోకూడదు కానీ బంగారు బొమ్మ. దాని గుణం మా ఇంట్లో ఎవరికీ రాలేదు. ఇంటిల్లపాదికి అదే పెద్దదిక్కు. దాని సంపాదన మీదే మేమంతా ఆధారపడ్డాము. ఇప్పుడది పెళ్లి చేసుకుని వెళ్లిపోతే మాదిక్కేం కావాలి? ఆయనకా పక్షవాతం. పిల్లా చిన్న పిల్లలు — నేనా? ఏనాడూ గడపదాటి ఎరుగను. ఇక ఏం చేస్తారో, ఈ సంసారానికి ఏ దారి చూపుతారో అంతా మీ దయ—" అని అన్నది.

ఆ మాటల్లోని అంతరార్థం బోధపడింది రాజమణికి.

"సరస్వతీ! మీ సంసారాన్ని గురించి నీవేం దిగులు పడకు. మాకు కట్టుకు పోయినంత ఆస్తి వుంది. అదంతా మీ అమ్మాయిదే అవుతుంది. మీ పిల్లల చదువులు — పెళ్లిళ్ళు ఘనంగా జరిపిస్తాను. మరి మంచి రోజు చూసి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుందామా?—"

"ఎప్పుడో ఎందుకమ్మా. ఇవ్వాళ మంచి రోజే... అదేదో జరిపి పిల్లనీదనిపించుకోండి. మాకూ నిశ్చింతగా వుంటుంది —" అవకాశం చేజారితే రాదేమోనన్నంత ఆబగా అన్నది సరస్వతి.

అప్పటి వరకు వారి సంభాషణను మౌనంగా వింటున్న రమణయ్య పెదవి విప్పి ఏదో చెప్ప బోయాడు. ఇంతలో భార్య గుడ్లురిమి సైగ జేయడంతో తెరిచిన నోరు మూసుకుపోయింది. రాజమణి అది గ్రహించి "ఏమయ్యా! రమణయ్యా నీకేదయినా అభ్యంతరమా?—" అని అడిగింది.

"అబ్బే! అభ్యంతరమెందుకుంటుందమ్మా.. కూతురికి పట్టిన అదృష్టానికి మురిసిపోతున్నాను. మొత్తం మీద మా మురళి పెట్టి పుట్టింది. లేకుంటే మీ వంటి గొప్ప వాళ్లతో వియ్య మొందగలమా?—" అని సమాధాన మిచ్చింది సరస్వతి.

రాజమణి, సరస్వతి మనస్తత్వాన్ని — ఆ ఇంట్లో ఆమెకున్న విలువను — పెత్తనాన్ని గ్రహించింది.

"మరి అమ్మాయి ఏమంటుందో —"

"అది పసిపిల్ల. దానికేం తెలుసు? రాజా లాంటి సంబంధం వస్తే వద్దని అది మాత్రం ఎందుకంటుంది? మీరేం ఆలోచించకండి. మాకందరికీ సమ్మతమే —" అని తేల్చేసింది సరస్వతి.

"సరే; సాయంత్రం పురోహితునితో మాట్లాడి పంపిస్తాను. మురళి ఆఫీసు నుంచి రాగానే మా ఇంటి కొకసారి పంపించు —" అని లేచింది రాజమణి. జమున ఇంట్లోకెళ్లి గోడకు వ్రేలాడుతున్న అక్క ఫోటో తెచ్చి చూపించింది రాజమణికి. దాన్ని చూసి 'అందమైన పిల్ల! ఈడు..జోడు బాగానే వుంటుంది... కానీ ...! ఇప్పుడవన్నీ ఆలోచించడం అనవసరం. వాడి సంతోషమే తనకు ప్రధానం — దేవుడు ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది —' అని అనుకుంది.

మురళి సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చే సరికి కాస్త అలస్యమయింది. ఈ లోగా తాంబూలాలు పుచ్చుకోవడం, పెళ్లి ఖాయం చేసుకోవడం జరిగిపోయింది. సరస్వతి ముఖమింత చేసుకుని ఆప్యాయంగా నవ్వుతూ ఎదురొచ్చింది.

"మురళీ! నువ్వెంతో పుణ్యం చేసుకుని పుట్టావే తల్లీ... నీకు పెళ్లి ఖాయం చేసాము," అని మురళిని దగ్గరకు తీసుకుని అపురూపంగా మెటికలు విరిచింది సరస్వతి.

పిన్ని మాటలకు విస్తుబోయింది మురళి.

"ఏమిటి పిన్నీ ఏమిటి నీవనేది?— పెళ్లి ఎవరికి?"

"నీకేనే పిచ్చితల్లీ! జమిందారు రాజమణి గారని, ఆవిడ చాలా మంచిది. వాళ్ల మనవడు శివశంకర్ ఫారిన్‌లో చదువుకుని వచ్చాడు. నిన్ను ఆ మధ్య ఎక్కడో చూసాడట. అప్పటి నుంచి నిన్నే చేసుకుంటానని పట్టుబట్టాడట. దానితో ఆమె మన ఇల్లు వెదుక్కుంటూ వచ్చింది. అన్నీ మాట్లాడుకున్నాం. లక్షణమైన సంబంధం పోతే రాదని తాంబూలాలు కూడా పుచ్చుకున్నాం మొత్తానికి బంగారం పూలతో పూజ చేసావే మురళీ... నీ అదృష్టం అందరికీ రమ్మన్నా వస్తుందా?—"

మురళికి వెంటనే నోట మాట రాలేదు.

"పిన్నీ! నీవు చెప్పేది నిజమేనా?—" పాలిపోతున్న వదనంతో అడిగింది.

"అబద్ధం ఎందుకు చెబుతాను. అదృష్టం

**జరిగిన కథ — 3:** విజయ్, మురళి కాశీకి పోతూ రైల్లో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. విజయ్ గడిచిపోయిన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు — విజయ్ పోలీసు ఇన్‌స్పెక్టరుగా ట్రయినింగ్‌అవుతున్నాడు. మురళి ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తూంటుంది. మురళి మంచితనం చూచి ఆమెను ప్రేమిస్తాడు విజయ్. మురళితో తను ఆమె స్నేహాన్ని కాంక్షిస్తూన్నట్లు చెపుతాడు. మురళి పిన్ని తన చిన్నాన్న కొడుకు పెళ్ళికి వెళ్ళేందుకు డబ్బు కావాలని మురళితో ఘర్షణ పడుతుంది. అందుకై మురళికి డబ్బు సహాయం చేస్తాడు విజయ్. ఇష్టపడితే ఆమెను వివాహం చేసుకుంటానంటాడు ఆమె తన నిర్ణయం తెలిపేందుకు కొంచెం టైమ్ కావాలని కోరుతుంది. విజయ్ ప్రేమను అంగీకరిస్తుంది మురళి. శివశంకరం మురళిని తన ప్రియురాలు మీనాగా భ్రమ చెందుతాడు. తన మనవడి కోరికపై రాజమణి మురళిని తన ఇంటి కోడలుగా చేసుకుంటానని మురళి పిన్నికి చెపుతుంది. కారణం చెప్పకుండా విజయ్‌ను దూరమువ్వసుంటుంది మురళి.

వెదుక్కుంటూ మన ఇంటి తలుపు తట్టింది. ముందు కాళ్ళు, ముఖం కడుక్కునిరా, కాస్త వేడి వేడి కాఫీ త్రాగుదువు గానీ—'' అని ఆప్యాయతను ప్రకటించింది.

మురళి తల తిరిగిపోయిందా మాటలకు.

'ఏమిటి తనకు పెళ్ళా !? తనకు తెలీకుండా, తనతో చెప్పకుండా తనకు పెళ్లి ఖాయం చేయడ మేమిటి ? ఎవరా రాజమణి ? అంటే అతను ... ఆవేళ తనను చూసి మీనా అని వెంబడించిన అతనా ?

భగవంతుడా ! ఏమిటీ దారుణం ?—' అని వణికిపోయింది మురళి.

''పిన్నీ ! ఎందుకిలా చేసారు ? నాతోమాట మాత్రమైనా చెప్పకుండా ఏమిటీ పని ?''

ఆ ప్రశ్నకు వెళ్లబోయిందల్లా ఆగింది సరస్వతి. మురళి ముఖంలోకి చూసింది. ఆమె ముఖం కోపంతో ధుమ ధుమ లాడిపోతోంది. సరస్వతి మరొకప్పుడైతే తనూ కోపం తెచ్చుకుని ఇల్లుపీకి పందిరేసేది. కానీ ఈసారి అలా చేయ లేదు. చల్లగా చిరునవ్వు నవ్వేసింది.

''ఏమిటే మురళీ ! నీతో చెప్పకపోతేనేం ? నీ మంచి చెడ్డ మాకు తెలీవా ? అబ్బాయి దొర బాబులా వున్నాడు. నీవేం దిగులు పడనవసరం లేదు. పైగా నిన్నతను కావాలని చేసుకుంటు న్నాడు. ఆ ఇంటి కోడలు కావడం నీవుచేసుకున్న పుణ్యఫలం—''

''నా కిష్టంలేదు పిన్నీ. నేతన్ని చేసుకోను'' ఖచ్చితంగా చెప్పింది మురళి.

''ఏం ఎందుకని ?'' కనుబొమలు ముడి పడ్డాయి.

''నా కిష్టం లేదంతే—''

''మా కిష్టమయింది ఖాయం చేసాం—''



''పెళ్లి చేసుకునేది నేను. ఇష్టంలేని పెళ్లిచేసి నా గొంతు కోస్తావా ? వద్దు పిన్నీ... దయచేసి ఈ విషయంలో నన్ను బలవంతం చేయకు—'' అప్పటికే మురళి కళ్లలో సన్నటినీటి పొర దిగింది. సరస్వతి కంఠం కోపంగా, కఠినంగా

మారిపోయింది. అంతవరకు తెచ్చి పెట్టుకొన్న సౌమ్యత, ఆప్యాయత కరిగిపోయింది.

"ఏమిటే నీ ఏడుపు? అదృష్టం అందలం ఎక్కిస్తానంటే తిరస్కరిస్తావా ? పిచ్చి పిచ్చి వేషాలు కట్టిపెట్టు. నీ మంచి చెడ్డలు మాకు తెలుసు. నీ కిష్టం లేకపోయినాసరే ఈ పెళ్లి జరిగి తీరుతుంది. పది జన్మలెత్తినా మనకిలాంటి సంబంధం దొరకదే. అనవసరంగా హైరానపడకు. నేను వాళ్లకు మాటిచ్చాను. నా మాటకు వ్యతిరేకంగా ఈ ఇంట్లో ఏదీ జరక్కూడదు—"

"పిన్నీ ! .. ఇది చాలా అన్యాయం. ఇది మరొకటి మరొకటి అయితే నీమాట వినేదాన్ని... కానీ నూరేళ్ల జీవితం గడపాల్సిన పెళ్లి విషయం... నేను ఏనాడూ నోరు తెరిచి నిన్ను ఏ కోరిక కోరలేదు. నాకా ఆస్తిపాస్తులు, భోగ భాగ్యాలు అక్కర్లేదు. నేను ఇదివరకే ఒకవ్యక్తికి మనసిచ్చాను. అతను చాలా మంచివాడు. అతన్నే చేసుకుంటాను..."

సరస్వతి ఆడపులిలా హుంకరించింది.

"ప్రేమలేదు దోమలేదు. నోరుమూసుకుని పడివుండు. ఇద్ది పెద్ద వాళ్లతో వ్యవహారం"

"మనసులేని పెళ్లికి తలవంచి నా జీవితాన్ని నరకం చేసుకోమంటావా పిన్నీ. దయచేసి ఈ విషయంలో నాకు అన్యాయం చేయకు—" నీళ్లు నిండిన కళ్లతో అర్థింపుగా అన్నది మురళి.

సరస్వతికి తిక్కరేగింది. ఇలా మెత్తగా చెబితే లాభంలేదని స్వరాన్ని హెచ్చు స్థాయికి పెంచేసింది. నానా మాటలంది. చెడామడా తిట్టి పోసింది.

"దరిద్రపుదానా ! ఈ పెళ్లి జరిగితే నీతో పాటు మేమంతా కూడా సుఖపడతామే. రాజమణి మంచి వుదారస్వభావం కలది. మన కుటుంబం బాధ్యతలన్నీ ఆవిడ తీసుకుంటానన్నది. చెల్లెళ్ల చదువులు— పెళ్లిళ్లు, అన్నీ ఆవిడ చూసు కుంటానంది. మేమంతా బ్రతికినంత కాలం బ్రతికే ఏర్పాట్లు చేస్తానన్నది. ఇప్పుడు నీవు కాదంటే మేమంతా ఏం కావాలి?—"

"మీ స్వార్థం కోసం నా జీవితాన్ని బలి చేయదలిచారా ?"

"అవును. మాది స్వార్థమేనే. సంపాదించే ఆయన రోగంతో మంచమెక్కాడు. నీదారి నీవు చూసుకుంటె మేమంతా ఏం కావాలి? ఈ సంసారం ఎలా గడుస్తుంది? బుద్ధిగా మాకోస మయినా నీవు ఈ పెళ్లికి ఒప్పుకో—"

"పిన్నీ .. నే నంతటి త్యాగం చేయలేను నా మనసును చంపుకోలేను."

"విశ్వాసఘాతకురాలా ! మాకన్నా నీకు మనసే ముఖ్యమయిందటే ? నీ కులమేదో, మత మేదో తెలీకుండా దగ్గరకు తీసి కన్న కూతురి కన్నా ఎక్కువ ప్రేమతో పెంచాము. ఎవరు కని పారేశారో— దయతలచి మేము చేరదీయకపోయి నట్లయితే నీ బ్రతుకేమయ్యేది? అదృష్టం బావుండి ఈ రోజు సిరిగల ఇంటికి కోడలు కాబోతున్నావు.

ఇన్నాళ్లూ నిన్ను పెంచినందుకైనా మా మీద కృతజ్ఞతగానయినా, ఈ పెళ్లికి ఒప్పుకో వచ్చు. నీకు నీతి — జాతి వుంటే పెంచినవాళ్ల మీద తిరగబడవు—" అని తన అక్కసునంతా వెళ్లగక్కింది సరస్వతి.

మురళి ముఖం వెలవెల బోయిందా మాటలకు.

"పిన్నీ—"

"ఎవరే పిన్నీ ? ఏనాడో పుష్కరాల్లో దొరికితే నిన్ను తెచ్చి పెంచాను. అందరికీ మా అక్క బిడ్డని చెప్పుకున్నాను. పరాయి బిడ్డవన్న పక్షపాతం లేకుండా నా బిడ్డలతో సమంగా పెంచాను. నీకు నిజంగా కృతజ్ఞత వుంటే నా మాట కాదనవు."

మురళి నిలువునా వణికిపోయింది.

'ఏమిటీ ? తను వీళ్లకు దొరికిన బిడ్డా ? ఇన్నాళ్లు పిన్ని తన గురించి చెప్పినదంతా అబద్ధమేనా ? అక్క చనిపోతే తనను తెచ్చి పెంచుకున్నట్లు అందరికీ చెప్పింది పిన్ని. తను కూడా అదే నిజమని నమ్మింది. మరి ఈనాడు... పిన్ని మాటలు నిజమా ?

తన తల్లిదండ్రు లెవరు? ఎక్కడున్నారు? భగవాన్! ఎందుకు నాకిలాంటి శిక్ష వేస్తున్నావు? నాకు కులం లేదు, మతం లేదు. తల్లిదండ్రు లెవరో తెలీదు. నిజంగా పిన్ని చేరదీయకపోతే తన జీవితం ఏమయ్యేది? ఏ వైపు మళ్లేది ?

ఇన్నాళ్లూ తనను సొంత బిడ్డలా సాకిన వీరి ఋణం ఎలా తీర్చుకోవాలి ? వారి ఆదరణతో పెరిగిన తను— ఈ రోజు తన స్వార్థం తను చూసుకోవడం ధర్మమా ?

విజయ్‌కు ఈ సంగతి తెలిస్తే తనను పెళ్లి చేసుకుంటాడా ? చేసుకున్నా ఈ సంసార బాధ్యతల్ని చివరిదాకా మోయగలడా ? ఏమో ! పిన్ని చెప్పినట్లు జమిందారిణి మనవణ్నే చేసుకుంటే ... తన జీవితం అంధకారమైనా, మిగతా వాళ్లంతా సుఖపడతారు. వాళ్లకోసం తను తల దించుకోవాలి రాజీపడాలి. ఎదురు తిరిగే ఈ మనసును చంపుకోవాలి. ఆ విధంగా చేస్తే వీరి ఋణం తీరవచ్చు.

మరి విజయ్ కేమని చెప్పాలి ? నిజం చెబితే అతను భరించగలడా ? మరేంచేయాలి — ?"

మురళి సంఘర్షణకు గురయింది. ఎన్నో గంటలు తీవ్రంగా ఆలోచించి పెంచిన వారి కోసం తన జీవితాన్ని త్యాగం చేయడానికే నిశ్చయించుకున్నది.

విజయ్‌కు జరిగింది చెప్పలేక, చెప్పి అతని దృష్టిలో దోషి కాలేక — అతన్ని దూరంగా వెళ్లిపొమ్మని శాసించింది. ఆమె కోరినట్లే జరిగింది. విజయ్ ఆమె నుంచి దూరంగా తప్పుకున్నాడు

## 8

ఆలోచనలమధ్య మురళికి తెల్లవారింది. నిద్రలేమి వలన కళ్లు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. ఉదాసీనంగా కాలకృత్యాలు ముగించు కుంది. సరస్వతి కాఫీ కలిపి తెచ్చింది. మురళిని తేరపారచూస్తూ "అదేమిటే కళ్లు ఎర్రగా వున్నాయి. రాత్రి నిద్ర పట్టలేదా ? — " అని అడిగింది.

మురళి జవాబు చెప్పలేదు. మౌనంగా కాఫీ కప్పు అందుకుంది.

"త్వరగా స్నానం చేసి రాజమణి గారింటికి వెళ్లిరా. ఆవిడ నిన్ను పంపించమని కబురు చేసింది, వెళ్లకపోతే బావుండదు. ఓసారి వెళ్లిరా—" అన్నది సరస్వతి.

రాజమణి పేరు వింటూనే మురళి మనసు బుస్సుమన్నది. కసి పుట్టింది.

'రాజమణి .. రాజమణి ! ఎవరీమె ? తన జీవితాన్ని కొనడానికి వచ్చింది. ఎంత డబ్బుంటే మాత్రం తన ఇష్టా ఇష్టాలతో ప్రమేయం లేకుండా డబ్బు ఎరజూపి తమ వాళ్లనందర్నీ బుట్టలో వేసుకుంది. ఆమె మనవడికి ఎక్కడా పిల్ల దొరకనట్లు తన వెంటబడింది. వెళ్లి నాలుగుమాటలు కడిగేసి రావాలి—' అని కసిగా అనుకున్నది మురళి.

* * *

అదో పెద్ద భవంతి. చాలా ఖరీదైనదీ. ఆ ఇంట్లో నివశించేవారు ఎంతటి ధనవంతులో ఆ ఇల్లే చాటి చెబుతోంది. యజమానుల దర్జాని, హోదాకు చాటుతుంది — భవంతి చుట్టూ ఎత్తయిన ప్రహరి వుంది. మధ్యగా ఇనపగేటు వున్నది.

మురళి రెండు క్షణాలు ఆ భవనాన్ని పరీక్షించి గేటు తెరుచుకుని లోపలకు వెళ్లింది. గేటు వద్ద నుంచి హాలు వరకు సన్నని తారు రోడ్డు, దాని కిరువైపులా రకరకాల పూల మొక్కలు. వృక్షాలు ... చల్లనిగాలి, ఆహ్లాదకర మైన వాతావరణం. తోట మధ్యలో నీళ్లు విరజిమ్ముతున్న ఫౌంటెన్.

### "ప్రతిబింబాలు"

పొంగినట్లే పొంగి...
తక్షణమే క్రుంగిపోయి...
నిస్సహాయంగా పొరలుతూ...
నిమిషంలో విరిగిపోయే
తరంగాలు...
జీవిత మహార్ణవంలోని...
తృణ కాలపు జీవులకు...
ప్రతిబింబాలు... !!!

— సాయిబాబ

మురళి హాల్లోకి వెళ్ళి నిలబడి రెండు క్షణాలు తటపటాయించి గోడకున్న కాలింగ్ బెల్ నొక్కింది. రెండు నిమిషాల తరువాత తలుపు తెరుచుకున్నది.

ఓ ముసలావిడ ''ఏవరు కావాలి ?—'' అని ప్రశ్నించింది.

ఆమె ఆ ఇంటి పని మనిషని గుర్తించిన మురళి ''రాజమణి గారున్నారా ? — '' అని అడిగింది.

''అమ్మగారు పూజలో వున్నారు. లోపలకు వచ్చి కూర్చోండి. పూజ అయిపోవచ్చింది.'' అని సోఫా చూపించి లోపలకు వెళ్ళిపోయిందామె.

మురళి లోపలకు అడుగు పెట్టగానే మెత్తని తివాచీ కాళ్ళకు తగిలింది. ఆ ఇంటిని అలంకరించిన తీరును చూసి రెండు క్షణాలు విస్మయం చెందింది మురళి.

నేలమీద ఎర్రని మెత్తని తివాచీ పరచబడి వున్నది. హాలు మధ్యగా నాలుగు ఖరీదైన సోఫాలు వున్నాయి. వాటికి తొడిగిన కవర్లు రకరకాల డిజైన్లతో అందంగా వున్నాయి. టీపాయ్‌మీద ఫ్లవర్‌వాజ్‌లోని రోజాపువ్వులు అప్పుడే కోసిన తాజాదనంతో మిస మిస లాడుతున్నాయి. గోడలకు తైలవర్ణచిత్రాలు చూపరులను ఆకట్టుకుంటాయి. కిటికీలకు, దర్వాజాలకు అందమైన పువ్వులున్న నీలితెరలు వ్రేలాడుతున్నాయి. ఎటుచూసినా సిరి తాండవిస్తున్నట్లుగానే వుంది. అన్నీ ఖరీదైన సామాన్లే కనిపిస్తున్నాయి.

'బాగా బలిసిన వాళ్ళలా వున్నారు. అందుకే డబ్బుతో మనుషుల్ని కొనడానికి సిద్ధపడుతున్నారు. ఎంతమంది నోళ్ళు కొట్టి ఇదంతా సంపాదించారో—' అని కసిగా అనుకుంది మురళి.

లోపల పూజా మందిరంలోంచి గంట మ్రోత వినిపించింది.

మురళి చూపులు ఆ వైపుకు మళ్ళాయి. మరోనిమిషం తరువాత రాజమణి బయటకు వచ్చింది. తెల్లని జరీ అంచున్న చీరె ధరించింది. ఖరీదైన కాశ్మీరు శాలువా కప్పుకుంది. కళ్ళకు గోల్డ్ కలర్ ఫ్రేమ్ అద్దాలున్నాయి. తలంతా నెరిసి ముగ్గు బుట్టలా వుంది. తలస్నానం చేసినట్లుంది. నుదుట విభూతిరేఖలు వున్నాయి.

మురళి ఆమెను ఒకసారి పరిశీలనగా చూసి లేచి నిలబడింది.

రాజమణి ముఖం వికసించింది. ''ఎవరూ మురళి కదూ ! రామ్మా... ఎంతసేపయింది నీవు వచ్చి ? —'' అని ఆత్మీయంగా పలకరించింది.

మురళి జవాబు చెప్పలేదు. ఆమెవంక తీక్షణంగా చూస్తూ ''మీ పరామర్శలతో నాకు పనిలేదు. మీతో మాట్లాడాలని వచ్చాను —'' అన్నది.

రాజమణి ముఖం చిన్నబోయింది. వెంటనే సర్దుకుని నవ్వుతూ ''అలాగే రా, నా గదిలోకి వెళ్దాం —'' అని ఆదరంగా మురళి చేయి పట్టుకుని తన గదిలోకి తీసికెళ్ళింది రాజమణి.

''కూర్చోమ్మా —'' అని సోఫా చూపించి, పనిమనిషిని పిలిచి కాఫీ తెమ్మని పురమాయించింది. ఆమె చర్యలు మాటలు మెత్తగా సౌమ్యంగా వున్నాయి. ఆమె ముఖం కూడా శాంత గంభీరంగా వుంది. మురళి చూస్తూ చూస్తూ ఆమెను తిట్టిపోయలేకపోతోంది. అంతవరకూ ఆమె కనిపిస్తూనే నాలుగూ దులిపేయాలనుకుంది. తీరా ఆమెను చూసాక నోరు పెగలడంలేదు. కోపం కలగడంలేదు. రాజమణి విచిత్రమైన వ్యక్తిత్వం మురళిమనసును మెత్తబరుస్తోంది.

''కాఫీ త్రాగమ్మా. తరువాత మాట్లాడుకుందాం —'' నవ్వుతూ కాఫీ కప్పు అందించింది.

మురళి మరేమీ అన్లేదు. మౌనంగా కప్పు అందుకుంది.

'పిల్ల కుందనపు బొమ్మలా వుంది. ఈ పిల్లకు నేను అన్యాయం చేయడం లేదుగదా !' అని లోలోపల రెండు క్షణాలు మథనపడింది రాజమణి. 'కన్నా కోసం తానీ పని చేయక తప్పదు. మురళి వంటరిగా వచ్చింది. నిజం చెప్పేయాలి. చెప్పి ఈ పిల్లను ఒప్పించాలి — అని తనకు తాను సర్ది చెప్పుకున్నది.

''మిమ్మల్ని చూస్తుంటే మంచివారిలా వున్నారు. మరెందుకిలా చేసారు ? —'' అని అడిగింది మురళి. ఆ అడగడంలో కోపం లేదు. జాలి వుంది.

రాజమణి పేలవంగా నవ్వింది.

''పరిస్థితులు తరుముకువచ్చాయమ్మా తప్పలేదు —''

''అంటే — మీ స్వార్థం కోసం నా జీవితాన్ని బలిచేస్తారా ? నేను ఇదివరకే ఒక వ్యక్తికి మనసిచ్చాను. పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నాం. ఇంతలో మీరు ప్రవేశించి మీ డబ్బు ఎరచూపి మావారందర్నీ బుట్టలో వేసుకున్నారు. నాకు తెలీకుండా రహస్యంగా పెళ్ళి ఖాయం చేసారు. నాకీ పెళ్ళి ఇష్టంలేదు — నన్ను వదిలించి మీరేం బావుకుంటారు ? మీ మనవడికి పెళ్ళికూతురే కరువయిందా ? మీ డబ్బు — హోదాను చూసి మురిసిపోలేను. నాకూ ఒక మనసుంది. ఆ మనసు నిండా మమతలున్నాయి. కోరికలున్నాయి. వాటిని చంపుకుని మీరు సృష్టించే అద్దాల పంజరంలో బందీగా వుండమంటారా ?

ఇదేమి న్యాయం ?

మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. మా జోలికి రాకండి. మీ సిరిసంపదలు మాకేమీ వద్దు. మమ్మల్నిలా బ్రతకనివ్వండి చాలు —'' మురళి కళ్ళలో రోషం, గొంతులో అభిమానం తొంగిచూసేయి.

రాజమణి కోపం తెచ్చుకోలేదు. వేదనా భరితంగా నవ్వింది.

''మురళీ ! నీ మాటల్లో తప్పులేదమ్మా. నీ మనసు నర్థంచేసుకోగలను. నాకూ మానవత్వం వుంది. కానీ, నాలోని స్వార్థం ఆ మానవత్వాన్ని చంపేస్తుంది. నీ మనసు తెలుసుకోకుండా మీవాళ్ళతో మాట్లాడి పెళ్ళి ఖాయం చేయడం తప్పే ! కానీ... నిన్ను వంటరిగా కలిసి నీకో రహస్యాన్ని చెప్పి, నీ సహాయాన్ని అర్థించాలను





కున్నాను. తొందరపడకుండా కాస్త శాంతంగా విను —'' అని ఆగి కళ్లజోడు తీసి, కళ్లలో ఊరిన నీటిని తుడుచుకుంది.

మురళి విస్మయంగా చూసింది ఆమెవంక.

'ఏమిటి ఈమె మాట్లాడేది ? తనను వంటరిగా కలిసి నిజం చెప్పి తన సాయం అర్థించాలనుకున్నదా ? ఏమిటా నిజం ? ఈవిడకు తనేం సాయం చేయగలదు ? —' అని అంతులేని ఆశ్చర్యానికి లోనయింది మురళి.

''మురళీ ! నా మనవడు శివశంకర్ మీనా అనే అమ్మాయిని ప్రేమించాడట. ఆమె కారు యాక్సిడెంట్‌లో పోయిందట. అప్పటినుంచి పిచ్చివాడైపోయాడు. ఆమె అచ్చం నీలా వుంటుందట. నిన్ను చూసి మీనా అని భ్రమ చెందాడు. నిన్ను పెళ్లి చేసుకుంటానని, లేకుంటే చచ్చిపోతానని పంతం పట్టాడు.

వాడు ఒక్కడే వంశాంకురం ! తల్లి దండ్రులు లేనివాడిని ఎంతో అపురూపంగా పెంచాను. కానీ; విధి నా సంతోషాన్ని చూడలేక నిప్పులు చిమ్మింది. నా బాబు జీవితం ఇరవైలో అరవై నిండుకుంటుంది...'' దుఃఖాన్ని ఆపుకో లేకపోయింది రాజమణి. ఆమె ఎదలో బడబాగ్నులు రగులుతున్నాయి.

మురళి వింతగా చూసింది ఆమె వంక.

''మీరు చెప్పిన కథ నాకు తెలుసు. కానీ మీ మనవడి కోసం నా మనసును చంపుకుని అతన్ని పెళ్లి చేసుకోమనడం ధర్మమా ? మనసు లేని మనువు చేసుకుని ఎవరూ సుఖపడలేరు—''

''వద్దమ్మా ! నీవు వాడిని పెళ్లి చేసుకో నవసరంలేదు — ''

''మరి ?!''

''అంత స్వార్థం నాలో లేదు. కేవలం మీనాలా నటించి వాడిని తృప్తిపరుచు ... అదీ రెండు నెలలు మాత్రమే. ఇదే నిన్ను అర్థించేది — ''

మురళికేమీ అర్థం కాలేదామె మాటలు. విభ్రాంతిగా చూసింది.

''నేను మీనాలా నటించాలా ! ఎందుకు ?''

''నా మనవడు శివశంకర్‌కు బ్లడ్ క్యాన్సర్ ...! రెండు మూడు నెలల కన్నా ఎక్కువ రోజులు బ్రతకడని డాక్టర్లు చెప్పారు. ఈ సంగతి వాడికి తెలియకుండా జాగ్రత్త పడుతూ వస్తున్నాను. ఆ గరళాన్ని నా కంఠంలోనే దాచుకుని కుమిలిపోతున్నాను. లక్షలకొద్దీ ఆస్తి వుంది. ఏం చేసుకోను ? వాడికి ఆయుష్షు లేదు. మృత్యు ముఖంలో తలదూర్చి ఆరాటపడు తున్నాడు. తనలో భయంకరమైన వ్యాధి వుందని తెలీక ఇంకా జీవితంమీద ఆశలు పెంచు కుంటున్నాడు —

నిన్ను పెళ్లి చేసుకుని తీరని మమతల్ని తీర్చుకోవాలనుకుంటున్నాడు.

భగవంతుడు వాడి తలరాత మరోలా వక్రంగా రాశాడు. కంటిపాపలా పెంచిన మనవడు నా కళ్లముందే పోతాడని తెలిసి — నేను అనుభవిస్తున్న క్షోభ — ఆవేదన పగవారికికూడా వద్దు ...'' రాజమణి గొంతు దుఃఖంతో పట్టుకుపోయినట్లయి ఆగిపోయింది.

మురళి దిమ్మెరపోయింది.

తన చెవులను తనే నమ్మలేకపోయింది.

'దొరబాబులా వుండే శివశంకర్‌కి బ్లడ్ క్యాన్సరా ? రెండు నెలల కన్నా ఎక్కువరోజులు బ్రతకడా ? ఏమిటీ విపరీతం ? తనేం మాట్లాడాలని వచ్చింది — ఏం వింటుంది ? మరి ఆ సంగతి తెలిసికూడా ఈమె పెళ్లి చేయాలని ఎందుకనుకుంటోంది ? — '

రాజమణి దుఃఖాన్ని చూసి మురళి గుండె జాలితో ద్రవించింది.

''ఊరుకోండి. నిజం తెలియక ఏదో వాగాను. నా నుంచి ఏం సాయం కావాలో చెప్పండి'' అని నిండు మనసుతో అన్నది మురళి.

ఆ ఓదార్పు మాటలకు రాజమణి కరిగిపోయి చటుక్కున మురళి చేతులు పట్టుకుంది.

''అమ్మా ! పరాయి బిడ్డవైనా నిన్ను ఓ వరం అడుగుతాను ఇస్తావా ? నా బాబు కోసం నీవు మీనాలా కొన్నాళ్లు నటిస్తావా ? కేవలం వాడి తృప్తికోసమే! వాడి కళ్లముందు తిరుగుతూ వాడిని ఆనందపరిస్తేచాలు ... ఈ చివరి రోజుల్లో వాడు సంతృప్తిగా పోవాలన్నదే నా ఆశ. నేనెంత ఆరాట పడినా వాడి ఆరోగ్యం బాగుపడదు. అన్ని ప్రయత్నాలుచేసి విఫలమయ్యాను. కనీసం బ్రతికిన ఈ నాలుగు దినాలయినా వాడు నవ్వుతూ తిరగాలి. నువ్వు కాదంటే రెండు నెలల్లో చనిపోయేవాడు నెల రోజుల్లోనే పోతాడు ... నా మనవడికి ప్రాణభిక్ష పెట్టుతల్లీ ... '' అని కన్నీళ్లతో అర్థించింది.

మురళి మానసం ఊగిపోయింది.

''అమ్మగారూ ! — '' అంటూ ఆమె చేతుల్ని పట్టుకుంది.

''నా మాట కాదనకు తల్లీ ! ఆ చిన్న సాయం చేయ్. ఆ తరువాత నీ పెళ్లి నీవు కోరుకున్న వాడితో నేను జరిపిస్తాను. మీ కుటుంబాన్నంతా నేను పోషిస్తాను. నీకు జీవితాంతం ఋణపడి వుంటాను నా ఆశల దీపం మరి రెండు రోజులు వెలగనీ తల్లీ ... ''

మురళి వెంటనే ఏమీ చెప్పలేకపోయింది. సంఘర్షణ మొదలయింది ఆ హృదయంలో 'ఎందుకిలా జరుగుతోంది ? తను అనుకున్న దేమిటి ? జరుగుతున్నదేమిటి ? శివశంకర్ రెండు నెలల్లో చనిపోతాడట. ఈ రెండు నెలలూ అతను సంతోషంగా వుండాలంటే తను మీనా అవతారం దాల్చాలి. అతను తనకేమీ కాకపోయినా మానవతా దృష్ట్యా ఓ ప్రాణిని చివరి రోజుల్లో సంతోషపెట్టడం ధర్మం.

కానీ; అతను తనను మీనా అని నమ్ముతాడా ? నమ్మకపోతే అప్పుడు ... ? పెళ్లి తప్పిపోయినందుకు సంతోషమైనా, రాజమణిగారి దుఃఖాన్ని, శంకర్ పరిస్థితిని తలుచుకుంటే బాధగావుంది.

తను మీనాలా నటించినందువలన వాళ్లతో పాటు, తనవాళ్లుకూడా సుఖపడతారు. ఇందు వలన తనకు జరిగే నష్టం లేదు — ' అని ఆలోచించి అంగీకరించింది మురళి.

రాజమణి పొంగిపోయింది.

''చాలుతల్లీ ... నాకా చిన్న సంబరం చాలు ... ఈ రహస్యం నీ కడుపులోనే పెట్టుకో. ఏం చేస్తావో ఎలా నచ్చజెబుతావో వాడి భారం నీదే. ఎటువంటి స్థితిలోనూ వాడికా నిజం తెలీకూడదు.

మీ వాళ్లతో చెప్పి ఇక్కడకు వచ్చేయ్. ఇది నీ ఇల్లుగానే భావించుకో. ఇక్కడ నీకే అసౌకర్యమూ జరగదు. నీ జీవితానికి కావాల్సిన భద్రత నేనిస్తాను—'' అని సంతోషంగా గబగబ అన్నది రాజమణి.

మురళి అలాగేనని తలూపి, ఆమె వద్ద సెలవు తీసుకుని లేచింది.

ఇంటివైపు నడుస్తూ 'ఈ సంగతి రెండు రోజుల ముందు తెలిస్తే విజయ్‌ను దూరం చేసుకునేదికాదు ... మించిపోయింది కాలం. తనను అపార్థం చేసుకుని దూరంగా వున్నాడు. అని బరువుగా అనుకున్నది మురళి.

( ఇంకా వుంది )

## కోరుకున్న సంతానం !

కోరుకున్న సంతానం పొందేందుకు జపాను పరిశోధకులు ఒక నూతన ప్రక్రియను రూపొందించారు. ఇందులో ఎక్స్ క్రోమోజోములను, వై క్రోమోజోములను వేరుచేస్తారు. ఎక్స్ క్రోమోజోముల వలన మగపిల్లలు, వై క్రోమోజోముల వలన ఆడపిల్లలు జన్మిస్తారు. ఈ నూతన ప్రక్రియ రెండు, లేక మూడు సంవత్సరాలలో మానవులకు అందుబాటులోకి వస్తుంది. ఇంతవరకు ప్రయోగశాలల్లో జంతువులపై ఈ ప్రయోగాలను చేస్తున్నారు. వేరు చేసిన క్రోమోజోముల వలన మగపిల్లలు కలగటానికి 85 శాతం వరకూ అవకాశాలున్నాయని, డా. రియాచి ఈజూకా తెలియచేశారు. ఆడపిల్లల విషయంలో ఇది దాదాపు పూర్తి విజయాన్ని సాధించ గలదు. డా. రియచీ ఈ పరిశోధకులలో ఒకరు.

# జి. ఆర్. ఎస్* కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త

# ప్రెస్టీజ్

Patent pending

గ్యాస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige

PRESSURE COOKER

Cook a whole meal in minutes

**100%**
**భద్రత**



## జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది



## అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అదికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా, భద్రంగా వదలివేస్తుంది,



## జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో,అసలైనదో మీరు గుర్తించలేరు, ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.**

ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే, తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర్ — అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**TTK తయారీ.**

**Prestige**



ప్రెస్టీజ్ . . . భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

maa(s) TTP 3 Tel b 82

# కొత్త సీరియల్ ప్రారంభం!

"మా విజయ పెళ్ళి ఆగిపోయింది కృష్ణమూర్తి! ఇదిగో నీ డబ్బు! అవసరానికి ఆదుకున్నావని మురిసిపోయాను మొన్నటి వరకు...కానీ...ఆ కుర్రవాడికి...మా అమ్మాయి నచ్చలేదుట!... ప్చ్!... పోనివ్వు నాయనా! మనిషి కొన్నిసార్లు ఓడిపోవాలి! అప్పుడే మనల్ని మించిన అదృశ్య శక్తి ఒకటున్నదన్న సత్యం గుర్తుకు వచ్చి అహంభావం తగ్గిపోతుంది." సోమయాజులుగారి కళ్ళల్లో సన్నని నీటితెరలు! ఆ తెరల వెనుక బాధ దాగివున్నదని రవ్వంత వణికిన ఆయన స్వరం యిట్టే చెప్పివేసింది.

"చిదిమి దీపం పెట్టుకోవచ్చు! మన విజయమ్మని కాదన్నవాడికి కళ్ళు లేవేమో బాబుగారూ!"



కనులు మూసుకొని గోడకు చేరగిలబడిన యాజులుగారు నవ్వారు విరక్తిగా. వయస్సుపైబడి ముడతలుపడిన ఆయన ముఖం మరింత దీనంగా గోచరించింది.

'అస్త్ర సన్యాసం జేసిన భీష్ముణ్ణి' గుర్తుకు తెచ్చిందాయన నిస్తేజంగా తలగడపై వాలిపోతుంటే. కృష్ణమూర్తి నిట్టూర్చాడు.

వివాహానికి సరిపోదని పెద్ద రైతు, కృష్ణమూర్తిగారి నడిగి అయిదువేలు అప్పుగా తీసుకున్నారాయన. కానీ మూడురోజుల క్రితం విజయ ఓ లేఖను తెచ్చి—తాతగారికిచ్చి నిశ్శబ్దంగా లోనికి వెళ్ళిపోయింది. ఆయన ఆనందాన్నిట్టే మాయం చేసివేసిందా లేఖ. విజయను పిల్చినా బయటికి రాలేదు. బదులూ చెప్పలేదు.

నెమ్మదిగా లేచి లోపలికి వెళ్ళారాయన విజయ పూజగదిలో కిటికీ ప్రక్కన నిలబడి శూన్యంలోకి చూస్తోంది. తాతగారు తలుపులు తీసుకుని రావటం చూసి నవ్వింది సన్నగా. కానీ ఆ నవ్వులో జీవమే లేదు. కొండంత బాధను

దిగ్రమింగుతూ — గుండెలోకి జారుతూన్న దుఃఖాన్ని భరించలేక నవ్విందని ఆయనకు స్పష్టంగా తెలిసిపోయింది.

''ఇంకా దేవుణ్ణే నమ్ముతున్నావా తాతయ్యా ?''

ఆమె కరం నిండుగా విరక్తి, నిరుత్సాహం, నిరాశ.

''మనిషి నిశ్చింతగా వుంటే దేవుడు గుర్తుకు రాడమ్మా! నిరాశ, దుఃఖం, భయం, బాధ — మనస్సుకు వేదాంతాన్ని బోధిస్తాయి తల్లీ! ఆ వేదాంతంలో నుంచి మనిషి తనకు తెలియకుండానే భగవంతుణ్ణి వెదుక్కుని వేరుగా నిలబెట్టుకుని మరింత శ్రద్ధగా ప్రార్థిస్తాడు. ఈ సారథికి నువ్వు నచ్చకపోవచ్చు ... కానీ...''

''మళ్ళీ ఆ మనిషి పేరెత్తకండి తాతయ్యా!''

ఆ తరువాత ఆయన ఏదో గొణుక్కుంటూ వరండాలోకి వెళ్ళిపోయారు. మరుసటి వుదయం వరకు సోమయాజులుగారు విజయతో మాట్లాడనేలేదు. విజయ కూడా నిశ్శబ్దంగానే వుండిపోయింది.

కృష్ణమూర్తి గారికి డబ్బిచ్చి లోపలికి వెళ్ళారాయన.

''రాజ్యం ఎప్పుడొస్తుందమ్మా !''

''రాఘవులు వెళ్ళాడు! బస్సు లేటుగాకపోతే యీసరికి దిగే వుంటుంది! దానికి...ఈ సంగతి చెప్పకు తాతయ్యా'' రాజ్యలక్ష్మి విజయలా శాంతంగా ఆలోచించే స్వభావం గాదు.

''అక్కా! నువ్వుత్త పిచ్చిదానివి! అందర్నీ నమ్మేస్తావు!'' అని విజయని ఆటలు పట్టించు తుంది. కానీ లోలోన అక్కపైన ఎంతో గౌరవం!

''పూర్వ జన్మలో నువ్వు మా అమ్మవై వుంటావు!'' అంటూ గువ్వలా ఒదిగి ఒదిగి పడుకుంటుంది విజయ గుండెల ప్రక్కన.

''తాతయ్యా! భయం వేస్తోందా? వుండు! విజయని కాస్త నిద్రబోనివ్వు! నన్ను చుట్టేసింది చూడు పసిపిల్లలా! ఏవిటో! నేనే లేకపోతే మీరిద్దరూ యీ లంకంత కొంపలో భయంతో-ఏమై పోయేవారో!'' అంటూ తాతగారిని నవ్విస్తుంది. విజయ చెవిలో గుసగుసలు పోతుంది — ''తాతయ్య దగ్గరకెళ్ళన్లే! పడుకో! భయపడకు!'' అంటూ.

విజయ నవ్వుతుంది. మనోహరంగా చెల్లెలి పరిహాసానికి. ప్రతి రాత్రీ అలాగే పరిహాసోక్తుల్ని వెదజల్లుతుంది. అర్ధరాత్రి ఏ అవుదూడో విప్పుకున్నదని విజయ లేవగానే— తాతగారిదగ్గరకు నిద్ర కళ్ళతో పరుగెడుతుంది. ఉదయాన్నే ప్రక్కన పసిపాపలా ఓ చెయ్యి మెడచుట్టూ పెనవేసి హాయిగా నిద్రబోతున్న మనుమరాళ్ళి చూసి ప్రేమగా నుదుటిపై బడిన జుత్తుని సర్ది మృదువుగా చేతిని వదిలించుకుని లేచి వస్తారాయన.

## మూగ ముత్యాల

''అక్కా! తాతయ్య కంత భయమేమిటి? అర్ధరాత్రి 'అమ్మా! రాజ్యం!' అంటూ కేకలు వేశారు! ఇరుగు పొరుగు వాళ్ళు విని నవ్వి పోతారని వెళ్ళి పడుకున్నాను!'' అంటుంది రాజ్యలక్ష్మి ఉదయాన్నే లేచి.

''నువ్వు మా అమ్మవమ్మా!'' అంటా రాయన.

రాజ్యలక్ష్మి వున్నన్నాళ్ళూ ఆ యిల్లంతా నవ్వుల జల్లే! క్షణం సేపు నోరు మూసు క్కూర్చోదు!

''తాతయ్యా! ఓసారిలారా! తొందరగా రావాలి!'' రాజ్యం వస్తూనే హడావిడిగా కేకలు పెట్టింది. విజయ హాలు వరకు వెళ్ళి వరండాలో ఎవరో నిలబడి వుండడం చూసి ప్రక్కకు తప్పు కుంది.

''ఈయనెవరో తెలుసా తాతయ్యా! మన విజయని కాదన్న సారథిగారు!'' రాఘవులు అంతా చెప్పేశాడని విజయకర్థమై పోయింది.

''కూర్చో బాబూ!'' సోమయాజులుగారు అతని వైపు ఓ క్షణం చూసి నిట్టూరుస్తూ అన్నారు.

''క్షమించండి! నాకు . .... ..''

''అవును! మీకా హక్కు లేదిక్కడ!'' రాజ్యలక్ష్మి స్వరం నిండుగా కోపం! కక్ష!

సారథి ఆమె వైపు చూడబోయి, విరమించు కున్నాడు.

''ఇదుగోండి తాతగారూ !.. . .''

''ఆయన మా తాతయ్య! అర్ధంలేని బంధుత్వాలు నాకసహ్యం!''

రాజ్యలక్ష్మి మాటలతణ్ణి యీసారి మరింత బాధ పెట్టాయి.

''అమ్మ! రాజ్యం! నువ్వు లోపలికి వెళ్ళు తల్లీ!''

''ఫర్వాలేదు లెండి! నేను సిద్ధార్హుణ్ణే! అన్నింటికీ సిద్ధపడే వచ్చాను!'' సారథి నోట్ల కట్టను సోమయాజులుగారికి అందించుతూ అన్నాడు.

''డబ్బంతా తెచ్చారా!'' రాజ్యలక్ష్మి మనస్సులో ఆగ్రహం మండిపోతోంది.

''క్షమించాలి తాతగారూ! ఓ అయిదు వేలు తక్కువయ్యాయి! ఎంతో ప్రయత్నించాను. కానీ ... ...''

''కానీలు గీనీలు మా కనవసరం! ఇతరులకి దానం చేయడంలో మా తాతయ్య అర్హతా నర్హతలు చూస్తాడు!''

''దానం స్వీకరించడానిక్కూడా నే నర్హుణ్ణే కాను రాజ్యలక్ష్మిగారూ! అందుకే ఓ నెల లోపలే ఆ డబ్బుని కూడా పంపించుతాను!, సారథి అవమానాన్ని దిగ్రమింగుతూ ఓరిమి వహించి సమాధానం చెప్పాడు.

''తాతయ్యా! ఈవేళ శనివారం! గుడికి వెళ్ళాలి! ఆ! మనకి అర్థంలేని ఆ పెళ్ళిచూపు లకి అదనంగా ఓ అయిదు వందలయ్యాయని మరిచిపోకు! ఇంకా రావలసిన వాటికి వడ్డీ కూడా వసూలు చేయాలని గుర్తుంచుకో!''

''రాజ్యం! నువ్విలారా! రాఘవుల్ని వీధి తలుపులు మూసి రమ్మను ఆ వచ్చిన వాళ్లను పంపించి.'' లోపలినుంచి విజయ కంఠం అందరినీ శాసించింది క్షణంలో. కిటికీ పై పే ఆశగా చూస్తూన్న సారథి కళ్లు అవి రక్కున మూసుకుపోగానే నిరాశగా క్రిందికి వాలిపోయాయి

లోలోన అతని గుండెల్లో విజయని చూడా లన్న కోరిక నిరుత్సాహంతో ముడుచుకుపోయింది

''నీ ముఖం కూడా చూడదీ విజయ పొమ్మందామె!'' విసురుగా కిటికీ రెక్కల్ని మూసివేసి.

సారథి మనస్సు అవమానంతో వుడికి పోయింది. ఆ కిటికీ రెక్కల పైన విరుచుకు పడిన ఆగ్రహం అతడి వూహల్ని నిర్దాక్షిణ్యంగా పరాభవించింది.

ఇలా జరుగుతుందని అతడు వూహించు కునే వచ్చాడు! 'పరాభవం తప్పదని' మనస్సుకి పదే పదే చెప్పాడు! అయినప్పటికీ విజయ కంఠంలో నుంచి దూసుకువచ్చిన కక్షా, నిర్లక్ష్యమూ అతడిని నిలువెల్లా దహించి వేస్తున్నట్లన్పించింది.

''విజయా! ఈ సారథి నీకు శత్రువు గాదు!'' అని ఒక్కసారి ఆమెని పిలిచి చెప్పాలన్పిం చింది. ఒక్కసారి ఆమెని చూడాలన్పించింది. ''నీ కంఠం కోమలంగా వుంది! కానీ నన్నది శిక్షించింది! అయినప్పటికీ నా మనస్సులో నీకోసం తహ తహ లాడిపోతూన్న అనురాగం సజీవంగానే వుంది విజయా!'' అని చెప్పాలని ఎంతగానో తహ తహ లాడిపోయిందతని మనస్సు.

కానీ ఆమె తనను కన్నెత్తికూడా చూడ దన్నసంగతి గుర్తుకువచ్చి విల విల లాడిపోయిం దతని లోలోని అనురాగం.

''కూర్చో బాబూ!'' సోమయాజులుగారు మళ్ళీ చెప్పారు.

''బాబూ! మా విజయ అందానికి మారు రూపం! పోనివ్వు నాయనా! అందం శాశ్వతం గాదు! కానీ... మీ రనుకున్నట్లు పిచ్చిదికాదు బాబూ! ఈ వయస్సుకే నాకూ - రాజ్యానికీ అమ్మగా మారిపోయింది! మమ్మల్ని శాసిస్తుంది! పసిపిల్లలమై పోతాం మా తల్లి ముందు కొన్ని సార్లు! ''తాతయ్యా నీ కిష్టమని పెరుగు తాలింపువేసి నాలుగు ఆవడలు వేశాను!'' అంటుంది రెండంటే రెండే తినాలి! లేకపోతే నీకు జబ్బుచేస్తుంది! అని బుద్ధి జెబుతుంది! రెండురోజులు జ్వరంతో మంచంబడితే కన్న తల్లిలా సేవలుజేస్తుంది! ''ఎందుకుతాతయ్యా! నన్నిలా విసిగించుతున్నావ్! కాఫీ కాచి తీసుకు వస్తే 'చేదు'! ఫో! అంటావ్! మజ్జిగ యిస్తే

మూతి ముడుచుకుంటావ్! మందు మింగమంటే కళ్ళు మూసుకుంటావ్! ఒక్కక్షణం వంటింట్లోకివెళ్ళి చూసివద్దామనుకుంటే—'విజయా !' తల్లీ ! అమ్మా ! 'రామ్మా !' అంటూ కేకలు పెడతావు !'' అంటూవచ్చి ప్రేమగా నా నుదుట బట్టిన స్వేదబిందువుల్ని పైటచెంగుతో అద్దుతుంది. ''అలాంటి బంగారుతల్లి బాబూ మా విజయ ! మీ అమ్మగారు చూసి సంబరపడిపోయారు. ముహూర్తాలు పెట్టించారు. కాదని మళ్ళీ కబురంపించారు ! మా అమ్మాయి పిచ్చిదని వుత్తరం వ్రాశారు. మా అబ్బాయి అందానికి ఎరిపోవని ఖండితంగా చెప్పారు. బంధువులందరూ వస్తారు రేపో మాపో ! వాళ్ళకేమని సమాధానం చెప్పమంటావు బాబూ ?''

''తాతయ్యా ! గొర్రెపిల్లకి కసాయివాడి దగ్గర న్యాయం లభిస్తుందా ?''

రాజ్యలక్ష్మి మాటలతణ్ణి ఎంతగానో బాధించాయి కోపాన్ని పళ్ళమధ్యనే అణచివుంచాడు. ఆమె లోపలికి వెళ్ళినతరువాత శాంతంగా అన్నాడు —

''మీ విజయ బంగారుబొమ్మ అని మా చెల్లాయి చెప్పింది తాతగారూ ! అసలామె గురించి నేను ఒక్కమాట కూడా అనలేదు. ఇదంతా మా అమ్మగారి తొందర స్వభావం వల్ల జరిగిపోయింది. విజయనీ, మిమ్మల్నీ అన్యాయంగా శిక్షించాము అమ్మా, నేనూ ! ఘోరంగా పరాభవించాం ! మీ బంధువులందరికీ చెప్పండి—సారథి అన్న ఓ కసాయివాడికి విజయ బలైపోలేదని ! నాకు ఆస్తిపాస్తుల్లేవు తాతగారూ ! పరువు, మర్యాదల్లో మీ ముందు నేను ఓడిపొయ్యాను. నిజం చెబితే మీ ముందు నిలబడడానిక్కూడా అర్హతలేదు పొమ్మంటారు మీరు ! నాలో ఏం జూసి మీరు విజయ ప్రక్కన నిలబెట్టదలచుకున్నారో నా కర్థంగాలేదు. ఉద్యోగం లేదు ! నా పేరిట చిల్లిగవ్వ కూడా లేదు. ఒకరిని 'దేహీ' అని అర్థించే ధైర్యంలేని మూర్ఖుణ్ణి ! అభిమానమూ, ఆత్మగౌరవమూ తప్ప ఏమీ లేని యీ సారథి మీ విజయకి ఏ విధంగానూ సరిపోడు తాతగారూ ! ఇదంతా మీకు చెప్పాలనే సిగ్గూ, సంకోచం — అన్నింటినీ వదిలి యిక్కడికొచ్చాను. మీ డబ్బుని పైసలతో సహా యిచ్చివేస్తాను ! ... ''

''కానీ మీ అమ్మగారు నీకు వుద్యోగం వున్నదని చెప్పారు బాబూ !''

'అమ్మ చెప్పిన మొదటి అబద్ధం అది ! విజయతో ఒక్కసారి మాట్లాడి వెళ్దామనుకున్నాను. కానీ అందుక్కూడా నేనర్హుణ్ణిగానని తెలిసిపోయింది. ఆమెకు చెప్పండి ! నన్ను మించిన అదృష్టవంతుణ్ణి తీసుకువచ్చి తన ప్రక్కన నిలబెడతానని !''

''నీకు వుద్యోగం నేను వేయించుతాను

## మూగ ముత్యాలు

బాబూ ! ఈ శుభ ముహూర్తంలో మీ యిద్దరూ ... ''

''తాతగారూ ! నా సమస్యల్ని విప్పిచెప్పుకోలేనిపుడు ! నా కసలు వివాహం చేసుకోవాలనేలేదు అమ్మ నాకు అక్షరం కూడా వ్రాయకుండా లగ్నాలు పెట్టించింది. వచ్చి కాదుకూడదంటే ఏడ్చింది. ఏమేమో అన్నది. కానీ మరునాడు కాదు పొమ్మన్నది. నన్నో పశువుని చేసి అరవై వేలకి అమ్మాలని చూసింది. విజయ గురించి లేనిపోనివి సృష్టించింది. మరో మంచి సంబంధం వచ్చిందని మీ అమ్మాయిని విమర్శించింది. ఆ అరవై వేలకి నన్ను అమ్మేస్తానన్నది. కాదని వాదిస్తే నన్ను యింట్లో నుంచి వెళ్ళిపొమ్మంది! నాకూ తనకూ సంబంధమే లేదన్నది! అయిదారు రోజులు హైదరాబాదంతా తిరిగాను. ఓ స్నేహితుడి దయ వలన మీ డబ్బు కొంత తీసుకురాగలిగాను. మిగిలిన అయిదువేల అయిదు వందలకు నోటు వ్రాసి తెచ్చాను ! ఇదుగోండి ! నా అడ్రసు కూడా యిస్తున్నాను. నేను మీ వాణ్ణి ! మీకే సహాయం కావలసి వచ్చినా నాకు వ్రాయండి. నన్ను . మీరు... క్షమించారు ! నాకేనైనా జటిల సమస్యలు వచ్చినపుడు మీ దగ్గరకే వస్తాను !'' అన్నాడతడు నోటునీ, అడ్రసునీ అందించుతూ.

''తప్పకుండా రా నాయనా ! మనుష్యుల్లో తప్పుల్ని వెదికి సంతృప్తి పడటమంటే నాకు భయం బాబూ ! ఏ మనిషీ పూర్తిగా మంచివాడుగాలేడు. పూర్తిగా చెడ్డవాడూగాడు. నువ్వు మంచివాడివి! అని నమ్మాను నేను. ఆ నమ్మకమే నీ మంచితనాన్ని మరింత పెంచుకుంది ! అందుకే యీ నోటు అనవసరం బాబూ !'' ఆయన నోటును రెండు ముక్కలుగా చింపి పారవేశారు.

''తాతగారూ !''

''అవున్నాయనా ! తాతా మనవళ్ళ మధ్య నోట్లెందుకయ్యా ?'' సోమయాజులుగారి కళ్ళల్లో ఆనందరేఖలు మెరిశాయి.

సారథికి నోటమాట రాకుండా పోయింది రెండు మూడు క్షణాల వరకు.

''నన్ను ... మీరు అర్థం జేసుకున్నారు . చాలు తాతగారూ ! నాకిపుడు మిమ్మల్ని మించిన ఆత్మీయులెవ్వరూ లేరు ! విజయకి జరిగిన అవమానం నన్ను దహించి వేస్తోంది ఓ ఆడపిల్లకి యింతకు మించి ఎరాభవం మరొకటుండదు. అందుకే నా స్నేహితుడికి వ్రాశాను వాడు బ్యాంకులో ఆఫీసరు, విజయకు సరైన వాడు ! ఓ నెల రోజుల్లో ట్రైనింగు పూర్తవుతుంది. ఆ తరువాత తీసుకువస్తాను.''

''తాతయ్యా ! ఇక్కడ మరొకరి దయాదాక్షిణ్యాలకీ, సహాయాలకీ ఎవ్వరూ ముఖంవాచి కూర్చోలేదని చెప్పు ! పూజారిగారు కబురంపించారు. వాళ్ల పాపకి అక్షరాభ్యాసం మీరే చేయించాలట ! మేంకూడా వెళ్తున్నాం ! రాఘవుల్ని వాకిట్లో కూర్చోమని చెప్పు'' విజయ కంఠం ఆ యిద్దర్నీ చకితుల్ని చేసింది.

క్షణంసేపు నోరెత్తలేకపోయారు.

''మా విజయకి మాట తప్పడం యిష్టం వుండదు బాబూ !'' అన్నారాయన ఆమె కోపానికి కారణం చెప్పాలన్న వుద్దేశ్యంతో.

''విజయ కోపం నన్ను మ్రింగివేయాలని చూస్తోంది తాతయ్యా ! అందుకు నేను సిద్ధంగానే వున్నానని చెప్పండి ! మరిక వెళ్తాను !'' సారథి లేచి నిలబడ్డాడు.

సోమయాజులుగారు అతని చేతుల్ని అందుకుని ఆప్యాయంగా కళ్ళల్లోకి చూస్తూ అన్నారు —

''సారథీ ! నేను ..... ముసలివాణ్ణి ! మా పిల్లలకి నేను తప్ప మరో దిక్కు లేదు ! ఎప్పుడో యీ హంస లేచిపోతుంది ! ఏ పనీ



# ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.



ఇంట్లో వాళ్ళందరికీ ఏది మంచిది అన్నది అమ్మ కన్న మించి ఇంకెవరికి తెలుస్తుంది!

ఇక కాఫీ రుచి విషయం ఎత్తావంటే అమ్మదే తుది నిర్ణయం. ఆ నిర్ణయంపైనే అందరికీ గౌరవం

అందుకు కారణం కాఫీ చేయడంలో అమ్మ అనుభవసారమే. అనుదినం అమ్మ చేతి కాఫీ తెచ్చే ఆ తొలి వెలుగుల తాజాదనం తిరుగులేనిది దాన్ని తయారుచేసి అందించే అమ్మ చేయి అంతకన్న తిరుగులేనిది.

అది అమ్మ హస్తవాసి అందమా, లేక ఆమె రహస్యమందమా! చక్కని రుచీ,సువాసనా ఇచ్చే ఆ ఖచ్చితమైన రంగుకు కాఫీ విత్తుల్ని వేయించడం, ఆ పొడి కొట్టడం, వడకట్టడం...



ఇక చుక్క చుక్కగా కిందికిదిగే ఆ డికాక్షన్ చిక్కగా ముదురు రంగుతో నోరూరించే దాని సువాసన, నురుగు తేలుతూ, పొగలు కక్కుతూ అది అందించే ఆహ్వానం. అబ్బ! ఆ తాజాదనపు సువాసనకు జోహార్లు చెప్పాలి. నురగల బుడగలలో దోబూచులాడుతూ వచ్చే ఆ రుచికి జేజేలు పలకాలి.

ఆ మేళవింపులో పరిపూర్ణత సాధించడానికి ఎన్నేళ్ళ తపస్సు అవసరమైందో!

## సన్‌రైజ్. శ్రేష్ఠతకొక బిరుదు.

ఇంట్లో అమ్మ చేసే కాఫీ గురించి మాకు అన్నిటికన్న ఎక్కువగా నచ్చిన విషయం అదిచ్చే ఆ "తొలి వెలుగుల తాజాదనపు" అనుభూతి.

అందుకే మా మిశ్రమానికి "సన్‌రైజ్" అన్న పేరు పెట్టాం. అదెంత మంచిదంటే, అత్యుత్తమ మైన కాఫీకి అదొక యోగ్యమైన బిరుదు అని మా విశ్వాసం.

## అమ్మ పద్ధతే అచ్చంగా మా పద్ధతీనూ

అమ్మలాగే, కాఫీ గొప్ప అంతా 'సరైన' కాఫీ

విత్తుల ఎంపికలోనే ఉందన్న సంగతి మేమూ గుర్తించాం, అందుకే, చిక్కదనం, సువాసనా సరైన పాళ్లలో ఇచ్చే కాఫీ విత్తుల ఎంపికలో మా నిపుణులు శిక్షణ పొందారు.

అమ్మ చేసినట్టుగానే మేమూ కాఫీ విత్తుల్ని సరిగ్గా తగినంత మేరకు వేయిస్తాం. అలా ఆ చిక్కదనం, సువాసన, రంగు పరిపూర్ణ స్థాయిలో వచ్చేలా చేస్తాం.

సరిగ్గా అలాటి సమయంలో ఆ విత్తుల్ని అతి వేగంగా చల్లారుస్తాం. దానితో వాటి మంచితనం, సువాసన, రుచి, చిక్కదనం, రంగు అన్నీ అలా అందులో నిలిచిపోతాయి.

ఆ విత్తుల్ని నాజూగ్గా పొడికొట్టి, బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో పడపోస్తాం. దీనితో ముదురు రంగుతోటి, ముగ్ధుల్ని చేసే సువాసనతోటి అతి చిక్కని డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ కాఫీ రుచికి నోచుకున్న వారందరికీ ఇది సుపరిచితమైందే.

## చిక్కని డికాక్షన్ నుంచి మళ్ళీ పొడి.

ఈ దశలో డికాక్షన్‌ను సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది. ఈ పద్ధతి వెనక 40 ఏళ్ళ పరిశోధన, అనుభవాల పరిపూర్ణత ఉంది.

ఇక బంగారు గోధుమ రంగులో ఉన్న ఆ పొడిలో తాజాదనం, సువాసన సమృద్ధిగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జాడీలలోకి, సంచీలలోకి నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం అన్నీ అందులోనే దాగి ఉండేలా సీలుచేయడం జరుగుతుంది. ఆ గుణాలన్నీ కలసి ఏ వేళలోనైనా, ఏ జాములోనైనా

## ఆ సన్‌రైజ్ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి మీకు నిస్సందేహంగా అందుతుంది.



ఇక సన్‌రైజ్ అచ్చంగా ఇంట్లో అమ్మ పద్ధతి లోనే తయారవడం వల్ల, ఆ శ్రేష్ఠతకు ఇదొక యోగ్యమైన బిరుదే అనవచ్చు కదా మరి!




కొత్త
Nestlé
సన్‌రైజ్
ఇన్‌స్టంట్

# ఇంట్లో అమ్మ చేసిన కాఫీ అందించే ఆ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

ఎంపిక చేసిన పట్టణాలలో మాత్రమే లభించును

చేయలేని స్థితిలో వున్నాను! గాలిలో దీపం లాంటి వాణ్ణి! ఈ పెళ్లి జరిగిపోతే బాధ్యతలన్నీ నీ పైన వేసి నిశ్చింతగా వెళ్లిపోదామనుకున్నాను! కానీ భగవదనుగ్రహం లేదేమో — ఆ శుభం ఆగిపోయింది! అయినా నీకు తాతయ్యనయ్యాను! అందుకే ఆ పిల్లలిద్దరి జీవితాలూ ఓ ఒడ్డు చేరేవరకు యీ యింటి బాధ్యతలన్నీ నీకే అప్పగించుతున్నాన్నాయనా! మా బంధువుల్లో చాలామంది దుర్యోధన సార్వభౌములు! అందుకే నువ్వు నాకు సారధివి!" మనోవ్యధని సున్నితంగా విప్పి చెప్పుకున్నారాయన.

"ఈ సారధి మీ మనిషే తాతయ్యా! మిమ్మల్ని చూడగానే అనుకున్నాను! మీరు నన్ను క్షమించుతారని. మీ బాధ్యతలన్నీ ఈ క్షణం నుంచీ నావి! విజయ కోసం నన్ను మీ మంచి దూరంగా విసిరివేయలేదు!"

"ఈ డబ్బు వుంచు బాబూ! అవసరం వస్తుంది!" ఓ రెండు వేలు తీసి యివ్వబోయారాయన.

"వద్దు తాతగారూ! ఓ నెలరోజుల్లోపల వుద్యోగం దొరుకుతుందన్న నమ్మకంతో హైద్రాబాదు వెళ్తున్నాను. ఈలోపల బ్రతకడానికి ట్యూషన్లు వున్నాయి! నాకు తీరిగ్గా కూర్చోవడం చేతకాదు తాతయ్యా! యస్. ఏ. చేస్తూనే ట్యూషన్లు చెప్పేవాణ్ణి! ఆ అలవాటు నన్ను నన్నుగా నిలబెట్టింది!" అతని ప్రతి మాటలోనూ ఆత్మాభిమానం ప్రత్యక్షమైంది. ఆయన ముగ్ధులయ్యారతని అభిమానానికి.

"మంచిపనే బాబూ! మనిషికి ఆత్మబలం వుండాలి! ఆ బలం కృషి నుంచే వస్తుంది! వెళ్ళగానే జాబు వ్రాయి!"

అలాగేనని చెప్పి సారధి సెలవు తీసుకున్నాడు—

"రత్నంలాంటివాడు రాఘవులూ! మన అదృష్టం బావుండకపోవడంచేత పోగొట్టుకున్నాం!" పాలేరు రాఘవులితో అన్నారాయన.

## మూగ ముత్యాలు

## 2

వేములపల్లిలో సోమయాజులుగారిని ఎరుగని మనిషేలేడు. ఆవూరి కరణంగా అధికారంతోపాటు అభిమానాన్ని కూడా సంపాదించుకున్నారాయన. తాతముత్తాతలనాటి నుంచి నేర్చుకున్న వైద్యం మరింత గౌరవాభిమానాల్ని ఆర్జించిపెట్టింది.

"యాజులుగారూ! మా చిన్నవాడికి జ్వరంగా వుంది. ఓసారి రావాలి మీరు! మీరు వస్తేగానీ వాళ్ళమ్మకి గుండెలు కుదుటబడవు." అనేవారు వూరి మునసబుగారు. జ్వరం తగ్గినా మరో రెండురోజులవరకూ ఆయన వెళ్ళవలసిందే! లేకపోతే మునసబుగారిక్కూడా ధైర్యంగా వుండదు.

ఆ యింటి యిల్లాలికి నిలువెత్తున్న యాజులుగారి విగ్రహాన్ని చూస్తే మనస్సులో పేరుకుంటూన్న ఆందోళన, భయం యిట్టే కరిగిపోయేవి. అత్యంత ప్రియమైన ఆత్మబంధువుని చూసినట్టుండేది.

ఆ వూరిలో ప్రతి యింటికీ ఆప్తుడే ఆయన. అంటరానివాళ్ళు అనుకున్న గూడెంలో వాళ్ళుకూడా ఆయనకు కావలసినవాళ్ళే!

"అయ్యగోరూ! సంటిదానికి ఒల్లంతా నెప్పులు, దగ్గూ, రొంప ఓ మాతరియ్యాల తవరు!" అని జోగులు గూడెం పెద్దవచ్చేవాడు. లక్షణాలన్నీ మళ్ళీ చెప్పించుకుని, శ్రద్ధగా విన్న తరువాత మందిచ్చేవారాయన.

ఆ సాయంత్రమే చెరువుగట్టు దగ్గర ఆగి మనిషిని పంపి ఆ పసిబిడ్డ ఆరోగ్యం గురించి విచారించేవారు — "ఇదుగో! నగ్గుబియ్యం జావ కాచి యివ్వమని చెప్పవాడికి!" అంటూ ఓ నాలుగు రూపాయలిచ్చేవారు. — జోగులి భార్య కూడా కూలికి వెళ్ళడంలేదని తెలిసి.

"ఈ బీదతనం మనిషికీ మనిషికీ మధ్య ఆచారాల్నీ, అంటరానితనాన్నీ సృష్టిస్తోంది! కడుపు నిండనివాడు పరిశుభ్రత గురించి ఎలా ఆలోచించగలడు? ఆ శుభ్రత లేనివాళ్లు అంటరానివాళ్ళయిపోయారు! ఆరోగ్యం పోగొట్టుకుని విద్యావిహీనులయ్యారు! గొప్పవాళ్ళు కాలేక చిన్నవాళ్లయిపోయారు. ఈ సంఘానికి కావలసినవాళ్ళయ్యుండీ— కష్టానికి తగిన ఫలితాన్ని పొందలేక— అన్యాయానికి బలైపోతున్నారు! మనిషి బీదతనాన్ని పోగొట్టుకోలేడు! పైగా అందులో మగ్గిపోయేవాళ్ళకోసం— ఆచారాల్నీ, అంటరానితనాన్నీ అంటగట్టి— 'ఒక్క ఆకాశం క్రిందే బ్రతుకుతూన్న తనవాళ్ళని తానే వేరు చేస్తున్నాడు. ఈ మనిషి— పశువుని మించిన మూర్ఖుడైపోతున్నాడు." ఆయన మనస్సు సంఘంపైన తిరుగబడుతూండేది గూడేన్ని చూడగానే.

"గుళ్ళో దేవుడికన్నా ఈ కరణం బాబే నయం! పిలిస్తే పలుకుతారు! బాబో! గంజి నీళ్ళు తాగి రెండురోజు లయ్యిందంటే రెండు రూపాయిలిత్తారు!" అనుకుంటారు గూడెం లోనివాళ్ళు.

"యాజులుగారీవేళ పురాణం చదువుతారట! గుళ్ళో ఖాళీ వుండదిక! ముందే వెళ్ళి కూచోవాలి! ఆ నాలుగు క్షణాలూ యీ బాధలన్నీ మరిచిపోయి, భగవంతుడి ముందు కూచున్నట్లుందాయన కంఠం వింటూంటే. గంభీరమైన ఆయన కంఠం గుండెల్లోపలవున్న కామక్రోధాల్నీ, యీర్ష్యాద్వేషాల్నీ, ఆశానిరాశల్నీ పిలిచి గిరిగీచి నిలబెడుతుంది" అనేది ఓ యిల్లాల్లు.

"రాళ్ళకీ రప్పలకీ ప్రాణంలేదు. పశుపక్ష్యాదుల్లో ప్రాణశక్తి వున్నా జ్ఞానంలేదు. మనిషికి ప్రాణం వుంది! జ్ఞానమూ వుంది! ప్రయత్నించినమీదట యీ మనిషే మహాఋషి అవుతాడు. ఆ మహాఋషే దైవసమానుడవుతాడు! కానీ యీ మెట్లెక్కేంతవరకు మనిషి తనకున్న జ్ఞానశక్తిని సక్రమంగా ఉపయోగించుకోవాలి! కానీ మనలో చాలామంది వున్న

## "రామరాజ్యంలో భీమరాజు"లో రామరాజు హడావిడి !

లక్ష్మీపతి (సత్యనారాయణ) ఇంటి ముందు హడావిడిగా ఉంది. ఇద్దరు నౌకర్లు పళ్ళబుట్టలు, ప్లాస్టిక్‌సంచులు తీసుకొచ్చి వరుసగా పెట్టేస్తున్నారు. రామరాజు (రావుగోపాలరావు), కైలాసం (అల్లు రామలింగయ్య) నౌకర్లకు పురమాయిస్తున్నారు.

"కైలాసం ! ఆ చీరలు పెద్దముత్తయిదువ సువర్చలగారి చేతిలోనే పెట్టాలి ... ఇదిగో ఆ పట్టుచీరల పాకెట్ మాత్రం మాలక్ష్మి జ్యోతమ్మాయి చేతికివ్వమను," అని రామరాజు అంటూంటే, లక్ష్మీపతి మరింత చకితుడయ్యాడు. "ఏమిటండీ ! ఏమిటీ హడావిడంతా? అసలు .."

"ఉండవయ్యా, లక్ష్మీపతీ ! మీ అమ్మాయిని మా కోడలు చేసుకోవాలని ముచ్చటపడి వచ్చినప్పుడు— ఉత్త చేతులతో ఎలా వస్తాం ఒరేయ్, భీముడూ ! అరటిపళ్ళ గెల అటు పెట్టు !" ఠీవిగా హుకుం జారీచేశాడు రామరాజు.

లక్ష్మీపతి ఇంకా విస్మయంలోంచి తేరుకోలేదు. "అది కాదు—"అని ఏదో చెప్పబోయేలోగా కైలాసం అందుకున్నాడు. "మీరింకేం మాట్లాడొద్దు. సాక్షాత్తూ కుబేరుడులాంటి రామరాజు గారే మీ అమ్మాయిని కోడలు చేసుకోవాలని వచ్చారు మీరు కాదనరని నాకు తెలుసు. ఈ పెళ్ళి జరగటంతోనే మీ అప్పుల కాగితాలు చింపేస్తారని సెలవిచ్చారాయన."

రామరాజు సగర్వంగా "అది మళ్ళీ చెప్పాలటయ్యా ? వియ్యంకుళ్ళం అవుతూంటే, మళ్ళీ మా మధ్య అప్పులకాగితాలు ఏమిటి ? చెల్లెమ్మా, సువర్చలా ! మంచి ముహూర్తంచూసి మీరు త్వరలో ఊఁ అనేస్తే, మీ అమ్మాయిని మా కోడలుగా తీసుకుపోతాం. చెల్లెమ్మా ! బావగారు అమాయకుడు. నువ్వే పూనుకుని ఈ పెళ్ళి జరిపించెయ్యాలి. మంచి రోజని ఇలా వచ్చాం. మరి, మేం వెళ్ళొస్తాం," అంటూ కైలాసంతో నిష్క్రమించాడు.

లక్ష్మీపతి దిగ్భ్రమతో భార్య సువర్చల (నిర్మల)వంక తిరిగాడు. "ఏమిటిది ! తుఫానులా వచ్చేసి, మనల్ని మాట్లాడనివ్వకుండా తనే సంబంధం స్థిరపరుచుకు వెళ్ళిపోయాడు ! మన అభిప్రాయం అడగొద్దూ ?" అన్నాడు.

"ఇలాంటి శుభకార్యమప్పుడు ఇంక మనకు వేరే అభిప్రాయం ఏముంటుందండీ ! ఆ ఇంటికి కోడలవుతుందంటే అమ్మాయి నిజంగా అదృష్టవంతురాలు,"అంది సువర్చల.

పై సన్నివేశాన్ని చిత్రీకరించాక "జ్యోతి— అంటే శ్రీదేవి ఆ సంబంధానికి ఒప్పుకోదు,"అని తెలిపారు డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి. జూలైలో విడుదలయ్యే "రామరాజ్యంలో— భీమరాజు" చిత్రానికి మిద్దె రామారావు నిర్మాత.



రాధిక 'తోడూ — నీడ'

'ఆనంద భైరవి' మాళవిక



## "నాకు రాజకీయాలేం కొత్త కాదు" ప్రేమ్‌నజీర్

"హైస్కూల్లో చదివే రోజుల్లోనే నేను కాంగ్రెస్‌లో చేరాను. అప్పటి తిరువాంకూర్ సంస్థాన దివాన్ సర్ సి పి. రామస్వామి అయ్యర్‌కు విరుద్ధంగా జరిగిన పోరాటంలో పాత్ర వహించాను. ఇలా నేను పాలిటిక్స్‌లో చురుకుగా పాల్గొంటూంటే, నా చదువుకు అంతరాయం కలుగుతుందని మావాళ్ళు నన్ను ఇంటర్ చదివించడానికి మా ఊరికి చాలా దూరంగా ఉన్న చెంగన్‌చెర్రీలోని కాలేజ్‌కి పంపించారు. అయినా, నేను ఎప్పటికప్పుడు దేశ విదేశ పరిస్థితులను తెలుసుకుంటూండేవాడ్ని. అంచేత, నాకు రాజకీయాలేం కొత్తకాదు," అని తెలియజేశారు సినిమా రంగం నుంచి పూర్తిగా రాజకీయరంగంలో ప్రవేశిస్తున్న ప్రముఖ మలయాళ హీరో ప్రేమ్‌నజీర్.



వనితశ్రీ, సుమన్ 'త్రివేణీ సంగమం'లో

# హిందీ చిత్ర విశేషాలు!

★ మన కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించిన చిత్రాలపేర్లు 'ఎస్'తో ప్రారంభమవుతాయన్న విషయం అందరికీ తెలుసు. (సీత కథ, సిరిసిరిమువ్వ, శంకరాభరణం, శుభోదయం, సప్తపది, శుభలేఖ, సాగర సంగమం ...). అలాగే అర్జున్ హింగోరానీ నిర్మించే హిందీ చిత్రాలపేర్లు 'కె'తో ప్రారంభమవుతాయి. అవి: "కౌన్ జార్ కహాఁ ?, ఖేల్ ఖిలారీకా, కౌన్ కరే ఖుర్బానీ." ఈయన జూన్ 10న ప్రారంభించిన "కరిష్మా కుదరత్‌కా" చిత్రంలో జయప్రద, ధర్మేంద్ర, రతి అగ్నిహోత్రి, మిథున్‌చక్రవర్తి నాయికా నాయకులు.

★ కుమార్‌గౌరవ్ నటించే కొత్త చిత్రాల పేర్లు ఆంగ్లంలో ఉన్నాయి. అవి "ఆల్ రౌండర్, రొమాన్స్, లవ్ బర్డ్స్, హలో డార్లింగ్."

★ "లావారిస్" తర్వాత "పుకార్" చిత్రంలో అమితాబ్‌బచ్చన్ "తుమ్సే కే మత్ జావో" అనే పాట పాడాడు.

★ ఆదాయపు పన్ను శాఖవారికి స్వర్గీయ మీనాకుమారి బాకీ రూ 4. లక్షలు. ఇది కాలక్రమాన వడ్డీతో కలిపి రూ 9.50 లక్షలయింది. అందుకు ఇటీవల ఏలం వేసిన ఆమె గృహాన్ని రూ 8.10 లక్షలకు కొన్న వ్యక్తి కె. కె. మిస్త్రీ అనే పెంకుల వ్యాపారి.

★ జమ్ములోని రఘునాథ్ చౌక్‌లో ఎదురెదురుగా ఉన్న రెండు కిళ్లీకొట్లకు తారల పేర్లు పెట్టబడ్డాయి. ఒకదాని పేరు "ధరమ్ హేమా పాన్‌వాలా", మరొక దానిపేరు "అమితాబ్ పాన్‌వాలా."

★ టి. సి. దివాన్ నిర్మించే "యాదోంకి కసమ్" చిత్రంలో ఒకరోజు షూటింగ్ కోసం వేసిన జలపాతం సెట్‌కు అయిన ఖర్చు దాదాపు లక్ష రూపాయలు. ఈ సెట్‌లో జీనత్‌అమన్ జలకాలాడడం చిత్రీకరింపబడింది.

★ "సాద్మ" చిత్రానికి ఊటీలో ఇటీవల ఔట్‌డోర్ షూటింగ్ జరుగుతూన్నప్పుడు ఆ చిత్రంలో నటించే వృద్ధ నటి లీలామిశ్రాకు పార్శ్వవాయువు పోకింది. ఆమెను వెంటనే చికిత్స నిమిత్తం బొంబాయికి పంపడానికి డైరెక్టర్ బాలూమహేంద్ర ఏర్పాటు చేస్తే, ఆమె నిరాకరించింది. "నా మూలంగా షూటింగ్‌కు అంతరాయం కలగడం నా కిష్టంలేదు. నాకు మిగిలి ఉన్న నాలుగురోజుల షూటింగ్‌ను పూర్తిచేసుకొనిగాని బయలుదేరను," అని పట్టుబట్టి, కుర్చీలో కూర్చొని నటించి, తన షూటింగ్‌ను పూర్తిచేసుకొని మరీ బయలుదేరిందట.

## సినిమా

### "మా ఇంటికి రండి"

లలిత కళాంజలి అనే కొత్తసంస్థ నిర్మించే పై చిత్రానికి జూన్ 15 నుంచి 18 వరకు నాలుగు పాటలు రికార్డయ్యాయి. భానుచందర్, సుహాసిని, ముచ్చెర్ల అరుణ, పి.ఎల్. నారాయణ, కాకినాడ శ్యామల, గొల్లపూడి, ఆదిగాగల వారు పాల్గొంటారు. ఉపద్రష్ట శాయి మాటలు రాశారు. సి. నారాయణరెడ్డి గీతాలకు జె. వి. రాఘవులు స్వరకర్త. లక్ష్మణ్ ఛాయ, బాలు కూర్పు, గమిడి కనకేశ్వరరావు సహదర్శకత్వంతో వాకాడ సూర్యకాంతమ్మ, జె. శ్రీవిద్య నిర్మాతలు. "జూన్ 25 నుంచి జూలై 20 వరకు పాలకొల్లులో ఒకే షెడ్యూల్లో షూటింగ్‌ను పూర్తి చేస్తాం," అన్నారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కోడి రామకృష్ణ.



'దేవి – శ్రీదేవి' జయసుధ

### బట్టలకొట్టు ముందు సిల్క్‌స్మితా బొమ్మ

మధురైలో ఒక పేరుమోసిన జవుళికొట్టు ముందు చాలా పెద్దసైజు సిల్క్‌స్మిత ఫోటో రోడ్డుమీద వెళ్లేవారందరి దృష్టిని ఆకర్షిస్తూంటుంది. ఆ ఫోటో పక్కన బోర్డులో ఇలా ఉంది: "మహిళామణులారా! మీరు సిల్క్‌స్మితలాగా చాలీచాలని బట్టలతో కనిపించ నక్కర్లేదు. మా కొట్లోకి దయచేసి, మీకు నచ్చిన చీరలు కొని మీ ఒంటినిండా నిక్షేపంగా నిండుగా అలంకరించుకోండి."



'ఖైదీ' చిరంజీవి, మాధవి

# సినిమా

## శ్రీ శ్రీ చరమగీతం "నేటి భారతం" చిత్రంలో

"అర్ధరాత్రి స్వతంత్రం, అంధకారబంధితం
అంగాంగాల దోపిడీపైన కన్నతల్లి జీవితం
ఇదే నేటిభారతం భరతమాత జీవితం."

"నేటి భారతం" చిత్ర దర్శకుడు కృష్ణ గద్గదస్వరంతో ఇలా అన్నారు: "మా కోర్కెను కాదనలేక జూన్ 3న మంచం పైన కదలలేని స్థితిలో ఉండే శ్రీ శ్రీ గారు పై గీతాన్ని రాసిచ్చారు. అదే వారి ఆఖరి గీతం అవుతుందని ఎవరనుకున్నారు? జూన్ 15న మా చిత్రం షూటింగ్ ప్రారంభించాం. అదే రోజు సాయంత్రం ఆ మహాకవి అమరజీవి అయ్యారు. మా 'నేటి భారతం' చిత్రాన్ని ఆయనకే అంకితమిస్తున్నాం."

జూలై 15 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తయ్యే ఈ చిత్రంలో సుమన్—విజయశాంతి—శివకృష్ణ— వనితశ్రీ, కె. విజయ, రాజ్యలక్ష్మి, ఎస్. వరలక్ష్మి, నాగభూషణం, పి. ఎల్. నారాయణ, పి. జె. శర్మ, నర్రా, ఎం. పి. ప్రసాద్, చలపతిరావు నటిస్తున్నారు. మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు. పోకూరి వెంకటేశ్వరరావు నిర్మాత.

'ఆకలి నీకు జోహార్లు'లో నూతన్ ప్రసాద్, రాగిణి



## మల్లాది వారికి విస్మయం కలిగించిన విషయం

1954 లోనో '55 లోనో సరిగా గుర్తు రావడం లేదు. స్వర్గీయ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు పాండీ బజార్‌లో పేవ్‌మెంట్‌మీద పాత పుస్తకాలు కొంటూ నన్ను చూశారు "మన తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఒక పాటకు వంద రూపాయలు ఇచ్చేంత ఎత్తుకు ఎదిగిందయ్యా," అన్నారు ఆనందంతో. ఆరోజు ఉదయం ఏదో చిత్రంలో పాట రాసినందుకు ఆయనకు నిర్మాత వంద రూపాయలు ఇచ్చారట ఆదివరకు ఆయనకు ఒక పాటకంటూ అంత మొత్తం ఎవరూ ముట్టజెప్పలేదట. అసలు అంతకు ముందు మాటలు, పాటలు అన్నిటికీ కలిపి ఒక మొత్తంగా పారితోషికం ఇచ్చేవారు మొత్తంమీద కొంత కాలం పోయాక ఒక పాటకు వెయ్యి రూపాయల నుంచి రెండు వేల దాకా చెల్లించేంత ఎత్తుకు తెలుగు సినిమారంగం ఎదుగుతుందని అప్పట్లో శాస్త్రిగారు ఊహించి ఉండరేమో!

## ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో "ఖైదీ"

"తొలి షెడ్యూల్ జూన్ 16 నుంచి 25 వరకు జరిగింది. రెండో షెడ్యూల్ అరకులోయ ప్రాంతంలో జూలై 11 నుంచి 20 వరకు జరుగుతుంది. చివరి షెడ్యూల్ ఆగస్టు 11 నుంచి 25 వరకు ఇన్‌డోర్‌లో జరుగుతుంది," అన్నారు కె. ధనుంజయరెడ్డి. ఈయన నిర్మించే సంయుక్త మూవీస్ "ఖైదీ" చిత్రంలో చిరంజీవి, శరత్‌బాబు, రావుగోపాలరావు, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి, శివప్రసాద్, సుత్తి వేలు, మాధవి, సంగీత, నిర్మల, నవ నటి సంయుక్త వగైరా తారాగణం. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. బాలు కూర్పుతో డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి సమర్పించే ఈ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## "జడగంటలు"

"ఇంటింటి రామాయణం— చిత్రం తర్వాత మా నవతా ఆర్ట్స్‌కు పర్వతనేని సాంబశివరావు డైరెక్టు చేసే చిత్రం 'జడగంటలు'. జూలైలో పుహళేంది మ్యూజిక్‌తో పాటలు రికార్డు చేస్తాం ఆగస్టు 15 నుంచి పాపికొండలు, పోలవరం ప్రాంతాలలో గోదావరి తీరంలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ ఫినిష్ చేస్తాం," అన్నారు నిర్మాత కృష్ణంరాజు. గణేష్‌పాత్రో సంభాషణలకర్త. సురేష్, విజయశాంతి, రమ్యాప్రభ, అన్నపూర్ణ వగైరా నటవర్గం.

# మరాఠీ సూపర్‌స్టార్ దాదా కోండ్కే

"నేను నటుడ్నేకాక స్వయంగా దర్శక నిర్మాతను. ఎన్ని లక్షలు ఇస్తానని ఆశ చూపినా — ఇతరుల చిత్రాల్లో పని చేయవలసినంత కర్మ నాకేం పట్టింది ?" అనే దాదా కోండ్కేకు మహారాష్ట్ర చిత్ర పరిశ్రమలో అమితాబ్‌బచ్చన్‌కు ఉన్నంత పాపులారిటీ ఉంది. ఈయన కొత్త చిత్రాన్ని మొదలెట్టబోతున్నాడని తెలిస్తే చాలు—కొనుగోలుదార్లు వచ్చి ఈయన ఇంటిముందు క్యూలో నిలుచుంటారు.

ఈయన మరాటీ భాషలో "సోంగాడ్యా" నుంచి "ఆలి అంగావర్" వరకు ఎనిమిది చిత్రాలు తీశారు. ప్రతి చిత్రం రజతోత్సవం జరుపుకుంది. "నా విజయ పరంపరలకు కారణమొక్కటే. స్క్రిప్టుమీద తొమ్మిది పది మాసాలపాటు శ్రమిస్తాను. అసంపూర్ణమైన స్క్రిప్టు మూలంగా ముడి ఫిలిమ్ వగైరాలు వృథా అవడంవల్ల అనవసరంగా ఎంత వ్యయమవుతుందో—అంతకన్నా ఎక్కువగానే స్క్రిప్టు తయారవడానికి ఖర్చు పెడ్తాను," అంటారీయన. ఈయన చిత్రాల్లో ఎక్కువగా ఛలోక్తులు, సంఘంలో ఘరానాగా బతికే పయోముఖ విషకుంభాల మీద, రాజకీయనాయకులమీద విసుర్లు ఉంటాయి. అంచేత, ప్రతి చిత్రానికీ ఢిల్లీ వరకు వెళ్తేగాని, సర్టిఫికేట్ లభించేదికాదు. విసుగెత్తిపోయిన ఈయన ఒకసారి బొంబాయిలోని సెన్సార్ చీఫ్ అపర్ణామెహ్తాతో "నా కొత్త చిత్రం రెడీగా ఉంది. దీన్ని తనిఖీ కోసం మీకు పంపించాననుకోండి. ఎటూ మీరు దీన్ని కూడా ఢిల్లీకి రెఫర్ చేస్తారు. ఈ శ్రమంతా ఎందుకు ? ఈ కొత్త చిత్రాన్ని మీరు చూడకుండా సరాసరి ఢిల్లీకే పంపించేస్తేపోలా ?" అన్నాడట.

ఈయన మరో హిట్ చిత్రం "పాండు హవల్దార్"కు మహారాష్ట్ర ప్రభుత్వం బహుమతిని ప్రకటించింది. ఈయన వెంటనే ఉన్నతాధికారులకు ఫోన్‌చేసి, "హిట్ అయిన మరాటీ పిక్చర్‌కు అవార్డు రావడమా ? నమ్మలేకుండా ఉన్నాను. అవార్డు కమిటీ సభ్యులవల్ల ఏదైనా పొరబాటు జరిగిందేమో ఒకసారి కనుక్కుంటే మంచిదేమో !" అన్నాడట తమాషాగా.

ఈయన ఇటీవలే తొలిసారిగా హిందీలో "తేరే మేరే బీచ్‌మే" అనే చిత్రాన్ని ["ఏక్ దుజే కేలియే" చిత్రంలోని పాట] ప్రారంభించారు. ఇందులో ఈయనతోపాటు ఈయన శాశ్వత కథానాయిక ఉషాచావన్, అమ్జద్‌ఖాన్ నటిస్తున్నారు. దీనికి మాతృక ఈయన మరాటీ చిత్రం "రాం రాం గంగారాం".


అమ్జాద్‌ఖాన్‌తో దాదా కోండ్కే

"నా చిత్రాలమీద వినోదపు పన్ను మినహాయింపు తాలూకు మొత్తం 42 లక్షలు మహారాష్ట్ర ప్రభుత్వం నుంచి నాకు అందాలి. అది ఎప్పుడు అందుతుందో — ఏమో. అందినా, మహారాష్ట్ర ప్రభుత్వం నాకెప్పటికీ ఎంతైనా ఋణపడి ఉంటుంది" అంటాడు దాదా కోండ్కే. [జి.వి.జి.] *

## కార్టూన్ చిత్రాల 60వ వార్షికోత్సవం

ఇప్పుడు సోవియట్ యూనియన్ కార్టూన్ చిత్రాల 60వ వార్షికోత్సవం జరుపుకుంటోంది. సోవియట్ కార్టూన్ల పిత ఇవాన్ ఇవనోవ్ విన్. మొదట మాస్కో, ఆ తర్వాత కీవ్, ఒదెస్సా, బాకూ నగరాలలో కార్టూన్ చిత్రాల స్టూడియోలు ఆరంభించబడ్డాయి. ఈ కళకు దోహదం చేసిన మహానుభావులలో వ్లదిమీర్ దెగత్యరోవ్ చిరస్మరణీయుడు. రెండో ప్రపంచ యుద్ధ సమయం (1941)లో ఈయన కుడి చెయ్యి తెగిపోయింది. కాని, తన వృత్తిపట్ల, ముఖ్యంగా బిడ్డలపట్ల ఈయనకుగల అపారమైన ప్రేమ ఈయన్ని ఊరికే కూర్చోనివ్వలేదు. ఎడమ చేత్తోనే చిత్రాలు గీయడం సాధనచేసి, అద్భుత కళాఖండాలనదగ్గ చిత్రాలను రూపొందించాడు. "మ్యావ్ అన్నదెవరు ?" అనే ఈయన చిత్రం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. ★

ఊహాసుందరి' గీత, నరేష్


# ఫిలిం రెప్రజెంటేటివ్ నుంచి ఫిలిం ఛాంబర్ అధ్యక్షపదవికి ఎదిగిన

# శ్రీ ఎ.ఆర్.రాజు

"**1952** లో స్కూల్ ఫైనల్ పాసయ్యాక బెంగుళూరులోని అప్పటి విజయాటాకీ డిస్ట్రిబ్యూటర్స్ సంస్థలో రెప్రెజెంటేటివ్‌గా చేరాను థియేటర్లకు వచ్చే తరగతుల ప్రేక్షకుల అభిరుచులను తెలుసుకునే అవకాశం నాకలా లభించింది. ఆ సంస్థలో శ్రీ బి. ఎన్. గుప్త, శ్రీ బి. నాగిరెడ్డిగార్లు భాగస్వాములు. తర్వాత ఆ సంస్థ 'విజయా పిక్చర్స్ సర్క్యూట్' మారింది; వివిధ భాషా చిత్రాలను కర్ణాటక ప్రాంతంలో పంపిణీ చేయడంలో అగ్రస్థానం వహించింది" అన్నారు అల్లూరి రెడ్డప్ప రాజు. ఈయన స్వశక్తిమీద అంచెలంచెలుగా పురోగమించి, కర్ణాటక ప్రాంతంలోని చిత్ర పంపిణీదారులలో ప్రముఖులయ్యారు. అజంతా మూవీస్ అధినేత. గోకుల్ కంబైన్స్, గోకుల్ పిక్చర్స్‌లో భాగస్వాములు. చిత్ర నిర్మాత కూడ. లోగడ కర్ణాటక చలనచిత్ర వాణిజ్య మండలి అధ్యక్షుడుగా కన్నడ చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. ఇప్పుడు దక్షిణ భారత చలనచిత్ర వాణిజ్య మండలి అధ్యక్షుడుగా (1983–84) ఎన్నికయ్యారు.



శ్రీ ఎ. ఆర్. రాజుని అభినందిస్తున్న నిర్మాత శ్రీ డి రామానాయుడు

## ఈయన్ని సినిమా రంగం ఆకర్షించడానికి కారణం :

"చిన్నప్పట్నుంచి నాకు లలిత కళలన్నా సినిమాలన్నా ఆసక్తి ఎక్కువ. చదువుకునే రోజుల్లో నాటకాలలో పాల్గొనేవాడ్ని. నా జన్మస్థలం చిత్తూరు జిల్లాలోని పీలేరు. చదువుకున్నది కుప్పంలో. అక్కడికి దాదాపు ఇరవై మైళ్ళ దూరంలో ఉన్న కోలార్ గోల్డ్‌ఫీల్డ్స్‌లో ఏ కొత్త చిత్రం విడుదలైనా చాలు—ఎవరో ఒక మిత్రునితో సైకిల్‌లో డబుల్స్ వెళ్ళి, రెండు మూడు సినిమాలు చూసి, అర్ధరాత్రి దాటేక తిరిగొచ్చేవాళ్ళం ఆ ఆసక్తే నన్ను ఫిలిమ్ రిప్రజెంటేటివ్‌గా పని చేయనిచ్చింది 1956 నుంచి 1961 వరకు రోజుకు మూడు రూపాయల జీతంమీద పనిచేస్తూ, మా యజమాని అభిమానానికి పాత్రుడ్ని కాగలిగాను. 'గుండమ్మ కథ' చిత్రం తర్వాత కారణాంతరాల వల్ల ఆ సంస్థ మూతపడింది. అటుపైన సత్యనారాయణ అనే నా క్లాస్‌మేట్ సహకారంతో బాలాజీ పిక్చర్ అనే డిస్ట్రిబ్యూషన్ సంస్థను ప్రారంభించాము. తొలి చిత్రం వాసవీ వారి 'అనుబంధాలు.' దీన్ని విడుదల చేయడానికి ఈ చిత్రానికి డైరెక్టర్ అయిన 'భరణి' పి. ఎస్. రామకృష్ణారావుగారు ఎంతో ప్రోత్సాహమిచ్చారు ఆ తర్వాత తోడ్పాటు ఇచ్చినవారు పింజల సుబ్బారావుగారు ఈయన అప్పుడు ఎం. ఎస్. నాయక్‌గారి చిత్ర నిర్మాణ సంస్థలో ప్రొడక్షన్ మేనేజర్‌గా ఉండేవారు. అది వదలి, 'హంతకులొస్తున్నారు జాగ్రత్త' చిత్రాన్ని స్వయంగా నిర్మించడానికి పూనుకున్నారు. ఆ చిత్రం నుంచి పి. ఎస్. ఆర్. పిక్చర్స్, 'రాజనందిని' నుంచి ఎన్.వి.ఎస్. ఫిలిమ్స్ ఇంకా డి.వి.ఎస్., సురేష్, జగపతి, లక్ష్మీ ప్రొడక్షన్స్, విశ్వశాంతి, ఫణిమాధవి; ఎన్. ఏ. టి. లాంటి సుప్రసిద్ధ సంస్థల ఎన్నో హిట్ చిత్రాలను కర్ణాటక ప్రాంతంలో పంపిణీ చేసే ఘనత మాకు లభించింది. ఆ సంస్థల అధినేతలందరికీ ఎంతైనా కృతజ్ఞుడ్ని" అన్నారు రాజు.



'స్వరాజ్యం'లో మాదాల రంగారావు, శ్యామలగౌరి

## కర్ణాటక ప్రాంతంలో ఎలాంటి తెలుగు చిత్రాలకు చక్కని ఆదరణ లభిస్తుంది ?

"ఇదివరకైతే, తెలుగులో విడుదలైన ఏ చిత్రానికైనా మంచి ఆదరణ లభించేది. ఆనాటి చిత్రాలు కూడా చక్కని స్టాండర్డ్స్‌లో ఉండి — అందర్నీ ఆకర్షించగల్గడమే అందుకు కారణమనుకోండి. పైగా, కర్ణాటకలో ప్రేక్షకులు క్లాస్ చిత్రాలను కూడా బాగా ఆదరిస్తారు. చక్రవర్తి చిత్రవారి 'సుడిగుండాలు' మంచి బిజినెస్ చేసిందిక్కడ. ఆంధ్ర రాష్ట్రంలో బాగా ఆడని 'పిల్లా — పిడుగా, నిజం నిరూపిస్తా' లాంటి ఆక్షన్ చిత్రాలు కూడా ఇక్కడ బాగా డబ్బు చేసుకున్నాయి. ఒకప్పుడు పౌరాణిక చిత్రాలకు, విఠలాచార్య మార్కు జానపద చిత్రాలకు మంచి గిరాకీ ఉండేది. 'లవకుశ' రికార్డ్ కలెక్షన్స్ అనుకోండి. 'అప్పర్ కర్ణాటక' అనబడే హుబ్లీ, గదగ్, ధార్వార్, బిజాపూర్ జిల్లాలలో తెలుగు తెలిసినవారు తక్కువగా ఉన్నా — 'సంతానం' చిత్రం వంద రోజులకు పైగా ఆడింది.

క్రమక్రమంగా కన్నడ చిత్ర నిర్మాణంలో, వ్యాపారంలో విపరీతమైన మార్పులు వచ్చాయి. పుట్టణ్ణలాంటి దిగ్దర్శకులు అత్యుత్తమ శ్రేణికి చెందిన కన్నడ చిత్రాలను అందిస్తూ, ప్రేక్షకుల అభిరుచిని ఉన్నతమైన స్థాయికి తీసుకెళ్లారు. దాంతో బెంగళూరులాంటి నగరాలలో ఒకప్పుడు విరివిగా తెలుగు చిత్రాలను చూసే ప్రేక్షకులు కూడా కన్నడ చిత్రాలచే ఆకర్షింపబడ్డారు. 'దేవర గుడి, కాడు' లాంటి కన్నడ క్లాస్ చిత్రాలు కూడా కర్ణాటకలో అన్ని చోట్లా ప్రేక్షకులను విపరీతంగా ఆకర్షించాయి. గిరీష్ కర్నాడ్ వంటివారు సహజ వాతావరణంలో రూపొందించిన క్లాస్ చిత్రాలు ఆర్థికంగానూ ఎంతో విజయాన్ని సాధించాయి. ఇక, సూపర్ స్టార్ డాక్టర్ రాజ్‌కుమార్ చిత్రాల గురించి చెప్పక్కర్లేదనుకోండి. కొత్త వారితో తీసిన 'భూతయ్యన మగ అయ్యు, నాగరహావు' చిత్రాలు జూబిలీలు చేసుకున్నాయి. నాటి ఆధారంగా తెలుగులో అగ్రశ్రేణి తారలతో తీసిన 'అందరూ మంచివారే, కోడెనాగు' చిత్రాలు ఆంధ్రలో అంత బాగా పోలేదు. ఈ మధ్య ఇక్కడ రికార్డ్ కలెక్షన్స్‌తో ప్రదర్శింపబడిన తెలుగు చిత్రాలు 'శివరంజని, శంకరాభరణం'. నిజం చెప్పాలంటే చక్కని కథే ఇక్కడ హీరో. బెంగళూరు కాస్మాపాలిటన్ సిటీ. 'చట్టకారి' లాంటి మలయాళ చిత్రాలు సైతం మంచి టాక్‌వల్ల 25 వారాలకు పైగా నడవడమూ కద్దు. కన్నడం, హిందీ తర్వాతే తెలుగు ఇక్కడ మూడవ భాష. ఆ తర్వాతే తమిళం, మళయాళం..."



రంజని, మురళీమోహన్ 'కళారంజని'లో

## కర్ణాటక ప్రాంతంలో తెలుగు చిత్రాల భవిష్యత్తు ....?

"1960 వరకు తెలుగు చిత్రాలకు థియేటర్స్ సులభంగా దొరికేవి. ఆ తర్వాత కన్నడ చిత్రాల నిర్మాణం బాగా పెరిగింది. బి అండ్ సి క్లాస్ సెంటర్లలోకూడా కన్నడ చిత్రాలకు మార్కెట్ పెరిగింది. 1967 నుంచి తెలుగు చిత్రాలకు థియేటర్లు దొరకడం మరీ కష్టమైపోయింది. థియేటర్ల అద్దెలూ పెరిగాయి. ఆంధ్రలో ప్రదర్శింపబడ్డాకే సాధారణంగా సెకండ్ రన్‌కు ఇక్కడికి తెలుగు చిత్రాలు వస్తూంటాయి. అగ్రశ్రేణి తారాగణం గల చిత్రాలకు ఓపెనింగ్స్ మాత్రం బాగానే ఉంటాయనుకోండి. ఆ తర్వాత దాని వసూళ్ళు పబ్లిక్ టాక్ మీద ఆధారపడి ఉంటాయి. థియేటర్లు దొరక్క ఒక్కోసారి కొన్ని చిత్రాలను కన్సెషన్ రేట్లకు మార్నింగ్ షోలుగానూ వేసుకోవలసి వస్తుంది. ఎక్కువగా తెలుగు మాట్లాడే వారుండే కోలార్, చిత్రదుర్గ, బళ్ళారి జిల్లా ప్రాంతాలమీదే మేము ఆధారపడవలసి ఉంటుంది. మేము చిత్రాలను 'ఔట్ రైట్' — అంటే, ఐదు సంవత్సరాల కాలపరిమితికి కొంటూంటాం. పబ్లిసిటీ అంతాకూడా మేమే భరించవలసి ఉంటుంది. ఎన్నో భాషల చిత్రాలు ఆడుతూన్నప్పుడు పబ్లిసిటీ అంత పెద్ద ఎత్తున చేయకపోతే, ఏ హాలులో తెలుగు చిత్రం ఆడుతూందో తెలియదుకదా? అందునా థియేటర్లు అధిక సంఖ్యలో ఉన్న బెంగళూరు మహానగరంలో పబ్లిసిటీకోసం ఎంతో వ్యయం చేయాలి. తదితర భాషా చిత్రాల పోటీకి తట్టుకోగలిగినప్పుడే ఏ తెలుగు చిత్రానికైనా మా పెట్టుబడి తిరిగొచ్చేది. వ్యాపారమన్న తర్వాత లాభనష్టాలు తప్పవుకదా?" అని వివరించారు రాజా.



'ముక్కుపుడక'లో సుహాసిని

ఈయన నిగర్వి. నిరాడంబర జీవి నిండు కుండ, మితభాషి, హితభాషి. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ, ఆంగ్ల భాషల్లో అనర్గళంగా ఉపన్యసించగలరు.

చలనచిత్ర పరిశ్రమలో 'ఏ' నుంచి 'జడ్' వరకు పూర్తిగా ఆకళింపు చేసుకుని, అతి క్లిష్టమైన సమస్యలకు సైతం వెనువెంటనే పరిష్కారమార్గం చూపగల సామర్థ్యం, నేర్పు, చొరవ, ఆత్మ విశ్వాసంగల ప్రతిభాశాలి ఎ. ఆర్. రాజా. ఈయన ఆధ్వర్యంలో దక్షిణభారత చలనచిత్ర పరిశ్రమ మరింత ముందంజ వేయ గలదనడంలో అత్యుక్తి ఏమీ లేదు.

[జి. ఎ. జి.]




వంటపని ముగించి, స్నానంచేసిన సీత ముందు వరండాలోకి వచ్చేసరికి చీకటి పడింది. వరండాలో లైటువేసి పడక కుర్చీలో కూర్చుని రామాయణం చేతబట్టుకుంది. ఉత్తర రామాయణంలో — రాముడు లోకులమాటలని నమ్మి సీతను వదిలేసిన ఘట్టంలోని నాలుగు పద్యాలు చదివి – అక్కడ్నే ఆగిపోయింది.

ధర్మబద్ధుడయిన రాముడి కర్తవ్యతా కర్కశత్వం. అగ్రజాజ్ఞా పాలనా నియతుడయిన లక్ష్మణస్వామి నిర్వేదం. సీతా సాధ్వి విషాద యోగం. కరుణరస ప్లావితమయిన ఘట్టం.

సీత కనులు చమర్చాయి. మరుక్షణం అవి కన్నీటి చలమలే అయ్యాయి. చంపలమీద కన్నీరు చారికలు కట్టింది. మనసు తుఫానుకి అల్లకల్లోలమయిన సముద్రమే అయ్యింది. గుండెలలో అగ్నిపర్వతాలు బద్దలయి పొగలు సెగలు కక్కినట్లయింది. బాధతో ఉంగలు చుట్టుకుని మెలికలు తిరిగిన ఆలోచనలు గతంలోకి పరుగెత్తేయ్.

సుమారు ముప్ఫయి సంవత్సరాల క్రితం కొత్త కోడలుగా అత్తవారింట అడుగు పెట్టిన సీత, భవిష్యత్తుని గురించి ఎన్నో బంగారు కలలు కన్నది. భర్త రామారావు మంచివాడే! భార్యమీద అపారమయిన ప్రేమాభిమానాలు నిలుపుకున్నవాడే! కొత్త కాపురం ముచ్చటగా ఒక సంవత్సరం పొగేసరికి ఆ జీవన వీణాగానంలో అపశ్రుతులు తొంగిచూసాయి. రామారావుకి తల్లి మాట వేదవాక్కు. ఆ తల్లిది తన బిడ్డలకేగాని మరెవరికీ తల్లిని కాదనుకునే తత్త్వం. ఆ కారణంగా సీతకి ఎన్నో సమస్యలు ఎదురయ్యాయి. ఓర్పుతో సహించింది. నేర్పుతో ఆ సమస్యలను పరిష్కరించుకొనాలన్న ప్రయత్నాలు చేసింది, సీత.

ఒక మనిషి వేరొక సాటి మనిషిమీద, మంచిదో లేక చెడ్డదో అయిన అభిప్రాయం, ఏర్పడటానికి కారణాలు వుండవచ్చును ఏ కారణాలూ లేకనూ పోవచ్చును. అకారణంగానే అత్తగారు తనమీద కత్తికట్టి సాధించాలని చూస్తున్నదన్న అభిప్రాయం సీతకి కలిగింది. రానురాను ఆ సాధింపులు పరిమితులుదాటి అసహ్యమయిన విధంగా కసిగా తయారవటంతో— ఎదురుతిరిగింది సీత.

అహం ఆవేశాన్ని తెచ్చిపెట్టుంది. ఆవేశం ఆలోచనని పక్కకి నెట్టజూస్తుంది. స్పర్థ క్షణక్షణానికీ పెరిగి, పెనుమంటలాగా అవటానికి అవకాశం వుంది. అత్తాకోడళ్ళ వైరం ఈదేశం యొక్క కొన్ని తరాల చరిత్రకు ప్రధానంగా రూపు దిద్దింది.

బిడ్డ కడుపున పడ్డాడు. ముసలావిడది చాదస్తం. ఏదో వాగితే వాగిందిలే, సర్దుకుపోదామన్న తత్వం సీతకి లేదు. ఏదో చిన్నపిల్ల. తెలిసీ

తెలియనితనం, ఆ పిల్లని కన్న కూతురులాగా చూసుకుని కడుపులో దాచుకుందామన్న పద్ధతి ముసలావిడకి లేదు. ఇద్దరి మధ్యా మేధకుడయిన రామారావు నలిగాడు. రానురాను అత్తా కోడళ్ళు ఇద్దరూ ఆగర్భ శ్రతువుల్లాగా కాట్లాడుకోవటం ప్రారంభించారు. ఇంటి పరువు బజారుపాలయింది. ఏ రోజూ ఏ క్షణమూ ఇంట్లో శాంతి లేకుండా పోయింది.

ఆ పరిస్థితుల్లో ఒకనాడు ముసలావిడ, శాసించింది.

'అది ఈ ఇంట్లోవుంటే నేను ఒక్కక్షణం ఇక్కడ వుండను. నా దార్ని నేను పోతాను.' అని ఖండితంగా చెప్పింది.

'ఎక్కడికి వెడతావమ్మా ?'

'ఏట్లోకి, ఏట్లోదూకి ఛస్తాను.'అని బిగ్గరగా రోదించింది ముసలావిడ.

రామారావు కన్నీరుపెట్టాడు అసహాయంగా గిలగిలలాడాడు. ఎన్నో విధాల ఆమెకి నచ్చ చెప్ప బోయి విఫలమయాడు.

'ఆవిడ ఈ ఇంట్లోవుంటే నేను ఈకాపురం చెయ్యలేను.' అంది ఆవేశంగా సీత.

'ఏం చేయమంటావు ?'

'ఆవిడ్ని పంపించెయ్యండి'

'ఎక్కడికి పంపించమంటావు ? ఆవిడకి నేను తప్ప ఎవరున్నారు ?'

'అదంతా నాకు తెలియదు.'

'అలా అంటే ఎలా ? కాస్త ఆలోచించు.'

'నాకు తెలియదు.'

'నోరు ముయ్యి. అలా మూర్ఖంగా మాట్లాడకు.'

'మీరే మూర్ఖంగా మాట్లాడుతున్నారు.' సీత చెంప పేలింది.

'నీ సామాను సర్దుకో. నిన్ను మీ పుట్టింట్లో దిగబెట్టి వస్తాను' అన్నాడు రామారావు. క్షణాలలో తన సామాన్లు సర్దుకుంది సీత. ఆమెను పుట్టింట్లో దిగబెట్టి వెళ్ళిన రామారావు మళ్ళీ ఆమెతో ఏ రకమయిన సంబంధమూ పెట్టుకోలేదు. ఆ తర్వాత ఇద్దరూ విడాకులు పుచ్చుకున్నారు.

ఆ తర్వాత రెండేళ్ళకే కొడుక్కి రెండో పెళ్ళిచేసి ముసలావిడ చచ్చిపోయిందని వాళ్ళద్వారా వీళ్ళద్వారా తెలిసింది.

బాబు పుట్టాడు.

వాడికి మేనమామ అండగా నిలిచాడు.

కొడుకుని చూసుకుని దుఃఖాన్ని దిగమింగుకుంది, సీత. కొడుకు కోసమే బతికింది.

బాబు పెద్దచదువులు చదివాడు. వ్యాపారం పెట్టి లక్షలు ఆర్జించాడు. మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకుని సంసారి అయ్యాడు. అన్యోన్యమయిన అనురాగం నిండిన దాంపత్యం. కొడుక్కీ, కోడలికీ సీత అంటే అపారమయిన గౌరవం. ప్రేమ.

జీవితం అనే పుస్తకానికి భర్త ముందరి అట్ట అయితే భార్య వెనుక అట్ట. అట్టలు గట్టిగా లేకపోతే పుస్తకం గాలికే చిరిగిపోయి అస్తిత్వం కోలుపోతుంది. ఆ విషయం గ్రహింపుకి వచ్చేసరికి, సీత జీవిత పుస్తకంలో చాలా కాగితాలు విడిపోయేయి.

మనస్సు వెర్రి పిచ్చిది. ఆలోచనల పాతరను త్రవ్వటం మానదు. మానలేదు. బాధా తప్తమయిన అనుభూతులూ, అనుభవాలే ఎదురయినా కూడా ఆ త్రవ్వకపు పని ఆగదు. ఆ విషాదం తప్పదు. కన్నీరు వరదలా కారితేనే బరువయిన గుండెకి ఇంత ఓదార్పు.

కొడుకు పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసయినప్పుడూ, కొడుకు వ్యాపారాలు చేపట్టి లక్షలు సంపాదించి దక్షత చూపినప్పుడూ, కొడుకు పెళ్ళిచేసుకుని నవ వధువుతో తలంబ్రాలు పోసుకున్నప్పుడూ —

సీతకి ఆ బాధల గాధల పాతరను త్రవ్వటం తప్పలేదు.

ఒంటరిగా మూలగదిలో చేరి కరువుదీరా విలపించక తప్పలేదు.

ఏమి శాపం ఇది ?!

గయ్యాళి అయిన ఆ రెండవ భార్య, గంపెడు పిల్లల్ని కని, కొండంత బరువుని అతని భుజాలమీదపెట్టి, అతన్ని మానసికంగా, ఆర్థికంగా, దైహికంగా నానా చిత్రహింసలకూ గురిచేసిందనీ—ఎద్దుల్లాగా పెరిగిన అప్రయోజకులయిన కొడుకులు ఒకసారి రామారావును స్తంభానికి కట్టేసి కుమలబొడవగా భయకంపితుడయిన రామారావు సంసారాన్ని వదిలేసి దేశాలుపట్టి పోయాడన్న సమాచారం అందిన తరువాత — అతన్ని గురించిన ఏ విషయమూ మరల తెలియలేదు.

ఇంత జరిగినా —

ఏ రోజూ, ఏ క్షణమూ సీత గుండెల్లో గూడు కట్టుకుని, సలుపు పెట్టటం మానలేదు, రామారావు.

'అమ్మా ! సీతమ్మ తల్లీ ! ఆకలికి సచ్చిపోతన్నాను. ఇంత అన్నంముద్ద పెట్టు తల్లీ.'

ఉలిక్కిపడి ఆలోచనల నుంచి బయట పడింది, సీత.

'అమ్మా... !'

ఆ గొంతు ఎక్కడో విన్నట్లనిపించింది.

అంతే.

చటుక్కున కుర్చీలోంచి లేచింది, సీత.

'అమ్మా... !'

ఆ పిలుపు గుండెల్లో గాలం గుచ్చి లాగగా తడబడే అడుగులతో గబగబా వీధిగుమ్మంలోకి వచ్చింది.

గేటు దగ్గర చింకిపాతలతో — అస్థిపంజరంలా వున్న ఆ ముష్టివాడి చంపలు బాగా లోతుకి పోయేయి. కాళ్లు చేతులు పుల్లల్లాగా అయ్యేయి. నడుం వంగి వుంది.

వీధి స్తంభాలలో బిగించి వున్న దీపకాంతులలో మిలమిలా మెరుస్తూన్న అతని కళ్ళు, ఆ చూపులు, అవే... !

ఆ కళ్ళలోకే కొన్ని నిముషాలు పాటు చూస్తూ నిలబడిపోయిన సీత — ఆనందాన్ని, ఆవేశాన్ని, ఉద్వేగాన్ని, విషాదాన్ని — గుండెల్లోనే అణచిపెట్టటానికి ప్రయత్నిస్తూ

'ఏమండీ ! మీరా ?' అని కాతర స్వరంతో పలకరించింది.

అతను శిలలాగా నిలబడిపోయేడు.

'ఏమండీ ! నేనండీ. మీ సీతని. నన్ను గుర్తుపట్టలేదా ?' అంటూ అతన్ని ప్రశ్నల్లో ముంచివేస్తూ — చేతులు పట్టుకుని లోనికి తీసుకువెళ్ళింది. మంత్రముగ్ధుడిలాగా అనుసరించి వచ్చిన అతనికి —

స్నానం చేయించి —

వార్డ్ రోబ్‌లో వున్న కొడుకు పంచా, లాల్చీ ధరింపజేసి —

హాల్లో ఫాను వేసి —

అతన్ని సోఫాలో కూర్చోపెట్టి —

'రెండ్నిముషాలు కూర్చోండి. సినిమాకి వెళ్ళిన అబ్బాయీ, కోడలూ వచ్చే వేళయింది. అందరం కలిసే భోంచేద్దాం. ఈలోగా మీ కిష్టమయిన 'పాయసం' తయారుచేసి, ఒక నిముషంలో వచ్చేస్తాను.' అని చెప్పి, వంటగదిలోకి వెళ్ళి, రెట్టింపు బలంతో పనిలో పడింది, సీత.

టక్ టక్ బూట్లు చప్పుడయింది.

ఆ వెనుకే గాజుల గలగలా, చీర గరగరా విన్పడింది.

మల్లెపూల పరిమళం గాలిలో తేలివచ్చే లోగానే, 'అమ్మా' అన్న పిలుపూ వినవచ్చింది.

గబగబా, హాలులోకి వచ్చింది, సీత.

'బాబూ !'

'ఏమిటమ్మా ! వంట రడీయేనా ? భోంచేద్దామా ?'

'బాబూ !'

'ఏమిటమ్మా ? ఏమిటి వెతుకుతున్నావ్ ?'

'ఆయనేరి నాయనా ?'

'ఆయనా ? ఎవరమ్మా, ఆయనా ?'

ఖాళీ సోఫాల్లో వెతుకుతూవున్న, గాజు కళ్ళు నిస్తేజంగా నిస్పత్తువగా అయిపోగా శిలలాగా నిలబడిపోయింది, సీత. తూలి కూలిపోవటానికి సిద్ధంగా వున్న సీతని, కొడుకు బలమయిన చేతుల్లో నిలిపాడు. 




## పురోహితుడులేని పెళ్లి!

కాన్పూరులో సుమన్ రాజ్ అనే వో సుగుణవంతుడు అదే వూరుకు చెందిన నీలమ్ చతుర్వేది అనే సుగుణను వివాహ బంధం తతంగం లేకుండానే తన భార్యగా స్వీకరించాడట. దీనికి వీరిరువురి తలిదండ్రులూ వొప్పుకున్నారుట. వో పెద్ద ఫంక్షనులో వీరు జీవిత భాగస్వాములుగా ఒకరి చేయి వొకరు స్వీకరించుకున్నారుట — ఏదైనా వొహాటే కదా! కాదా?

## ఐదు పెద్ద సంస్థలలో ఒకటి!

మన దేశపు తమిళనాడూ కొయంబత్తూరు నగరానికి 33 కిలో మీటర్ల దూరంలో వున్న లక్ష్మి మెషిన్ టూల్స్ అనే సంస్థ ప్రపంచంలోని పెద్ద అయిదు మెషిన్ టూల్స్ సంస్థలలో ఒకటి అట. ఈ సంస్థ బట్టల మిషనుల విడి భాగాలూ వగైరా తయారు చేస్తుందట.

## అడయూరు నదిలో వృద్ధురాలి ఆత్మ హత్య!

మద్రాసు రాయపేటకు చెందిన వో వృద్ధ స్త్రీ వో సైకిలు రిక్షాలో అడయూరు వెళ్ళి, అక్కడ తిరువింక బ్రిడ్జి రోడ్డుమీద రిక్షా ఆపి దిగి, ఆతనికి డబ్బిచ్చి ఆనక్కొంత దూరం ఆ బ్రిడ్జిమీద నడిచి (జూన్ పది సాయంత్రం) ఆనక గప్పున ఎగిరి, అడయారు నదిలోకి దూకి ఆత్మహత్య చేసుకుందట.

## బ్రిటన్‌లో ఉత్తరాయణం!

బ్రిటనులో కార్బెట్‌ల్షిట్టన్ అనే వో షాపు సొంతదారుడు తనకు అందిన వో వుత్తరాన్ని చూసి, మూర్ఛపడిపోయాడట. అది పదేళ్ళ క్రితం తనకు చేరాల్సిన వుత్తరమట. ఆ వుత్తరంతోపాటు ఆ దేశపు పోస్టలు శాఖవారు పంపిన వో చీటీలో మీ వుత్తరం ఆ వూరి పోస్టుబాక్సుకు లోపల యిన్నాళ్లూ అతుక్కునుండిపోయింది. మేందాన్ని యీనాడు కనుగొని, పీకి మీ కందజేశాం. అదే యీ ఆలస్యానికి కారణం అనుందట.

## ఏ 'గంగ' అయితేనేం....!?

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్టీఆర్ తమిళులకు కృష్ణా జలాలను "తెలుగు గంగ" అనే పేరుతో తరలించడానికి ఒప్పుకోడాన్ని గురించి ఒహనాటి నటి, యీనాటి • అన్నా డి. యం. కె. పార్టీ ప్రచారకురాలు జయలలిత, ఈ కాలువకు 'ద్రావిడగంగ' అని పేరు పెట్టాల్సిందే అన్నారట—'గంగ' అనే పేరొప్పుకున్నందుకు సంతసింతుమా!

## మాడ్రన్ బ్రెడ్డులో ఇనప రింగు!

నా మోడరన్ బ్రెడ్డును తిన కుతూహలంతో విప్పదీస్తే అందులో వో యినప రింగు వంటెదోటె దోబూచులాడుతూ కన్పించిందిట. దీనిని బి. జె. పి. కి చెందిన సత్యనారాయణ్ లనే ఆయన ఏప్రియల్ 18 న పార్లమెంటుకు సమర్పించారట.

## మున్సిపల్ అధికారులకి బుద్ధి చెప్పిన మహిళలు!

భటిండా అనే పట్టణంలోని మునిసిపల్ ఆఫీసులో వో మీటింగు జరుగుతూండగా వో వొందమంది యీస్త్రీరాణులు హాహాకారాలు చేస్తూ ప్రవేశించి వారి మీటింగు పేపర్లను చింపి పోగులుపెట్టి వూరిలా తగలడుతూంటే మీ మీటింగు లెందుకని, వారినందర్నీ వూళ్ళోని అన్ని రోడ్లకూ లాక్కువచ్చి, మురికినీరు డ్రయినేజి తన్ని బయటకు వచ్చి, ప్రవాహంలా యిళ్ళల్లోకి జొరపడడాన్ని చూపించారట. ఈ అధికారులను కొందరు కోపిష్టులు వారిమీద చెత్త విసిరి అవమానించారటకూడాను గత ఆరు నెలలుగా బాబూ యీ రోడ్లు చూడండి, అయ్యా యీ స్థితిగతుల్ని గమనించండంటే చెవికెక్కలేదా అని గద్దించారట. దాంతో మున్సిపలు అధికారులు రోడ్లు గస్తీ తిరుగుతూ చకచకలాడుతూ అంతా పూర్తిచేయించారట.

## ఆస్తికోసం 105 పెళ్ళిళ్లు చేసుకున్న అమెరికన్!

50 ఏళ్ళ గియోవన్ని విగ్లియెటో అనే వో అమెరికన్ నూటయిదు పెళ్ళిళ్ళు చేసుకుని, తన నూటయిదు భార్యల ఆస్తిపాస్తులనూ సంగ్రహించి, హరివి బికారిణులను చేశాడట. ఈ నేరానికి ఆరిజోనా ఫోనిక్స్ న్యాయస్థానం ఆ మహనీయునికి 34 ఏళ్ళు జైలు శిక్ష, బోలెడు ధనం అపరాధం విధించిందట!

## శ్రీలంకలో భాగంకోసం....!

లంకలోవున్న తమిళులను ఆ ప్రభుత్వం సరిగా చూడటంలేదన్న ఆవేశంతో మధురకు చెందిన 22 ఏళ్ళ షజహాన్ మద్రాసులోని సింహళ రాయబారి కార్యాలయం ముందు నిల్చొని "మా సోదరులను బాధలు పెట్టకండి. అక్కడున్న మా తమిళులకు న్యాయం చేకూర్చి, తమిళులకు విడిగా వో భాగం యివ్వండి" అనీ అరుస్తూ మీద కిరసనాయిలు పోసుకుని, నిప్పంటించేసుకున్నాడట. ★






సీరియల్

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



**( వాన్ హెల్సింగ్ రాసివుంచిన వివరాలు — మిగతా భాగం )**

నేను మేడమ్ మినా వంక చూసాను. ఆమె బెదరకుండా కూర్చునివుంది. చిరునవ్వు ఆమె పెదాలమీద కనపడింది. పొగ లేకుండా మంటను ఎక్కువ చేద్దామని వలయాకారంలోంచి బయటకు వెళ్లబోతోంటే మేడమ్ మినా నన్ను పట్టుకుని ఆపేసింది. ఎంతో మగతలోవున్నట్టు చాలా నెమ్మదిగా అంది.

"వద్దు, వద్దు! మీరు వెళ్ళొద్దు. మీకు ఇక్కడే రక్షణగా వుంటుంది" నేను ఆమెవంక తిరిగి చూసాను.

"ఏంలేదు, మీకోసమే నా భయం. వాటిని వెళ్లగొడదామని..." అన్నాను. అందుకు ఆమె నవ్వింది. చాలా తక్కువ శబ్దంతో నవ్వినా కృతకంగా వుంది.

"భయమా? నాకోసమా? నాకోసం ఎందుకు భయపడాలి. నేను వున్నంత సురక్షితంగా ప్రపంచంలో ఎవరూ వుండరు." అంది.

ఆమె మాటలకు నాకు ఆశ్చర్యమేసింది. అదే సమయంలో గాలివీచి కొంత మంట లేచింది. ఆ వెలుగులో నుదుటమీది పూర్వపు గాయాన్ని చూసాను. అది అప్పుడు డ్రాకులావల్ల కలిగిన గాయం. నాకు పరిస్థితి అర్ధమయింది. పొగ మంచు దట్టంగా అలుముకోవటం, అందులోంచి

**(గత సంచిక తరువాయి)**

స్త్రీ ఆకారాలు రావటం, ఇదంతా ఈమెకోసం. ఈమెకూడా కొంతవరకు డ్రాకులా మనిషే. నా ఎదురుగా స్పష్టంగా ముగ్గురు స్త్రీలను చూడగలిగాను. జోనాధన్ అప్పుడు తన గదిలో చూసిన పిశాచాలు అవే అయివుండాలి. వాళ్ళ కళ్ళు బాగా మెరుస్తున్నాయి. పళ్ళు తెల్లగా వున్నాయి. పెదాలు మోహావేశాన్ని సూచిస్తున్నాయి. వాళ్ళు మేడమ్ మినా వంక చూసి నవ్వారు. అంత నిశ్శబ్దంలో వాళ్ల నవ్వు భయంకరంగా వుంది. వాళ్ళు తమ చేతుల్ని ముందుకు చాచి అన్నారు:

"రావే రా! నువు మా చెల్లెలివి. రారా!" వాళ్ల స్వరం నీళ్లతో నిండిన గాజు గ్లాసులు కొట్టుకున్న చప్పుడులా వున్నాయి. నేను భయంతో మేడమ్ మినా వంక చూసాను. ఆమె ముఖ కవళికలు చూసాక సంతోషమేసింది. ఆమె కళ్లల్లో ఎంతో భయం గోచరించింది. ఆమె వణుకుతోంది. ఆమె పరిస్థితి నాలో ఆశను చిగురింపజేసింది. దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆమె వాళ్లతో కలసిపోయే దౌర్భాగ్యపు స్థితిలోలేదు. నేను వెంటనే దైవ సంబంధమైన పొడిని అందుకుని వాళ్లమీదకు వెళ్లాను. మంట దగ్గరగా వెళ్లి మంటను ఎగదోసాను వాళ్ళు వెనక్కితగ్గి నవ్వారు. నేను సురక్షితంగానే వుంటానని నాకు తెలుసు. ఆ వలయాకారపు గీత మధ్యలోవున్న మేడమ్ మినాకూడా ఎంతో సురక్షితంగా వుంటుందని తెలుసు. ఆ స్త్రీ పిశాచాలు మమ్మల్ని ఏమీ చేయలేవు. గుర్రాలు మూల్గడం మానేశాయి. చలనం లేకుండా నేలమీద పడి వున్నాయి. మంచు మెల్లగా వాటిమీద కురవసాగింది. ఆ గుర్రాలు క్రమంగా తెల్లబడసాగాయి ఆ మూడు పిశాచాలు తప్ప, అక్కడ భయపడటానికి ఇంకేమీలేదని తెలుసు.

మేం ఇద్దరం అట్లాగే వుండిపోయాం, తెల్లవారే వరకు. నేను పూర్తిగా భయంతోనూ, దిగులుతోనూ వుండిపోయాను, మళ్ళీ సూర్యుని వెలుగు చూసేవరకు. తెల్లవారబోతుండగా, ఆ మూడు పిశాచాలు మళ్ళీ పొగలామారి సుడిగాలిగా తిరుగుతూ కోటవైపు వెళ్ళాయి.

అలవాటు ప్రకారం నేను మేడమ్ మినా వంక తిరిగి, ఆమెను హిప్నటైజ్ చేయబోయాను. కానీ ఆమె అప్పటికే గాఢనిద్రలో మునిగిపోయింది. ఆమె అట్లా వుండగానే హిప్నటైజ్ చెయ్యాలనుకున్నాను. కానీ ఆమె దగ్గర్నించి సూచనలు లేవు. అప్పటికి బాగా తెల్లవారిపోయింది. కాలాతీతమయింది. ఇక లాభంలేదనుకుని, మళ్ళీ చిన్న మంటవేసాను. ఆ మంట వెలుతురులో గుర్రాలను చూసాను. అవి చచ్చిపడివున్నాయి. ఇక్కడ ఇవాళ నేను చెయ్యవలసిన పనులు చాలావున్నాయి. బాగా పొద్దుఎక్కేవరకు వుండి అక్కడ్నించి ఎటు వెళ్ళాలో చూడాలి. ఈ పొగమంచులో, సూర్యుని వెలుతురులో వెళ్లటమే మంచిది. ప్రమాదం వుండదు.

కాస్త తిండి కడుపులో వేసుకోవాలి. అప్పుడే శక్తి వస్తుంది. అక్కడ్నించి నా భయంకరమైన పని ప్రారంభిస్తాను. మేడమ్ మినా ఇంకా అట్లాగే నిద్రపోతోంది. పోన్లే, దేవుడి దయవల్ల, ఆమె హాయిగా నిద్రపోగల్గుతోంది.

**జోనాధన్ డైరీ :**

నవంబర్, 4 (సాయంత్రం): మా లాంచికి బ్రహ్మాండమైన ప్రమాదం సంభవిం

---

**జరిగిన కథ — 37 :** డ్రాకులా ఊళ్ళోంచి పారిపోయాడని తెలిసి ఎంతో ఊరట చెందుతుంది మినా. డ్రాకులా 'వర్నా' చేరేదానికి ముందే జోనాధన్, మినాతోసహా అందరు 'వర్నా'కు ప్రయాణమయిపోవడానికి నిశ్చయించుకుంటారు. జరీనా కెధరిన్ ఓడ సముద్రంలో ప్రయాణం చేస్తున్నట్లు మినాను హిప్నటైజ్ చేసి తెలుసుకుంటారు. ఓడ తీరం చేరగానే అందరు దానిలో ప్రవేశించి చెక్కపెట్టెలోని డ్రాకులాకు మెలకువ వచ్చేలోగా అతన్ని హతమార్చాలని నిశ్చయించుకుంటారు. జరీనా కేథరిన్ ఓడ 'గలాట్జ్' తీరం చేరుకున్నట్లు తెలుసుకొని అందరు నిశ్చేష్టులయ్యారు చెక్కపెట్టెను 'ఇమాన్యుయల్ షిల్డిషిమ్' అనే అతను వచ్చి తీసుకెళ్ళినట్లు కెప్టెన్ డోనెల్సన్ చెపుతాడు. షిల్డిషిమ్ ఆ పెట్టెను 'స్కిన్‌స్కి'కి అప్పగించాడు. సెంట్ పీటర్ చర్చ్ ఆవరణలో 'స్కిన్‌స్కి' మృతదేహం కనపడుతుంది. అతను డ్రాకులాచే చంపబడి ఉంటాడని మినా తన డైరీలో వ్రాసికొనింది. అందరూ కలిసి డ్రాకులా జాడ తెలుసుకోడానికై ప్రయాణమవుతారు.

---



చింది. లేకపోయినట్టయితే, డ్రాకులా బోటును ఎప్పుడో కనుక్కొని వుండేవాళ్లం. ఈపాటికి మేడమ్ మినాను బంధవిముక్తురాల్ని గావించే వాళ్లం. ఆమెను డ్రాకులా కోట ప్రాంతంలో వున్నట్టు తలుచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తోంది. మా దగ్గర గుర్రాలున్నాయి. ఒడ్డు వెంబడే మా ప్రయాణం సాగించవచ్చు. ఆర్థర్ మళ్ళీ ప్రయాణానికి సిద్ధపడుతుండగా, ఇది రాస్తున్నాను. డ్రాకులా మనుషులతో వీలయితే, మా భుజబలంతో ఎదిరిస్తాం. అది కూడా, మోరిస్, సెవార్డులు మాకు తోడుగా వుంటేనే. వాళ్ళు కలిస్తే బాగుండును త్వరగా. తర్వాత నేను ఈ డైరీని రాయలేకపోయినట్టయితే, మినా! ఇదే నా వీడ్కోలు. దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు.

## డాక్టర్ సెవార్డు డైరీ:

నవంబర్, 5 : పొద్దుటే జిప్సీ తెగ మనిషులను చూసాం. వాళ్ళు ఏదో ఒక సామాను బండిలో వేసుకుని మమ్మల్ని దూసుకుంటూ వెళ్లారు. బండిచుట్టూ వాళ్ల మనుషులు కమ్ముకుని వెంట వెళ్లారు. మంచు మెల్లగా కురుస్తోంది. గాలి కొత్తగా, ఆహ్లాదకరంగా వుంది. దూరాన తోడేళ్ల అరుపులు వినిపిస్తున్నాయి. మంచువల్ల అవి కొండలు దిగి కిందికి వచ్చివుంటాయి. అలాగయితే, వాటితో మాకు ప్రమాదమే. గుర్రాలు సిద్ధంగా వున్నాయి. త్వరగా మేం బయలుదేరుతాం. ఎవరికో ఒకరికి చావు తప్పదేమో. ఆ చావు ఎవరికో, ఎక్కడో, ఏవిటో, ఎప్పుడో, ఎట్లాగో... ఆ దేవుడికే తెలియాలి.

## డాక్టర్ వాన్ హెల్సింగ్ రాసివుంచిన వివరాలు :

నవంబర్, 5 (సాయంత్రం) : భయం తగ్గి మళ్ళీ మామూలు మనిషిని అయ్యాను. దేవుడి దయవల్ల, దారుణమైన ప్రమాదంనుంచి తప్పించుకోగల్గాను. వలయాకారపు గీతలోపల మేడమ్ మినా నిద్రపోతుండగా నేను డ్రాకులా కోటవైపు దారితీసాను. నా దగ్గర పెద్ద సుత్తి వుంది. అది వెంట తీసుకెళుతున్నాను. కోట తలుపులు తెరిచేవున్నా, నేను సుత్తితో తుప్పు పట్టిన బందులను విరక్కొట్టాను. నేను లోపలికి వెళ్లింతర్వాత అది మళ్ళీ మూసుకుంటే, నేను బయటపడటం కష్టం. ఇక్కడ జోనాథన్

# జీవన్ మృతులు

చేదు అనుభవం నాకు గుర్తువుంది. అతను డైరీలో రాసినవి మననం చేసుకుంటూ, పాత చర్చివేపు దారితీసాను. నేను చెయ్యవలసిన కార్యక్రమం అక్కడే వుందిమరి. అక్కడ గాలి తక్కువగా ఉక్కగా వుంది. ఏదో గంధకం వాసనవల్ల తల దిమ్మెక్కి నేను సరిగా నడవలేక పోయాను. నా చెవుల్లో తోడేళ్ల అరుపులు పడ్డాయి. ఆ సమయంలో నాకు మేడమ్ మినా గుర్తుకు వచ్చింది. ఆమె స్థితి గురించి భయమేసింది. ముందుకు వెళ్లాలా, వెనక్కి వెళ్లాలా అన్న సంధిగ్ధంలో పడ్డాను.

ఆమెను నావెంట ఇక్కడకు తీసుకురాలేను. అక్కడే వలయాకారపు గీతలోపల ఆమె సురక్షితంగా వుండగలదు. తోడేలు కాదు మరేది వచ్చినా ఆమెకు ప్రమాదం లేదు. అందువల్ల నేను ఇక్కడే వుండి పని పూర్తిచేయదల్చుకున్నాను. చావో బ్రతుకో, చెయ్యాల్సిందే.

కనీసం మూడు సమాధులు అక్కడ వుండి వుండాలనిపించింది. అందుకని వాటికోసం తెగ వెతికాను. చివరకు ఒకటి కనపడింది అందులో ఒక పిశాచి నిద్రలో వుంది. బాగా అందంగా బలిసి వుంది. అట్లా ఒక్క ఆడమనిషి నిద్రలో వున్నప్పుడు చూస్తే ఎట్లా చంపబుద్ధివేస్తుంది? ఆలస్యం చేస్తే ఆ పని చెయ్యబుద్ధికాదు. చెయ్యకపోతే, అమ్మాయిల అందానికి లోబడి పోతాడు. వాళ్ల మాయలో చిక్కుకుంటాడు. సూర్యోదయం వరకు అట్లా వివశుడై వుండి పోతాడు. ఈలోపు ఆడ పిశాచాలు తమ ప్రేమను చూపిస్తాయి. ముద్దులు కురిపిస్తాయి. ఇక మగాడు వాళ్ల బందీ అవుతాడు. ఆ జీవన్ మృతుల గుంపులో కలిసిపోతాడు.

సమాధి ఎంతో దుమ్ము కొట్టుకుపోయినా, ఎంతో భరించరాని కంపు కొడుతున్నా, ఆ జీవన్ మృతురాల్ని చూస్తుంటే, ఏదో మోహంలో పడిపోతున్నాననిపించింది. నేను చెయ్యదల్చుకున్న పనిని చెయ్యగలనా అన్న సందేహంలో పడ్డాను. ఆలస్యం చేస్తున్నాను. ఆలస్యమయితే నాకు జరిగే కీడు నాకు తెలుసు. లోపల గాలి లేదు. వూపిరి ఆడటంలేదు. నాలో ఏదో మగత ప్రవేశించ సాగింది. ఆ సమయంలో దూరంగా, సన్నగా, దీనంగా మూలుగు వినవచ్చింది. అది నన్ను మగతలోంచి మేల్కొలిపింది. ఆ దీనస్వరం మరెవరిదో కాదు—మేడమ్ మినాది.

అయినా తట్టుకుని నా కార్యక్రమంలో మునిగిపోయాను. నల్లగా వుండే పిశాచి శవపేటిక మూత తీశాను. ఆమెను చూసే ధైర్యం చెయ్యలేదు. తర్వాత మరో పెద్ద శవపేటిక దగ్గరి కెళ్లాను. అందులో మరో పిశాచి వుంది. ఎంత అందంగా వుంది! మోహం కలిగించే విధంగా పడుకునివుంది. అట్లాంటి స్థితిలో



## నేస్తం ...

నేస్తం —
నేను నీతో గడిపిన జ్ఞాపకాల
పుటలను తిరగవేస్తూ
మన స్నేహమాధుర్యాన్ని తలపోస్తూ
నీచుట్టూ ఆలోచనల మాలికలు అల్లుతూ
మధురభావనకు లోనవుతుంటే
ఉన్మాదినని గేలిచేసి
రాయి విసిరిన —
పలు గాకులకేం తెలుసు
తెంచగలిగింది నా ఆలోచనల
మాలలనేగాని
సౌరభాలు వెదజల్లే మన
స్నేహబంధాన్ని కాదని

**— రాణీమాలిని**

ఆమెను చూడగానే నాలోని మగతనం మేల్కొంది. కాముకమైన కోరికతో నా తల తిరిగిపోయింది. మేడమ్ మినా దీనస్వరం దూరాన్నించి వినపడింది మళ్లా. ఆ స్వరం నన్ను మోహావస్థలోంచి మేల్కొలిపింది. నా భయంకరమైన పని ముగించటానికి వెనుకాడాను. తర్వాత అక్కడి ప్రదేశమంతా గాలించాన్ను, అలాంటి జీవనమృతులు కనపడితే తలలు వేరు చేయటానికి, గుండెను చీల్చటానికి. ఆ మూడు పిశాచాలు తప్ప మరి కనపడలేదు. వేరే జీవన్ మృతులు అక్కడ లేవని నిర్ధారణ కొచ్చాను. ఇకపోతే అక్కడ ఒక్క సమాధి కనపడింది. అది అన్నిటికిన్నా చాలా పెద్దదిగా, ఆడంబరంగా వుంది. దానిమీద ఒక్కటంటే ఒక్కటే మాట వుంది :

## డ్రాకులా

అయితే ఇది ఆ జీవన్మృతుడు డ్రాకులా సమాధి అన్నమాట. ఈ జీవన్మృతులకు అతను నాయకుడు. ఆ సమాధి ఖాళీగా వుంది. దాని అర్థం నాకు తెలుసు. ముందు ఆ సమాధి లోపల దైవ సంబంధమైన పొడిని బాగా చల్లాను. ఇక డ్రాకులా అక్కడికి రాడు.

తర్వాత నా భయంకరమైన పని మొదలెట్టాను, అదే, పిశాచాల తలలు వేరు చేయటం, గుండెలు చీల్చటం. ఒక్క పిశాచి నయితే నా పని సులభంగా వుండేది. కానీ ముగ్గురు! ఈ ముగ్గురు లూసీలా కొత్తవాళ్ళుకారు. శతాబ్దాల తరబడి పిశాచాలుగా వుండి బాగా బలం సంపాదించుకున్న వాళ్ళు. వీళ్ళకు నిజమైన చావు నివ్వటానికి ఎంత కష్టపడాలి...ఇదిదారుణమైన చర్య...

ఓ జాన్ ! ఇది కసాయివాడి పని. ఈ జీవన్మృతుల బారిన పడ్డవాళ్ళు గుర్తుకొచ్చి, వీళ్లవల్ల ఎంత అపకారం జరుగుతుందోనన్న భయంకొద్దీ ఈ కసాయిపని చెయ్యగలిగానేగానీ, మామూలుగా చెయ్యటం ఎంత కష్టం. పని పూర్తిచేశాక కూడా నాలో వణుకు తగ్గలేదు. దేవుడి కృతజ్ఞతలు చెప్పుకోవాలి, ఈ పనికి తట్టుకోగల శక్తి నిచ్చినందుకు. సూదిగా ఉన్న క్రరను గుండెల్లో బలంగా కొట్టి దించుతుంటే, చూడలేక ఎక్కడివక్కడ వదిలేసి భయంతో పారిపోదామనుకున్నాను. అయినా అంతా చేయ గలిగాను ! వాళ్లను చూస్తే జాలి వేసింది. దుఃఖం వచ్చింది. వాళ్ల ఆత్మలను రక్షించ గలిగాను, అదే సంతోషం. వాళ్ల తలలను బ్రద్దలుకొట్టే కొట్టకమునుపే, వాళ్ల శరీరాలు మట్టి అయిపోయాయి. ఎప్పుడో శతాబ్దాల క్రితం మట్టి కావలసిన దేహాలు ఇప్పుడు మట్టి అయ్యాయి.

కోట వదిలి వచ్చేముందు, డ్రాకులా అందులోకి చొరపడ్డానికి వీల్లేకుండా ఏర్పాట్లు చేసాను.

నేను మేడమ్ మినా దగ్గరకు వెళ్లాను. వలయాకారపు గీత మధ్యలో నిద్రపోయి లేచి కూర్చుంది. నన్ను చూడగానే ఎంతో సంతోషంతో అరిచింది :

"రండి ! తొందరగా రండి. తొందరగా ఇక్కడ్నుంచి వెడదాం. నా భర్త ఇటువేపు వస్తున్నాడు. అతన్ని కలుసుకోవాలి."

ఆమె బాగా చిక్కిపోయినట్టు, పాలిపోయి నట్టు, బలహీనంగా కనపడింది. కానీ ఆమె కళ్ళల్లో మాత్రం కాంతి వుంది. రోషం వుంది. ఆమె అట్లా కనిపించటం నాకు సంతోషంగా వుంది. ఆమె డ్రాకులా ఆధీనంలో వున్నట్టుగా మగతలో లేనందుకు నిజంగా సంతోషమేసింది.

ఇద్దరం అక్కణ్ణించి తూర్పు దిక్కుగా బయలుదేరాం, వాళ్లను కలవటానికి.

## మినా డైరీ :

నవంబర్, 6: జోనాథన్ వస్తున్నాడని నాకు తెలుసు. వాన్ హెల్సింగ్ నేనూ తూర్పు దిక్కుగా బయలుదేరాం. అప్పటికి సాయంత్రం కావొచ్చింది. మేం వేగంగా వెళ్లలేదు దారి బాగా పల్లంగా వుంది. చలిగాలి వస్తోంది. మంచు పడుతోంది. వెచ్చగా వుండేందుకు రగ్గులు వెంట వున్నాయి. మా వెంట తినుబండారాలుకూడా తీసుకెళ్లాం. ఎక్కడ చూసినా మంచుతప్ప, తినదగ్గ వస్తువేది కనపడలేదు. ఒక మైలుదూరం పోయాక, ఇక నడవలేక కూలబడ్డాను. డ్రాకులా కోట ఎంతో ఎత్తులో వుంది. మేం అక్కడికెళ్లాలి. నిట్ట నిలువుదారిన ప్రయాణం చెయ్యాలి. దూరంగా తోడేళ్ళ అరుపులు వినబడుతున్నాయి. ఎంత చిన్నగా వినబడుతున్నా భయాన్ని కలిగిస్తున్నాయి. నేనూ వాన్‌హెల్సింగ్ బయటకు కనబడకుండా, ముందుకు వెళుతున్నాం. దారి బాగాలేదు. ఎగుడు దిగుడుగా వుంది.

కొంతసేపటికి ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ నాకు సైగ చేసారు. నేను తొందరగా ఆయన దగ్గరకెళ్లాను. అక్కడొక చిన్న గుహలాంటిది కనపడింది. చెయ్యిపుచ్చుకుని లోపలికి తీసు కెళుతూ "చూడండి, ఇక్కడ మీరు వుండొచ్చు. ఇక్కడికి తోడేళ్ళువస్తే, ఒక్కొక్కదాని సంగతి నేను చూస్తాను" అన్నారు. వెంటతెచ్చిన ఉన్ని కోటుతో నన్ను కప్పి కూర్చోబెట్టారు. తిను బండారాలు నాకిచ్చారు. నేను తినలేకపోయాను. ఏమీ తినాలనిపించలేదు. ఆయన్ని సంతోషపెట్ట టానికైనా తినలేకపోయాను. నన్ను జాలిగా చూసారు. కానీ తినమని బలవంతపెట్టలేదు. బైనాక్యులర్స్‌తో చూస్తూ ఎత్తయిన రాయి మీద నిలబడ్డారు వాన్‌హెల్సింగ్. చుట్టూ పరికించి చూసారు. హఠాత్తుగా అరిచారు :

"చూడండి. మేడమ్ మినా, చూడండి, చూడండి!" వెంటనే నేను లేచి ఆయన ప్రక్కన నిలబడ్డాను. బైనాక్యులర్స్ నాకిచ్చి, వేలితో చూపించారు. మంచు విపరీతంగా కురుస్తోంది. సుడిగాలిలా తిరుగుతోంది. గుయ్‌మని శబ్దం వినవస్తోంది. అప్పుడప్పుడూ గాలి ఆగి పోతోంది. కాస్త మంచు కురవటం తగ్గిన సమయంలో క్రిందికి చూసాం. కొంతమంది గుంపుగా కొండ ఎక్కుతూ వస్తున్నారు. ఆ గుంపు మధ్యలో ఒక బండి వుంది పొడుగ్గా ఆ జనాన్నిచూస్తే పల్లెటూరివాళ్లలాగ, లేక జిప్సీల్లాగ కనిపించారు.

ఆ బండిమీద చతురస్రాకారపు పెట్టె వుంది. అది చూడగానే నా గుండె ఆగినట్ట యింది. సాయంత్రం ముగిసి చీకటి పడ బోతోంది. సూర్యాస్తమయ సమయం ఆసన్న మయింది. ఆ పెట్టెలోవున్న వస్తువు బంధ విముక్తురాలయి బయటకొస్తుంది! నేను నేను భయంగా ప్రొఫెసర్‌కంక చూసాను. ఆయన పక్కన లేరు. నాకు దిగువలో నిలబడివున్నారు మేం ఇద్దరం నిలబడ్డచోట చుట్టూ గుండ్రంగా గీసారు, రాత్రి మేము వున్నట్టుగా. గీత గీయటం ముగించి నా పక్కగావచ్చి నిలబడ్డారు.

"ఈ పరిధిలోపల వుంటే అతనివల్ల మీకు ఆపద రాదు" అన్నారు. నా చేతుల్లోంచి బైనాక్యులర్స్ తీసుకుని చూసారు. "చూడండి! వాళ్ళు తొందరగా వచ్చేస్తున్నారు. గుర్రాలను బాగా అదలిస్తున్నారు" అని ఒక్క క్షణం ఆగారు.

"సూర్యాస్తమయం అవుతోందని తొందర పడుతున్నారు. మనకి ఆలస్యం అవుతుందేమో. దేవుడేం చేస్తాడో మరి" అన్నారు మళ్ళీ. అట్లా చూస్తూ మళ్ళీ అరిచారు :

"చూడండి! చూడండి, చూడండి! ఇద్దరు గుర్రాలమీద వస్తున్నారు దక్షిణం వైపు నుండి. వాళ్ళు తప్పకుండా క్విన్సీ, జాన్‌లు అయి వుంటారు. ఈ బైనాక్యులర్స్ తీసుకుని చూడండి. తొందరగా చూడండి. మంచు బాగా కురుస్తుంటే కనపడదు మళ్ళీ." నేను బైనాక్యులర్స్ తీసుకుని చూసాను. ఆ ఇద్దరూ తప్పకుండా డాక్టర్ సెవార్డు, మిస్టర్ మోరిస్‌లు అయి వుండాలి. జోనాథన్ మాత్రం లేడు. జోనాథన్ కూడా ఎక్కువ దూరంలో లేడనిపిం చింది. అదే ఆశతో ఉత్తర దిశగా చూసాను మరో ఇద్దరు గుర్రాలమీద వస్తూ కనిపించారు. అతివేగంగా వస్తున్నారు. వాళ్లిద్దరో ఒకరు జోనాథన్ అని నాకు బాగా తెలుసు. రెండో






మనిషి ఆర్డర్ అయివుండాలి. వాళ్ళుకూడా బండిని వెంబడిస్తూ వస్తున్నట్టున్నారు. వీళ్ల సంగతి చెప్పగానే, ప్రొఫెసర్ చిన్నపిల్లాడిలా సంతోషంగా గెంతులేసారు. తన దగ్గరున్న రైఫిల్‌ను ఉపయోగించటానికి వీలుగా దగ్గరుంచుకున్నారు. నేనుకూడా నా దగ్గరున్న రివాల్వరును చేతితో పట్టుకున్నాను. మేం మాట్లాడుతూవుండగా, తోడేళ్ళ అరుపులు బాగా దగ్గరగా వినపడసాగాయి. వున్నట్టుండి మంచు పెద్ద పెద్ద పెళ్ళలుగా మా ముందుపడి, ఎదుట ఏమీ కనపడకుండా చేసాయి మాకు చాలా ఆశ్చర్యమేసింది. తర్వాత ఆ మంచుగడ్డలు జారి దొర్లిపోయాయి క్రిందికి దిగువగా అక్కడక్కడా రెండుగానూ మూడుగానూ, పెద్ద గుంపులు గానూ తోడేళ్ళు కనపడ్డాయి

క్షణమొక యుగంగా గడవసాగింది. మళ్ళీ మంచు పెద్ద పెద్ద పెళ్ళలుగా మా ముందు పడ్డాయి అడుగు ముందు దూరంలో వున్న వస్తువుకూడా కనపడ్డంలేదు మా గడియారాలు చూసుకున్నాం దాదాపు గంటకు పైగా అక్కడ నిలబడివున్నాం. మంచుగాలి బాగా వీస్తోంది, గుయ్‌మంటూ. మా ముందర మంచు ముద్దలు దొర్లిపోయాయి పల్లపు ప్రాంతానికి క్రింది జనం, అందరూ మాకు దగ్గరగా రాసాగారు. ఇప్పుడు ఎవరు ఎవరో స్పష్టంగా తెలుస్తున్నారు ఎవరివెంట ఎవరు పడుతున్నారోకూడా తెలుస్తోంది సూర్యుడు దిగిపోతుంటే, గుర్రపు బండి వేగం పెరగసాగింది

వాళ్లు దగ్గరగా, మరింత దగ్గరగా వచ్చేస్తున్నారు నేనూ, ప్రొఫెసర్ ఇద్దరం ఒక పెద్దరాయి చాటున నక్కి కూర్చున్నాం మా దగ్గర ఆయుధాలు సిద్ధంగా వున్నాయి ప్రొఫెసర్‌ని గమనిస్తుంటే, ఆ గుంపును దాటి వెళ్లనివ్వకుండా జేసేటట్టు వున్నారు. ఒకరి గురించి ఒకరికి తెలియకుండా అందరూ వున్నారు.

ఒక్కసారిగా రెండు గొంతులు గట్టిగా అరిచాయి "ఆగండి!" అంటూ అందులో ఒక గొంతు జోనాథన్‌ది. రెండోగొంతు మిస్టర్ మోరిస్‌ది. జిప్సీలకు వీళ్ల భాష అర్థమయి వుండదు, కానీ వాళ్ల ఆజ్ఞ గుర్తించి వుంటారు. అనుకోకుండా వాళ్లు ఆగిపోయారు. ఒకవైపు నుంచి ఆర్థర్, జోనాథన్‌లు, మరోవైపు నుంచి డాక్టర్ సెవార్డు, మిస్టర్ మోరిస్‌లు, ఒక్కసారిగా దూసుకు వచ్చారు జిప్సీల నాయకుడు వీళ్లను తీక్షణంగా చూస్తూ వాళ్ల భాషలో ఆగకుండా పదమని వాళ్ల వాళ్లకు చెప్పాడు. ఆ జిప్సీలు గుర్రాలను కొరడాలతో కొట్టి అదిలించారు. అవి ఒక్కసారిగా ముందుకు పరుగెత్తాయి. ఇంతలో మనవాళ్లు నలుగురూ రైఫిల్స్

బయటకు తీసి గురిపెట్టారు వెంటనే జిప్సీలు ఆగిపోయారు. అదే సమయంలో, డాక్టర్ వాన్‌హెల్సింగ్, నేనూ, గుట్టచాటు నుండి బయటకు వచ్చి, మా దగ్గరున్న తుపాకీలను గురిపెట్టాం. మేంఅంతా చుట్టుముట్టేసరికి, గుర్రాలకు పగ్గాలు వెయ్యక తప్పలేదు. జిప్సీ నాయకుడు వాళ్లకేదో చెప్పాడు. వెంటనే జిప్సీలు తమ దగ్గరున్న ఆయుధాలను బయటకు తీసారు. కత్తులూ, పిస్టళ్లు వున్నాయి వాళ్లదగ్గర. యుద్ధానికి తయారుగా కనిపించారు.

జిప్సీ నాయకుడు ఒక్కవుదుటున గుర్రాన్ని అదిలించాడు సూర్యునివేపు చూపిస్తూ ఏదో అన్నాడు, అది నాకు అర్థం కాలేదు. మా వాళ్లు నలుగురూ గుర్రాలను బండి వైపు దూకించారు. జోనాధన్ని అటువంటి పరిస్థితిలో చూస్తే మామూలుగానయితే ఎంతో భయపడేదాన్ని కానీ ఇప్పుడంతా యుద్ధరంగపు ఉత్సాహంగా వుంది నేను కూడా ఏదో వీరోచిత కార్యం చెయ్యాలన్న వుబలాటం ఎక్కువయింది జిప్సీ నాయకుడు తన మనుషులకు ఏవో సూచనలిచ్చాడు వాళ్లు వెంటనే బండిచుట్టూ కాపలా వేసారు వీళ్లను అందుకోటానికి నలుగురూ ప్రయత్నిస్తున్నారు.

బండికి ఒకవైపు వున్న జిప్సీల గుంపు మధ్యలోకి జోనాధన్ చొచ్చుకువచ్చారు రెండో వైపు క్విన్సీమోరిస్ వచ్చాడు అలాగే. ఇద్దరూ బండిని అందుకోవాలని ప్రయత్నం. సూర్యాస్తమయంలోపు తమ పని ముగించాలని వాళ్ల తాపత్రయం వాళ్ల ప్రయత్నాన్ని ఆపటం జిప్సీలవల్లగానీ, వాళ్ల ఆయధాల వల్లగానీ, భయకంరమైన తోడేళ్ళ అరుపుల వల్లగానీ కావటంలేదు. జోనాధన్ బండివేపు ఆత్రంగా రావటం చూసేసరికి బండి దగ్గర వున్న జప్సీలకు కంగారు పుట్టింది. వాళ్ళు ఆ కంగారులో జోనాధన్‌కి దారి ఇచ్చేసారు అంతే, జోనాధన్ ఒక్క గెంతులో బండిమీదకు దూకేడు. ఎంతో ఆశ్చర్యమైన సంఘటన ఏవిటంటే, బండిలోవున్న చెక్కపెట్టెను అమాంతం పైకెత్తి బండిచక్రానికి తగిలేట్టుగా నేలమీదకు విసిరాడు. ఈలోగా, మిస్టర్ క్విన్సీ మోరిస్ జోనాధన్‌కు అండగా వచ్చాడు ఇదంతా నేను వూపిరి బిగబట్టి చూస్తున్నాను. అతను జప్సీల గుంపును దూసుకుంటూ వెళ్లగా, వాళ్ళ కత్తులు ధగధగమెరిసాయి. ఆ కత్తులు అతన్ని గాయపరిచాయి అతను తన దగ్గరున్న పెద్ద కత్తితో వాళ్ల దెబ్బలకు కాచుకున్నాడు. అతను అసలు దెబ్బలు తగలకుండా సురక్షితంగా వున్నాడనుకున్నాను కానీ అతను జోనాధన్ పక్కకు వచ్చి నిలబడ్డాడు అతని కుడిభుజం గాయమైంది ఎడంచేత్తో ఆ గాయాన్ని గట్టిగా నొక్కిపట్టాడు అతని చేతివేళ్ల మధ్యగా రక్తం కారసాగింది దెబ్బ తగిలినంత మాత్రాన అతను బెదిరిపోలేదు జోనాధన్ మాదిరిగానే వాళ్లతో ధైర్యంగా తలపడ్డాడు ఏమైనా ఫర్వాలేదు అన్న ఉత్సాహం వాళ్లిద్దరిలో కనిపించింది. ఒక పక్క జప్సీలతో పోరాడుతూనే మరో పక్క చెక్కపెట్టె పైమూతకు బిగించిన మేకులను తీయసాగారు. ఇద్దరి ప్రయత్నం ఫలించింది. పైమూత వూడి వచ్చింది. దాన్ని విసిరి దూరంగా పారేసారు.

ఈలోగా ఆర్ధర్, డాక్టర్ సెవార్డు తమ తుపాకులతో జిప్సీలను చుట్టుముట్టారు. వారు ఏమీ చేయలేక పోరాటం ఆపేసారు. దాదాపు సూర్యాస్తమయం కావస్తోంది సూర్యుడు కొండల దిగువలోకి వెళుతున్నాడు. కొద్దికొద్దిగా చీకటి అలుముకోసాగింది మూతలేని చెక్కపెట్టెలో డ్రాకులా పడుకునివున్నాడు పెట్టె బంతిలా ఎగరటం వల్ల డ్రాకులా శరీరానికి బాగానే దెబ్బలు తగిలాయి. అతని శరీరం బాగా తెల్లగా పాలిపోయివుంది. కళ్ళు మాత్రం ఎర్రగా, తీక్షణంగా, క్రూరంగా, కసిగా చూస్తున్నాయి.

డ్రాకులా కళ్ళు గమనించాను అని అస్తమిస్తున్న సూర్యుడ్ని చూసి ఉత్సాహాన్ని పుంజుకుంటున్నాయి.

కానీ ఆ సమయంలో జోనాధన్ తన పెద్ద కత్తితో డ్రాకులామీదకు దూకాడు. నేను కెవ్వున కేకవేసాను, ఆ కత్తి డ్రాకులా గొంతులో బలంగా దిగబడుతుంటే మిస్టర్ మోరిస్ కత్తి కూడా ఆగకుండా డ్రాకులా ఎదలో దిగబడింది.

అంతా అద్భుతంగా జరిగిపోయింది మేం మా కళ్లతోనే చూస్తూ వుండగానే, డ్రాకులా దేహం కుంచించుపోయి మట్టిలో కలిసిపోయింది. చివరకు అక్కడ ఏమీ కనిపించలేదు

అందరి మనసుల్లో ఎంతో ప్రశాంతి.

ఇక డ్రాకులా కోట మాత్రం ఎర్రటి ఆకాశం వెలుగులో ఒంటరిగా మిలిగిపోయింది,

మేం డ్రాకులా కోసమే వచ్చామనీ, అతను కాస్త మట్టిలో కలిసిపోవటం చూసి, జిప్సీలు మాటలేకుండా వెనక్కి తిరిగి వెళ్లిపోయారు బండి దగ్గరకు వచ్చిన తోడేళ్ళు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాయి మిస్టర్ మోరిస్ గాయంతో నేలమీద కూలబడ్డాడు. అతని వేళ్ల మధ్యనుండి రక్తం ఇంకా స్రవిస్తూనే వుంది నేను వెంటనే అతని దగ్గరికి పరుగెత్తాను. డాక్టర్లు ఇద్దరూ కూడా అతని దగ్గిరికి పరుగెత్తుకొచ్చారు జోనాధన్ మోరిస్ వెనక కూర్చుని, అతని తలను తన భుజంపై వుంచుకున్నాడు అతను గాఢంగా నిట్టూర్చి నా చేతిని అందుకున్నాడు నా మొహంలో వచ్చిన మార్పును గమనించి అన్నాడు

"మీకు నేను కొంత సేవ చేయగలిగినందుకు నాకెంతో సంతోషంగా వుంది" వెంటనే అరిచాడు "అదిగో, అదిగో, స్త్రీ నుదుట అయిన గాయం మాయమయింది ఇక చాలు నేను చనిపోయినా ఫర్వాలేదు నా కోరిక నెరవేరింది"

సూర్యుడు పూర్తిగా కొండల్లోకి దిగిపోయాడు. ఆ ఎర్రటి కిరణాలు నా మొహం మీద పడ్డాయి అందరూ మోకాళ్లమీదకూర్చుని దేవుడ్ని ప్రార్థించారు. మరణిస్తున్న మిస్టర్ మోరిస్ చివరి మాటలు ఇవి

దేవుడి దయవల్ల మన ప్రయత్నం వ్యర్థం కాలేదు చూడండి. ఈ మంచుకన్నా మచ్చ వుంటుందేమోగానీ, ఈమె నుదుట మచ్చలేదు ఈమె బంధ విముక్తురాలయింది.

మేమంతా ఎంతో దిగులుతో చూస్తూ వుండగా, అతను చిరునవ్వుతో చనిపోయాడు అతను గొప్ప వీరుడు !









### పి. ఎస్. డి. – కోవూరు

నా వయస్సు 26 సం॥లు. నేను 16వ ఏట నుండి కళ్ళజోడు వాడుతున్నాను. ప్రస్తుతం ఇరువైపులా– 4 5 ఉంది. క్రమేణా పెరుగుతూ వచ్చింది దీన్ని ఇక పెరగకుండా ఆపటం సాధ్యమా నేను దేన్నయినా చూసేటప్పుడు సన్నని తీగలు అక్కడక్కడా ముడులుపడి ఉండి నేను ఎటుచూస్తే అటు వస్తూ ఉంటాయి.

★ చాలా త్వరగా పవర్ పెరుగుతూ వస్తే నేత్ర వైద్యులదగ్గర వెంటనే పరీక్షింప చేసుకోవలసి ఉంటుంది. పవర్ పెరగకుండా చేయటం అనేది మూల కారణం మీద ఆధారపడి ఉంటుంది కెరటో కోనస్ అనే కార్నియా రోగం ఉన్నప్పుడు ఆపరేషన్ ద్వారా సరిచేయవచ్చును. కళ్ళలోన లెన్స్‌ల ప్రాబల్యం వల్ల పవర్ వస్తే కళ్ళజోడు వాడటమో, కాన్‌టాక్ట్ లెన్స్ వాడటమో అవసరం. మయోపియా (మైనస్ పవర్) ఉన్నవారికి కళ్ళముందు తీగలు కనబడటం సహజం వీటిని మస్కే వాలిటాంటెస్ అని అంటారు. ఇవి దృష్టి మళ్ళించినప్పుడు కదులుతూ ఉంటాయి.

### ఎం. ఎస్. – నెల్లూరు

నా వయస్సు 16 సం॥లు. మెన్సస్ అయిన రోజులు మినహా మిగతా రోజులలో తెల్ల మైల వస్తుంది. ఇందువల్ల భయంగా ఉంది ఇది వివాహానికి ఆటంకం కలుగజేస్తుందా ?

★ ఋతుక్రమం మొదలయిన కొన్ని సంవత్సరాల వరకు కొందరికి ఇలా రావటం సహజం. అయినా, మీరు లేడీ డాక్టరుకి చూపించండి. తెల్ల మైల అవటం వైవాహిక జీవితానికి ఆటంకం కాదు.

### ఎం. ఎం. ఆర్. – విజయవాడ

నా వయస్సు సుమారు 30 సం లు. 3 నెలల క్రితం నుంచి గడ్డముపై మాత్రం అక్కడక్కడా మచ్చలు ఏర్పడి వెంట్రుకలు రావటంలేదు.

★ ఈ మచ్చలను చర్మ వైద్యులు ప్రత్యక్షంగా పరీక్షించి రోగ నిర్ధారణ చేయవలసి ఉంటుంది రోగ నిర్ధారణను బట్టే చికిత్స చేయించుకోవలసి ఉంటుంది.

### టి. ఎస్. ఎస్. – నాగ్‌పూర్

మా పాపకి 5 సం॥లు ఎడమవైపు బుగ్గ మీద తెల్లమచ్చ వచ్చింది ఫోటోలో కూడా అలాగే పడింది ఏం చేయాలి ?

★ మామూలుగా ఈ మచ్చలు ఆహారంలో ఇనుపధాతువు, విటమిన్ల లోపాలువల్ల వస్తూ ఉంటాయి కాబట్టి వీటిని న్యూట్రిషనల్ పాచెస్ లని అంటారు కొందరికి అతిగా ముద్దు పెట్టటంవల్ల ఆ భాగంలో ఫంగస్ పెరిగి తెల్లని మచ్చ ఏర్పడ వచ్చును.

కొందరికి సోభి మచ్చలు పుట్టుకతోనే ఏర్పడే అవకాశం ఉంటుంది (దీనిని విటిలైగో అంటారు )

అరుదుగా ఈ మచ్చలు లెప్రొసీవల్ల ఏర్పడే అవకాశం ఉంటుంది ముఖ భాగంలోని మచ్చలు లెప్రొసీ మచ్చలని నిర్ధారించే ముందు పలుమార్లు ఆలోచించవలసి ఉంటుంది

మీ పాపని చర్మ వైద్యులకి చూపించండి

### ఎ. ఎల్. ఎస్. – పొన్నూరు

నా వయస్సు 43 సం॥లు గత రెండు నెలలుగా నా పైదవడలోని జ్ఞాన దంతాలు నెప్పిగా ఉంటున్నవి డాక్టర్లు పరీక్షచేసి, ఎక్స్‌రే తీయించి రెండు మూడు దంతాలు పీకివేయ్యాలన్నారు. దంతాలు పీకించడం ఆలస్యం అయితే దుష్ఫలితాలు వస్తాయా ? నెప్పి తగ్గటానికి ఏవైనా మందులు ఉన్నాయా ?

★ దంత వైద్యుల సలహా ప్రకారం మీరు దంతాలను పీకివేయటం మంచిది నెప్పి తగ్గటానికి మందులు తాత్కాలికంగా పనిచేసినా, అలా చేయటం వల్ల రోగం సమూలంగా పోదు కదా ! 

---

### జోనాథన్ రాసుకున్న విషయం :

ఏడేళ్ళ తర్వాత అదే చోటుకు వెళ్ళాం ఎన్నో బాధలను అనుభవించిన ఆ ప్రదేశాలు చూడటం మాకు ఆనందంగానే వుంది దానికి కారణం మేం సాధించిన విజయం మరో విషయం ఏమిటంటే, క్విన్సీ మోరిస్ చనిపోయిన రోజునే, మా అబ్బాయి పుట్టినరోజు వచ్చింది. నామిత్రుల ధైర్యసాహసాలు నాబిడ్డకు వచ్చాయని మినా బాగా నమ్ముతుందని నాకు తెలుసు. మా మిత్రులందరి పేర్లు కలిపి ఒకే పేరుగా మా అబ్బాయికి పెట్టాం కానీ అబ్బాయిని 'క్విన్సీ' అనే పిలుస్తాం

ఈ వేసవిలో మేం ట్రాన్సిల్వేనియా ప్రాంతానికి వెళ్ళాం మా గతస్మృతులు గుర్తుకు

## జీవన్ వృతులు

తెచ్చే ప్రదేశాలు దర్శించాం. కానీ ఆ విషయాలు మేం చూసినవి, విన్నవి, అనుభవించినవీ అన్నీ నిజంగా జరిగినవే అని నమ్మశక్యంకాకుండా వున్నది. మాకు గుర్తున్న విషయాలు అక్కడ ప్రదేశాలు నిజమని నమ్మించాయి మరో పెద్ద గుర్తుగా, కొండమీద కోట కనపడింది.

ఇంటికి తిరిగి వచ్చాక పాత సంగతుల గురించే మాట్లాడుకున్నాం అట్లా నెమరు వేసుకుంటే సంతోషంగా వుంటుంది. ఆర్థర్, సెవార్డు పెళ్ళిళ్ళు చేసుకుని హాయిగా వున్నారు

జాగ్రత్తగా దాచివుంచిన కాగితాలనన్నింటినీ బీరువాలోంచి బయటకు తీసాను అవన్నీ టైపు చేసిన కాగితాలు. మినా, నాదీ, సెవార్డు డైరీలు మాత్రం లేవు ఆ టైపు చేసిన కాగితాలుతప్ప మా దగ్గర మరి ఏ ఆధారమూలేదు. వీటితో ఎవరిని నమ్మించగలం ఈ కథను ఎవరూ నమ్మరుకూడా అలా అంటే, వాన్‌హెల్సింగ్, మా అబ్బాయిని వొళ్ళో కూర్చోబెట్టుకుని ఇలా అన్నాడు.

"మనకి ఏ ఋజువులూ వద్దు. మనల్ని నమ్మమని ఎవర్నీ అడగొద్దు ఈ అబ్బాయి పెద్దయ్యాక తన తల్లి ఎంత ధైర్యసాహసాలు గల వ్యక్తో తెలుసుకుంటాడు. అప్పుడే ఇతనికి తల్లి ప్రేమ గురించి బాగా, క్రమక్రమంగా తెలుసుకుంటాడు – ఆమె అంటే అందరూ ఎంతగా ప్రేమించినదీ, ఆమెకోసం ఎంత సాహసాలు చేసినది." — జోనాథన్ హార్కర్

*(అయిపోయింది)* ★

# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

### చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.






2 ప్యాక్ లలో లభిస్తుంది—'బ్లూ' మరియు 'శాండల్ వుడ్'

నైసిల్ చెమటకాయల బాదనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. ఇది దురదను. మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది

నైసిల్– చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది.
3 దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

HTB-GLL/8806

# విముక్తి

మురారి సుబ్బారావు




ఓ స్త్రీ
పురిటి నొప్పులతో అరుస్తుంటే
మంత్రసాని నవ్వినట్లు
ఆకాశంలో
ఉరుములు, మెరుపులు
క్షణంలో కేరింతాల చినుకులు.
అవన్నీ ఒక్కటై
కాల్వల లోగిళ్ళు దాటుతూ
పరువంతో ప్రవహిస్తున్నాయి
జన క్షేమానికి
కాకుంటే ప్రాణక్షామానికి.
మరి మనిషి ? ? ?

* *

వర్షం ధారగా కురుస్తోంది
ఉదయం పది గంటలు.
'ప్రభంజనం' తెలుగు దినపత్రిక ఆఫీసు.
ఎడిటర్ నిరంజన్‌రావుగారు తన ప్రైవేట్

రూమ్‌లో కూర్చొని ఆ రోజు వచ్చిన 'మెయిల్' చూస్తున్నారు.

ఇంతలో సబ్ ఎడిటర్ సుబ్రమణ్యం ప్రెస్ టెలిగ్రాం పట్టుకొని లోపలికొచ్చేడు

"సార్"

"ఊఁ"

"రామయ్యపేటనుండి మన విలేకరి ప్రెస్ టెలిగ్రాం పంపేడు సార్. శ్రీమాన్ చక్రవర్తి గారు ఆత్మహత్య చేసుకున్నార్ట"

తల వంచుకుని ఉత్తరాలు చూస్తున్న నిరంజనరావుగారు ఆ మాటకు నిర్ఘాంతపోయారు

సుబ్రమణ్యం టెలిగ్రాం మేటర్ అందించాడు

అది చదివిన నిరంజనరావుగారి కళ్ళముందు శ్రీమాన్ చక్రవర్తిగారి రూపం మెదిలింది కళ్ళు చెమ్మగిల్లాయి రెండు క్షణాలు మౌనం పాటిస్తున్నట్లు కళ్లు మూసుకున్నారు

"ఈ న్యూస్ ఫస్ట్ పేజీలో ప్రముఖంగా వచ్చేలా చూడండి" అన్నారు నిరంజనరావుగారు

సుబ్రమణ్యం తలూపి వెళ్లిపోయారు

కొద్దిసేపటి తరువాత నిరంజనరావుగారు ఉత్తరాలు చదవడంలో మునిగిపోయారు

ఒకటొకటే చదువుతుంటే ఓ ఉత్తరం

న్యూస్‌పేపరుతో కవరు చేసి దాని మీద తెల్లని కాగితం అంటించి ఎడ్రసు వ్రాసి పోస్టు చేసిన వుత్తరం.

కవరు విప్పారాయన

నాలుగు పేజీల ఉత్తరం ఒక్కసారి అటూ ఇటూ పేజీలు తిప్పేరు. ఒకచోట సిరాతో, మరికొంత పెన్సిలుతో, చివరగా కాస్త నీళ్లు కలిపినట్లున్న సిరాతో వ్రాసిన వెల వెల బోయిన రాత.

చివరన సంతకం చూసి ఉలిక్కిపడ్డారు నిరంజనరావుగారు.

గుక్కపెట్టిన పసిపాపలా బయట ఒకటే వర్షం

ఉత్తరం చదవడం ప్రారంభించారాయన.

* * *

నిరంజన్ బాబూ,

ఇలా సంబోధిస్తున్నందుకు ఏమీ అనుకో వద్దు డెబ్బై ఏళ్ల ముసలివాణ్ణి నేను నాకంటే చిన్నవాడివని ఇలా వ్రాస్తున్నాను. ఎప్పుడో ఒకసారి నీతో పరిచయం కలగినట్లు గుర్తు ఆ ఆత్మీయతతోనే ఇలా సంబోధన. వణుకుతున్న చేతుల్తో వ్రాసిన ఈ అక్షరాలు అర్థంకాక పోయినా, ఈ ఉత్తరం చూడగానే చికాకు కలిగినా ప్రక్కకు పడెయ్యకు. ఈ ఉత్తరం నా ఆత్మఘోష మన్నించి చదువుతావు కదూ.

దేశానికి స్వాతంత్ర్యం రాక ముందు —

నాకు పదిహేనేళ్ళు నిండుతున్న సమయంలో, 'భరత మాతకీ జై' అని అందరూ నినదిస్తూంటే నేనూ జండా పట్టుకున్నాను

స్వాతంత్ర్య సముపార్జన ధ్యేయంతో ఇల్లు విడిచాను.

పస్తులున్నాను.

పరుగులు తీశాను.

ప్రాణాలు పోయినా పరవాలేదనుకున్నాను

లాఠీదెబ్బలు తిన్నాను. జైళ్ళలో మగ్గేను. తెల్లవారికి దాసోహమై ఈ గడ్డపై పుట్టిన జమీందారులే నా కుటుంబ సభ్యుల్ని చిత్రవధ చేస్తూంటే మౌనంగా రోదించాను ఆ దెబ్బలు ఈ భరతమాతకు తగిలిన గాయాలా అనే ఊహతో తల్లడిల్లిపోయాను. నేనొక్కణ్ణే కాదు. ప్రతి ఒక్కరూ. ఎవరైనా మరణం సంప్రాప్తిస్తే శ్వాస వదిలే అంతిమ క్షణాల్లో 'తల్లీ భరత భూమీ ! నీ విముక్తి చూడకుండానే వెళ్ళిపోతున్నాను' అనే మాటలే వినిపించేవి చివరకు —

దేశానికి స్వాతంత్ర్యాన్ని పొందేం మనం.

ఆ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న మేము ఈనాడు "స్వాతంత్ర్య సమరయోధులు"గా పిలువబడుతున్నాం.

నన్ను అందరూ "స్వాతంత్ర్య సమర యోధుడు" అని పిలుస్తూంటే ఎంతో ఆనందం కలిగేది.

అప్పటికి — స్వాతంత్ర్యం వచ్చిననాటికి — నాకు ఉద్యోగం దొరికింది ఓ బడి పంతులుగా.

పెళ్ళయింది

నలుగురాడపిల్లలు. మగవాళ్ళిద్దరు.

వచ్చే కొద్దిపాటి సంపాదనతో గుట్టుగా సంసారం గడిపాను. స్వాతంత్ర్యావనిలో బ్రతుకుతున్నాననే తృప్తి పొందేను

కానీ

ఇప్పుడు నా పెద్దకూతురు సంగతి గురించీ, నా ఆఖరి బిడ్డవాడు ఎలా బ్రతుకుతున్నదీ, నామీద గౌరవంతో, విశ్వాసంతో నన్నే తండ్రిగా భావించిన మా ఊళ్ళో జట్కా బండివాడు సోములయ్య సంసారం గురించీ వ్రాయాల్సొచ్చి నందుకు బాధగా వుంది

నా ఆఖరి కొడుకు. ఇప్పుడు ముప్ఫై ఏళ్ళవాడు. ఆ రోజుల్లో పి యు.సి. పాసయ్యాడు. వ్యాపారాలకి, వ్యవసాయానికీ మాకు ఆస్తిపాస్తులు లేవు రెక్కలే ఆధారం. వాడు ఎన్నో ఉద్యోగ ప్రయత్నాలు చేసాడు. ఇంటర్వ్యూలో మా వాడు చెప్పే సమాధానాలు అందరికీ తృప్తి కలిగినట్లుండేవి. ఒక చోటయితే ఇంటర్వ్యూలో సెలక్టయ్యాడు కూడా ఉద్యోగం రాలేదు. అందుకొక చిన్న కారణం, మాది ఉన్నత కులం తర్వాత అతిపెద్ద కారణాలు మాకు రికమండేషన్ ఇవ్వగలిగే పలుకుబడిగల దేముళ్ళూ, కాస్తంత ముట్టచెప్పడానికి తగిన స్థోమతుల్లేవు ఈ కారణాలో మరేవో కానీ వాడికుద్యోగం రాలేదు అయితే అప్పట్లోనే ఒక మిత్రుడి దగ్గర టైలరింగ్ నేర్చుకునేవాడు. ఇప్పుడు వాడు టైలరు. పెద్ద పేరున్నవాడు కాదుగానీ, వాడు కుట్టే బట్టలు 'ఫరవాలేదు' అనిపించేలా వుంటాయి. ఇప్పుడు వాడి బ్రతుకు వాడు బ్రతుకుతున్నాడు ఒక పూట తినో తినకో.

కానీ—

వాడికి ఉద్యోగం ఎందువల్ల రాలేదు. ఈ లంచాలు, రికమండేషన్లు మాత్రమే అభ్యర్థి తెలివితేటలకు గీటురాళ్ళా ? వ్యక్తి తెలివితేటలకు విలువలేదు ఎందుకని ఉన్నవాడు మరింత ఎత్తుకి ఎదిగిపోతూ లేనివాడు మరింత హీనంగా . ఇందుకేనా ... ఇందుకోసమేనా బాబూ మేం స్వాతంత్ర్యం గురించి పోరాడింది ?

నాకో మనవరాలుంది. దానికిప్పుడు ఇరవై తొమ్మిదేళ్ళు. నన్ను స్వాతంత్ర్య సమర యోధుడిగా ఎంతో గౌరవించేది నా మనవరాలు. నా పెద్దకూతురనేది, "నాన్నా మీ కాలంలో






విధవ పునర్వివాహాలంటూ ప్రోత్సహించారే. ఇప్పుడేది నాన్నా అలా వుద్యమాలు నడిపేవాళ్ళే లేరే'' అనేది. అప్పటి మా ఉద్యమాన్ని గౌరవించి, మన్నించి, ఆచరణలో పెట్టాలనే తపన గల మనస్కులు ఇప్పుడూ వుండివుండ వచ్చు కానీ ఒక ఆత్మ తృప్తికోసం, ఒక ఆడదాని జీవితాన్ని గట్టెక్కించామనే గర్వం కోసం, ఒక ఆడపిల్లకు న్యాయం జరగాలని అందరూ ఘోషిస్తున్నా ఆచరణలో అది నిజం చేసి ఉత్తముడుగా నిలబడటం కోసం నా మనవరాల్ని ధైర్యంగా ముందుకి వచ్చి పెళ్ళి చేసుకునేవారే కనబడలేదు అందరూ వేలకు వేలు కట్నాలకోసం పరుగులే. ఒక్కనిజం చెప్పనా ? ఈ కట్నాల సమస్య సమసిపోవాలంటూ నినాదాలివ్వడానికి, కథలు వేసుకోవడానికీ బోలెడన్ని వేదికలు, పత్రికలు వున్నాయి కానీ నిండు మనసుగల మనుషులేరి ! కట్నాల బాధలు తీరాలని పోరాడాల్సింది యువకులేకాదు. వాళ్ళను కన్న తల్లి తండ్రులుకూడా ! వాళ్ళలో మార్పు రావాలి. అప్పుడే ఈ సమస్యకు కాస్తయినా మనశ్శాంతి ఇంతసూ చెప్పొచ్చేదేమిటంటే నా మనవరానికి ఈ క్షణంవరకూ మేం పెళ్ళిచేయలేకపోయాం అవనతమైన పతాకంలా నా మనవరాలు ఇంట్లోనే పడివుంది మరి ఈ బాధలు తీరే దెప్పుడు మగవాడి జన్మకు, మగవాడి ఉద్ధరణకు తపించేది, మగవాడి ఖర్మల రాసిపెట్టేది, మగవాడు అంత దర్పంగా పొగరుగా తిరగడానికి కారణం — ఆడది. అలాంటి ఆడదాన్ని ఇంత నీచంగా చూస్తున్నామా మనం. ఇలాంటి నికృష్ట భావాలు పరుచుకొని ఇంకా... ఇంకా. . ఇరుకు జీవితం గడపడంకోసమా బాబూ మేం ఆనాడు పోరాడింది ... స్వాతంత్ర్యం వచ్చిందెందుకా ! ఆ ఊబిలో ఇంకా కూరుకుపోవడానికేనా ?

సోములయ్యా నా మిత్రుడికన్నా ఎక్కువ. జట్కాబండి తోలుకొని బ్రతికేవాడు. ఆఖరికి వాడి బ్రతుకేమయిందో తెలుసా !

## ఏ ము క్తి

ఒకసారి ఎన్నికలప్పుడు జనులను పోలింగ్ బూత్‌లదగ్గరకు తీసుకు వెళ్ళేందుకు సోములయ్య జట్కాబండిని కిరాయికి తీసుకున్నారు ఒక పార్టీ వాళ్ళు ఉన్న రోజుల్లోకన్నా ఆ రోజు ఓ కానీ ఎక్కువ వస్తుందని ఆశ పడ్డాడు సోములయ్య ఉదయంనుంచీ సాయంత్రంవరకూ చెమటలు కక్కుకుంటూ, కనీసం టీ నీళ్ళయినా కడుపులో పడక, పేగులు గుర్రంలా సకిలిస్తున్నా ఓర్పుతో ఓటర్లను తిప్పేడు ఫలితం — సాయంత్రానికి ఒక్క పైసాకూడా చేతికి రాలేదు అదేమి అన్యాయంబాబూ అని అడిగినందుకు వంటినిండా దెబ్బలు ఇలా ఎందుకు జరిగింది ఎడిటర్ బాబూ మనిషిలో నిజాయితీ ఎందుకు చచ్చిపోయింది శ్రమను గుర్తించలేని మనుషుల కోసం, కసాయి గుండెల కిరాతకంకోసం, పేదవాడంటే పేగులు మాడేవాడుగానే వుండిపోవడం కోసమేనా బాబూ మనకు స్వాతంత్ర్యం వచ్చింది?

వైరులోంచి విద్యుత్తు ప్రవహిస్తుంది.



అది మనం సృష్టించిందే బల్బు వెలుగుతుంది ఆ వెలుగులో మనం ఎంత సుఖపడిపోతున్నాం విద్యుత్తు లేకపోతే వెలుగే లేదు కానీ వెలిగే బల్బు కనిపిస్తోంది కానీ వైరులోని కరెంటు కనబడదు పేదవాడి శ్రమతో వాడి జవసత్వాలతో వెలిగే వెలుతురును కొంతమంది తమ స్వంతం చేసుకుంటున్నారు కనబడని విద్యుత్తు వైరులో వుందనుకున్నట్లే పేదవాడు సుఖంగానే బ్రతుకుతున్నాడనే చీకటి తొక్కను కప్పుతున్నారు—చాలామంది కానీ పేదవాడు ఎలా బ్రతుకుతున్నాడో మన కందరకూ తెలుసు. ఇందుకు ఉదాహరణ కావాలంటావా ఇవిగో పెరుగుతున్న ధరలు దొరకని నిత్యావసర వస్తువులు తరుగుతున్న జవసత్వాలు కనీసం పేదవాడికి ఒక్క రోజైనా తృప్తి కలుగుతోందంటావా ? భేషజాల బ్రతుకులు గడపడం కోసమా బాబూ మనకి స్వాతంత్ర్యం వచ్చింది ?

ఇక రాజకీయాలు గురించి ఎంతైనా చెప్పొచ్చు మనిషికి మరో మనిషికి గల సంబంధ బాంధవ్యాలు ఎలా వున్నాయో ఈ మనుషులు స్వార్థపరులుగా, మోసగాళ్ళుగా వంటరిగా ఎందుకు మిగిలిపోతున్నారో ! తనకేమీ పట్టని తత్వాన్ని అలవర్చుకొని గూడు కట్టుకుని నిద్రపోతున్న గొంగళీ పురుగుల్లా ఎందుకు మారిపోతున్నారు ఏ మనిషీ కూడా దేశం గురించి కాని, సాంఘిక జీవనంలో మార్పు గురించి కాని, పేరుకుపోతున్న అవినీతి అక్రమాలు చెండాడడానికి గాని మనసు పెట్టి పని చేయడం లేదెందుకని ?

ఓ స్త్రీ
పురిటి నొప్పులతో అరుస్తుంటే
మంత్రసాని నవ్వినట్లు
ఆకాశంలో ఉరుములు, మెరుపులు
అంతలో ..
.. ... . .
... .
. . . .
మరి మనిషి ? ? ?
అందుకే ఎడిటర్ బాబూ,

స్వాతంత్ర్యం కోసం పోరాడి లాఠీ దెబ్బలు తిని జైలుకి వెళ్లి సంపాదించిన స్వాతంత్ర్యానికి విలువ దిగజారిపోతున్నదని తెలుసుకున్నందుకూ,

స్వేచ్ఛ, సౌభాగ్యం, సుఖం, సంతోషం స్వాతంత్ర్యం తర్వాత మరింత క్షీణించిపోతున్నదని తెలుసుకున్నందుకూ,

ఆనాడు మేం పోరాడింది ఇప్పటి కుళ్ళు రాజకీయాలు, మతాతత్వాలు, సామాన్యుల హీనస్థితి దౌర్భాగ్యాల కోసం కాదని స్వాతంత్ర్య సమరయోధులకు, ఇప్పటి స్థితి అవమానకరమని భావించి —

ఆత్మార్పణం చేసుకుంటున్నాను.

ఆవేశంతో ఆత్మాభిమానం కోసం ప్రాణాల్ని లెక్కచెయ్యక పోరాడిన ఈ శరీరం, ఆకలి బాధను భరించగలిగినంత కాలం భరించి, ఇక ఉపవాసాలు చేసే శక్తిలేక, ఆలనాపాలనా లేని వ్యవస్థలో, కుటిల అధికార దాహాల చెరనుండి విముక్తి కోసం ఆత్మత్యాగం చేస్తున్నాను.

పుట్టిన పసికందునుండి మృత్యువుకు చేరువుగా వున్న ముసలి ముతకా వరకూ ఎవ్వరూ కూడా తృప్తిగా బ్రతకడంలేదనే నిజాన్ని భరించలేక ఈ శరీరాన్ని సమాధి చేసుకుంటున్నాను.

స్త్రీల శీలం, భారతమాత స్త్రీత్వం కామాంధుల పదవీ వ్యామోహపరుల గుప్పెట మారణహోమంలోసమిధలవుతున్నందుకు బాధతో నా హృదయాన్ని బ్రద్దలుకొట్టుకుంటూ నా ఊపిరి ఆపుకొంటున్నాను.

సామాన్య మానవుడు కళ్ళు తెరచి తనకొక సుఖజీవనం ఏర్పరచుకోవడం కోసమై, మనిషి సాటిమనిషిపట్ల గౌరవం చూపి దేశానికి వ్యక్తిత్వం వున్నదని పదిమందికి తెలిసేలా చేయడం కోసం, రాజరిక వ్యవస్థకు 'డేష్' పెట్టిన బ్రిటిష్‌వారికి స్వాతంత్ర్య పోరాటంతో మేం 'కామా' పెడితే ఇప్పటి దుర్భర పరిస్థితికి తిలోదకాలిచ్చి 'ఫుల్‌స్టాప్' పెట్టి కొత్త తరం వారికి దేశాభ్యుదయం ప్రభోదించడానికి —

ఈ స్వాతంత్ర్య సమరయోధుని జీవితాన్ని—
సంతోషంగా...
ఆనందంతో...
తృప్తికోసమై...
ప్రాణత్యాగం చేస్తున్నాను.

నన్ను తోడ్కొనిపోయే ఓ మృత్యుదేవతా! నీ వెంట బానిసగా నడుస్తాను.

ఇకనైనా నా దేశాన్ని క్షమించి రక్షించు.

స్వార్థపరులు, పదవీ వ్యామోహపరులు, కుటిల రాజకీయాలవాళ్ళు — వీళ్ళనుండి నా దేశాన్ని రక్షించు.''

సెలవ్
ఇట్లు
స్వాతంత్ర్య సమరయోధుడు
శ్రీమాన్ చక్రవర్తి. ★

# హైదరాబాద్ నోట్‌బుక్

**తిరుమల రామచంద్ర**

## భీమన్న సాహితీ షష్టిపూర్తి :

కళాప్రపూర్ణ, పద్మశ్రీ డాక్టర్ బోయి భీమన్న సాహితీ షష్టిపూర్త్యుత్సవం జులై 15 ఆంధ్ర సారస్వతపరిషత్తు హాలులో జరిగింది ఉత్సవానికి అధ్యక్షత వహించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ ఆవుల సాంబశివరావు ప్రసంగిస్తూ, శ్రీ భీమన్న అరవై యేళ్లుగా రచనా వ్యాసంగాన్ని ఒక జీవనప్రవంతిగా, ఉద్యమస్ఫూర్తితో కవితను, రచననూ సమాజాన్ని మార్చడానికి సాధనంగా కొనసాగించారని, అరవై యేళ్లక్రితం ఆయన సమాజానికి ఎంత అవసరమయ్యారో 1983 లోను అంతేనని, దానికి కారణం ఆయన రచన శక్తివంతం కావడమేనని అన్నారు. శ్రీ భీమన్న అరవైయేళ్ల సాహిత్య సేవను ప్రతిబింబించే డెబ్బయి రెండు రచనలతో శ్రీ గనుమల జ్ఞానేశ్వర్ సంపాదకత్వంలో వెలువడిన "భీమన్న సాహితీ షష్టిపూర్తి సంచిక"ను ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ బి. పి జీవన్‌రెడ్డి ఆవిష్కరిస్తూ, సమాజంలో మార్పు రావడానికి సామాజిక స్పృహ, రాజకీయ పరిజ్ఞానం అవసరమనీ, ఈ రెండింటినీ ప్రజలలో కలిగించడానికి భీమన్న తన కవితాశక్తి ద్వారా కృషి చేశారని అన్నారు. హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు ప్రసంగిస్తూ, భీమన్న రచనలలో ఒకవైపు భారతీయ సంస్కృతి ప్రతిబింబించినా, మరొకవైపు దానిలోని లోటుపాట్లను నిస్సంకోచంగా విమర్శించడం కనిపిస్తుందని, ఆయన పీఠికలు విపులమైనవని అన్నారు ఆయన రచనల్లో వైవిధ్యం విలసిల్లుతున్నదని, ఆయన ఎంత భావకవో, అంతటి అభ్యుదయ కవి అనీ అన్నారు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాది శ్రీ బొజ్జం తారకం భీమన్న సాహిత్యాన్ని సమీక్షిస్తూ, భీమన్న అన్ని సాహిత్య ప్రక్రియలలోను పుంఖాను పుంఖంగా ఉత్తమ రచనలు చేసినప్పటికీ, ఆయనకు ఆంధ్ర సాహిత్య చరిత్రలో తగిన స్థానం లభించలేదన్నారు. ఏ సాహిత్య వాసనా, ఆదరించే వాతావరణమూ లేని పరిస్థితుల్లో పుట్టిపెరిగి, నీచులనే పేరు తొలగించుకొని, భామందుల కాళ్ల బంధాలు తెంపుకొని, పాలేరునుంచి పద్మశ్రీ వరకు పెరిగి, స్వయం కృషితో సాహితీ షష్టిపూర్తి చేసుకొనే అత్యున్నత స్థాయికి ఎదిగివచ్చినవాడు భీమన్న అని శ్రీ తారకం ప్రశంసించారు. అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ సి. నారాయణరెడ్డి శ్రీ భీమన్నను అభినందిస్తూ, భీమన్నలో సనాతనత్వం ఎంత వుందో హేతువాద దృక్పథం కూడా అంతేనని, మౌలికత ఆయన రచనల్లో కనిపిస్తుందని, ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రకారులు శ్రీ భీమన్నను పక్షపాత దృష్టితో విస్మరించినా, ఆయన రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారని అన్నారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని ప్రసంగిస్తూ, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీపాద కృష్ణమూర్తిగార్ల తర్వాత అనేక గ్రంథాలు రచించిన కవి భీమన్నేనని అన్నారు. అనంతరంపెక్కు సాహితీ, సాంస్కృతిక సంస్థలు శ్రీ భీమన్నను పూలమాలలతో ముంచెత్తాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ తరఫున అకాడెమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి శ్రీ భీమన్నకు వెయ్యి రూపాయల చెక్కును అందజేశారు. శ్రీ భీమన్న కృతజ్ఞత తెలుపుతూ, రాజకీయరంగంలో వుండే మురాతత్త్వం సాహిత్యంలోను ప్రవేశించిందన్నారు సమాజాన్ని, ముఖ్యంగా గ్రామ సీమల్ని కదిలించే రచనలు చేయాలని యువ రచయితలను ఆయన ఉద్బోధించారు. అలాటి రచయితలను ప్రోత్సహించడానికి ఒక ట్రస్టు ఏర్పాటుచేయాలని ఆయన సూచించారు. ఇతర భాషలలోకి తెలుగు పుస్తకాలు అనువాదమయ్యే స్థాయికి తెలుగు సాహిత్యం ఎదగలేదని ఆయన ఆవేదన పడ్డారు తెలుగు రచన నోబెల్ ప్రైజు అందుకునే స్థాయికి ఎదుగుతుందనే ఆశాభావాన్ని శ్రీ భీమన్న వ్యక్తంచేశారు ఉత్సవ ప్రారంభంలో సాహితీ షష్టిపూర్తి సంఘం అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగతం చెప్పారు శ్రీమతి సంయుక్త బుల్లెయ్య వందనసమర్పణతో ఉత్సవం పూర్తయింది.

తమ సాహితీ షష్టిపూర్తి సభలో ప్రసంగిస్తున్న డా. బోయి భీమన్న.



## భూమి కంపించింది :

జూన్ 30వ తేదీన మధ్యాహ్నం పన్నెండు గంటలకు తెలుగు అకాడెమీలో మిత్రులతో మాట్లాడుతున్నాను సంభాషణలో అరగంట గడిచిందేమో! కాళ్లకింద ఏదో గర్జించిన శబ్దం అయింది కిటికీలు రెపరెపలాడాయి భూకంపమనే భావమే కలుగలేదు కాని అకాడెమీ తక్కిన గదులలోని వారు ప్రాణ భయంతో తొందరలో దిగిపోవడం చూచి నేనూ దిగాను కింద వీధుల్లో గోలగావుంది. అందరూ పనులు మానేసి రోడ్డుమీద నిలబడ్డారు. తమ అనుభవాలు చెప్పకొంటున్నారు నవ్వులతో కేరింతలలో క్షణంకింద ప్రాణభయంతో పరిగెత్తారే తమకు ఇక భయం లేదనుకోగానే నవ్వులు, తమ ప్రయోజకత్వంతో తప్పించుకొన్నట్టు బీరాలు. ఇది సామాన్యమానవుని స్వభావం ఇంతవరకు ఇంతటి భూకంపం జంట నగరాలలో సంభవించలేదని, భూకంప తీవ్రత రిచర్‌స్కేలులో నాలుగున్నరగా నమోదు అయిందని ఇది ఏడుదాటితే భవనాలు కుప్పగా కూలిపోయేవని జాతీయ భూభౌతిక శాస్త్ర పరిశోధన సంస్థ డైరెక్టర్ ప్రొఫెసర్ వి కె గౌర్, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎస్. బాలకృష్ణ, శ్రీ గుప్త తెలిపారు భూకంపం హైదరాబాద్, సికిందరాబాదులలోను, హైదరాబాదుకు ఉత్తర, వాయవ్యదిశలలో దాదాపు 30 కిలోమీటర్లలోను సంభవించింది దీనికి మూలస్థానం గండిపేట అని శాస్త్రజ్ఞులన్నారు పదిసెకెండ్లపాటు సంభవించిన ఈ భూకంపం జంటనగరాలలో కల్లోలం కలిగించింది ఇళ్ల తలుపులు, కిటికీలు దబా దబా కొట్టుకోగా ఇళ్లల్లో వున్నవారంతా భయభ్రాంతులై గబగబా మేడలు దిగివచ్చి రోడ్డుమీద పడ్డారు. ఆఫీసుల్లో పని చేసుకుంటున్న ఉద్యోగులు బిత్తరపోయి, ఫైళ్లు వదలి బయటికి పరుగెత్తారు సచివాలయంలోని ఉద్యోగులు గుంపులు గుంపులుగా మైదానంలోకి వచ్చారు సచివాలయం నూతన భవనం ఆరవ అంతస్థులోని ఒక గోడ బీటలు వారింది. పరిశ్రమభవన్‌లోని తలుపుల అద్దాలు పగిలిపోయాయి అమీర్‌పేట అగ్నిమాపక శిక్షణ కేంద్రంలో శిక్షణ పొందుతున్నవారు కింద పడ

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే సవ్యింపేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥



# హైదరాబాద్ నోట్ బుక్

పోయారు. ఒకరిద్దరికి గాయాలు కూడా తగిలాయట. సినిమా థియేటర్లలోని ప్రేక్షకులు భయంతో తోసుకుంటూ వెలుపలికి వచ్చారు. జంటనగరాలంతటా ఇలాటి సంఘటనలు జరిగాయి.

## హైదరాబాద్ లయన్స్ క్లబ్ నూతనాధ్యక్షుడు

సుప్రసిద్ధ నేత్ర వైద్యులు డాక్టర్ అన్నావజ్ఝల రామచంద్రన్‌ను హైదరాబాద్ లయన్స్ క్లబ్బు అధ్యక్షుడుగా ప్రతిష్ఠించడం జరిగింది. ఈ ఉత్సవం జులై ఒకటవ తేదీ సాయంకాలం రిట్జ్ హోటలులో జరిగింది. (డాక్టర్ రామచంద్రన్ సేవా నిరతిని గురించి హైదరాబాద్ నోట్ బుక్ పాఠకులకు ఇదివరకే తెలుసు.) నూతన కార్యదర్శిగా శ్రీ శైలేంద్ర ఆవాషియా, కోశాధ్యక్షుడుగా శ్రీ మహేంద్ర మెహతా, నూతన కార్యవర్గ సభ్యులూ నియమితులయారు. రాష్ట్ర ఖాదీ, గ్రామీణ పరిశ్రమల, సమాచార పౌర సంబంధశాఖల మంత్రి శ్రీ చేగొండి వెంకట రామజోగయ్య ముఖ్య అతిథిగా వున్నారు. పూర్వాధ్యక్షులు శ్రీ కళా సుబ్బారావు నుంచి అధ్యక్ష పదవిని స్వీకరించిన డాక్టర్ రామచంద్రన్ ప్రసంగిస్తూ, లయన్స్ క్లబ్బు చేపట్టిన పాత కార్యక్రమాలను కొనసాగిస్తానని, కొత్తగా క్షయరోగ శిబిరాన్ని, ఆరోగ్య పరీక్షా శిబిరాలను నిర్వహించదలచినానని అన్నారు. రాష్ట్ర ప్రభుత్వంతో ప్రజాహిత కార్యాలలో సహకరించడానికి సిద్ధంగా వున్నామనీ ఆయన అన్నారు. పిదప డాక్టర్ రామచంద్రన్ తమ తండ్రి స్మారకంగా వేయిన్నూట పదార్లు విరాళం ప్రకటించారు. మంత్రి శ్రీ వెంకట రామజోగయ్య ప్రసంగిస్తూ, తమ ప్రభుత్వం శ్రీ ఎన్. టి. రామారావు సమర్థ నాయకత్వం కింద ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగిస్తున్నదని, లయన్స్ క్లబ్బు వంటి ప్రజాసేవా సంఘాలు ప్రభుత్వంతో సహకరించాలని అన్నారు.

**బస్సు సీట్లు :**

"చావ చింపు — సామ్రాజ్యం
బస్సు సీటు — బ్రహ్మరథ
... ... ... ... ... ... ...
ఏదైతేనేం — ఏదైతేనేం
పోటీ పడి — కాటులాడ"

అన్నాడు గొడవ కవి కాళోజీ నారాయణ రావు. జంటనగరాల బస్సులలోని జనసమూహాన్ని చూచే పై మాటలన్నాడేమో! ఇటీవల తెలుగు దేశం ప్రభుత్వం బస్సులలో ఆడవాళ్లకు అదనంగా సీట్లు కేటాయించింది. సీట్ల వెనుక లేడీస్ అనో, స్త్రీలు అనో ముద్రకూడ వేసింది. కాని పురుషులు ఇవేమీ పట్టించుకోరు. ధభాయించి సీట్లలో కూర్చుంటారు. ఆడవారు పైకమ్మీ పట్టుకొని వ్రేలాడుతున్నా చూచీ చూడనట్లుంటారు. కండక్టరు పాపం ఏం చేస్తాడు? ఎందరికని చెబుతాడు? మనకు పౌరజ్ఞానం కొంతకు కొంతయినా వుండాలిగాని. ఇవి మా సీట్లు లేవండయ్యా అనే ధైర్యం ఆడవాళ్లకులేదు. సీట్ల వెనక వ్రాసిన దానిని చూచే ఓపిక వుండదు. కనుక ఆర్. టి. సి. వారు స్త్రీల సీట్లకు విడిగా రంగు వేస్తే మంచిదేమో! అప్పుడు స్త్రీలు వచ్చి, ఇవి మా సీట్లు అని చూపీ చూడగానే కనుక్కొని కూర్చున్న మగ మహారాజులను లేవండయ్యా అని అడగడానికి అవకాశం వుంటుంది.

**ఉపశ్రుతి :**

భూకంపానికి కారణం ఏమిటి?–అనడిగారు ఒకరు నన్ను. ఏముంది ? కాంగ్రెస్ ప్రభుత్వం లేకపోవడమే — అన్నారొక కాంగ్రెస్ అభిమాని. మాబాగా అన్నావయ్యా. శ్రీ దేబర్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్నప్పుడు అచ్చం ఇలాటి మాటే అన్నాడు, ఆంధ్రలో వర్షం కురవకపోవడానికి కారణం కమ్యూనిస్టుల ప్రాబల్యమేనని–అన్నారొక వృద్ధ రాజకీయవాది సంభాషణ విని.

ఇటీవల నెల్లూరులో శ్రీ బాల త్రిపురసుందరి నృత్య కళానికేతన్ వారు ఏర్పాటు చేసిన కూచిపూడి నృత్య ప్రదర్శనలో జానపదాన్ని అభినయిస్తున్న చి. మద్దాలి అపర్ణ. ఈమె శ్రీ వేదాంతం పూర్ణచంద్రరావు శిష్యురాలు.



## ఉత్తరాలు

[5వ పేజీ తరువాయి]

### సీరియల్స్

''అతడు అడవిని జయించాడు'' ఆద్యంతం చాలా హృద్యంగా వుంది! రచయిత— డాక్టర్ కేశవరెడ్డిగారి శైలి, ఈయొక్క రచనలో అడుగడుగునా, ప్రశాంత తీరాలకు తీసుకు వెళ్ళింది! అమాయకత, ఆత్మ విశ్వాసం మూర్తీభవించిన— ముసలివాని పాత్ర— ఓటమి లోనే అడవిని జయించిన విధానం, తీరు, ప్రత్యేకత— కళ్ళకు కట్టినట్లుగా రచించిన డాక్టరు కేశవరెడ్డిగారికి, అభినందనలు!

నందివెలుగుల శేషకుమార్ (కొత్తగూడెం)

*　　*　　*

డా. కేశవరెడ్డిగారి సీరియల్ 'అతడు అడవిని జయించాడు' అద్భుతంగా ముగిసిందని చెప్పవచ్చును. సీరియల్ చిన్నదయినా మాలాంటి పాఠకులను విశేషంగా ఆకర్షించింది

ఎన్. వి. రామ్‌గోపాల్, ఇతరులు (మండపేట)

### తిరుచరణాలు

మా అభిమాన నటుడు కృష్ణ ముఖ చిత్రంతో వెలువడిన సంచిక ఎంతో ఆకర్షణీయముగా నున్నది. సీరియల్ 'తిరుచరణాలు' ఎంతో రసవత్తరంగా కొనసాగుచున్నది.

ద్విభాష్యం కామేష్, ఇతరులు (మొగల్తూరు)

### జీవన్మృతులు

మీరు ప్రచురించిన ''జీవన్మృతులు'' సీరియల్ నవల చాల బాగున్నది ఇలాంటి భయంకర సీరియల్ అంటే నాకు చాల ఇష్టము. తిరుచరణాలు సీరియల్ కూడా బాగానే వుంది. జీవితం నేర్పిన పాఠము కథ ఉత్సాహముగా వుంది.

యల్. కిరణ్‌కుమార్ (ఇచ్ఛాపురం)

### మ్యాథిల్డ్ లేఖ

డాక్టర్ జయ్‌దుబాషిగారి మ్యాథిల్డ్ లేఖలో గాంధికి థాచర్‌కు గల పోలికల గురించి ఆయన చాలా నిక్కచ్చిగా తన అభిప్రాయం తెలియ పరచగలిగారు. శ్రీమతి గాంధికి, థాచర్ యొక్క ముఖకవళికలే కాదు, రాజకీయ చతురత కూడా తెలియదు.

అందువలన శ్రీమతి గాంధి గాంధియే — థాచర్, థాచరే జయ్‌దుబాషిగారి చివరి వాక్యం ''శ్రీమతి గాంధి కనుక థాచర్ అయితే అపుడు నా పేరు జూలియస్ సీజర్ అవుతుంది'' చాలా ఘాటుగా ఉంది.

యస్. అంజాద్‌పాష, సిమెంట్‌నగర్ (కర్నూలు)

## న్యూఢిల్లీ లేఖ

విషయాన్ని స్పష్టంగా చెప్పడంలో, సహేతుకమైన విమర్శలో డా జయ్‌దుబాషీ గారిది ప్రత్యేక స్థానం న్యూఢిల్లీ లేఖ నిరంతరంగా కొనసాగడంలోను, పాఠకులను ఆకట్టుకోవడానికి ఇదే కారణం అయివుండవచ్చు. 1-7-83 సంచికలో థాచర్-ఇందిరా గాంధీల గురించి వ్రాసిన వ్యాసం అద్భుతంగా వుంది.

నక్కకి, నాగలోకానికి వున్న తేడా తెలిసిన వారు ఇందిర-థాచర్‌లకు ఏమాత్రం సమన్వయం కుదర్చరు పేద కుటుంబంలోంచి వచ్చి, గొప్ప దేశాన్ని సమర్ధవంతంగా పరిపాలిస్తున్నది ఆమె గొప్ప కుటుంబంలో పుట్టి, పేద దేశాన్ని పెడత్రోవ పట్టిస్తున్నది ఈమె శ్రీమతి గాంధికి భేషజం ఎక్కువ. పులిని చూసి నక్క వాత పెట్టుకునే చందం ఈమెది ఈమె కుటిల రాజకీయాలు, శుష్క వాగ్దానాలు, అవకాశవాదాలు, దివాలాకోరు ప్రణాళికలు, వాటికి బుకాయింపులు సర్వం — కేవలం మరొక సమర్ధ నాయకత్వం కనుచూపు మేరలో కనిపించే వరకే చెల్లుతాయి. ఆ తరువాత ఈ విశాల దేశంలో ఆమెకు బహుశా నిలవనీడ కూడా వుండదేమో !

పి. వి. రవికుమార్ (విజయవాడ)

*    *    *

8-7-83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "న్యూఢిల్లీ లేఖ" ఎంతో బావుంది శ్రీ మొరార్జీ దేశాయి సి. ఐ ఎ. ఏజెంట్ అని ఎవడో అమెరికా వెధవ రాస్తే మన పత్రికలు దాన్ని పెద్దగా ప్రచురించడం అర్ధరహితం. శ్రీ జయ్‌దుబాషీ గారు వ్రాసినట్లు అమెరికాది నిజంగా భస్మాసుర హస్తమే ! ఆ సేమూర్ హెర్ష్ ఇండియా రాలేదు ఎవర్నీ విచారించలేదు అలాంటివాడు మొరార్జీదేశాయి సి. ఐ ఏ. ఏజెంట్ అని ఎలా వ్రాశాడో అర్ధం కాదు. అయినా అలాంటి పిచ్చివార్తల్ని తెలివైన వారెవరూ నమ్మరు.

జైన శ్రీనివాస్ (ముదిమాణిక్యం)

## గుండె గుండెకొక దీపం

"గుండె గుండెకొక దీపము" కథ శ్రీ మధుర్ జీ గారు వ్రాసినది చాల బాగా రాసినారు.

మున్నున వీరభద్రరావు (పెద్దాపురం)

*    *    *

"గుండె గుండెకొక దీపం" అనే కథ నిజంగా నా మనస్సును ఆకట్టుకుంది.

సుబ్రహ్మణ్యం (మరడాం)

## శ్రీరంగపట్నం

24-6-83 నాటి నటి సవిత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 29వ పేజీలో శ్రీరంగపట్నం ప్రాముఖ్యతని గూర్చి పూర్తి వివరాలు ప్రచురిస్తే ఇంకా బాగుండేది అదే క్షేత్రంలో ఆలయంలోకి అడుగు పెట్టేటప్పుడు అచ్చట ముఖ ద్వారం దాటగానే ఉన్న 36 అడుగుల ఎత్తుపై ఉన్న స్తంభంపై చిన్నది లింగాకృతి కలిగిన రీతిలో ఒక రాయి ఉంటుంది భక్తులు ముందుగా తమ చేతులని కడుగుకొని దోసెడు నీళ్లు తీసుకొని లింగంపై పోసి తమ మనసులో ఉన్న కోరికను తలచుకొని అది జరుగుతుందో లేదో తెల్సుకోవడానికి తమ రెండు చేతులతో లింగం ఒకవైపు పట్టుకొంటారు ఒకవేళ అనుకొన్న పని జరుగుతుందనుకొంటే మన ప్రయత్నం లేకుండానే రెండు చేతుల వేళ్లు కల్సుకొంటాయి ఇది యదార్ధం. అచ్చటి వింత ఇది స్వఅనుభవం కూడా మరో వింత ఏమంటే ఆలయ శిఖరం సూర్యుని కిరణాలు పడితే "ఛాయ" తలక్రిందులుగా పడుతుంది ఇటువంటి అద్భుత విషయాలు పాఠకులకి తెలియజేస్తే ఇంకా బాగుండేది గుళ్లపల్లి సుందరమ్మగారికి అభినందనలు తరచూ మరికొన్ని క్షేత్ర మహాత్యాలను వాటికి వెళ్లే మార్గాలను ప్రచురించండి.

తటవర్తి వెంకట శివప్రసాదరావు
(ఆమదాలవలస)

## ఊర్మిళాదేవి ఎవరి కూతురు ?

ఊర్మిళాదేవి కుశధ్వజుని కుమార్తె అని 8-7-83 ధర్మపథంలో వ్రాశాను అది సరి కాదనీ, ఆమె జనకుని కూతురని వాసుదాసుగారి రామాయణంలో ఉన్నదనీ, శృంగవరపు వెంకటేశ్వరరావుగారు సంపాదకులకు జాబు వ్రాశారు. సీతాదేవి వలెనే ఊర్మిళాదేవి మహాయోగి అయిన జనకునికి పెంపుడు కుమార్తె కావచ్చును "శ్రీమద్రామాయణాంతీరార్థము" అనే గ్రంథంలో 87వ పుటలో ఈమె కుశధ్వజుని కుమార్తె అనియే ఉన్నది. వేర్వేరు రామాయణాలలో కథలు విభిన్న రీతుల ఉన్నాయి. అసలు పాయసం పంపకంలోనే వేర్వేరు రీతులు కానవస్తుంది ఏది నిజం ? ఏది అబద్ధం ? అని తెలుసుకోవటం సాధ్యం కాదు ఇంతకూ ఆమె ఎవ్వరి కూతురు ? అనేది ప్రధానం కాదు. మనం గ్రహించ వలసినది విషయం మాత్రమే అని గ్రహించాలి

బులుసు వేంకటరమణయ్య (మదరాసు) ★

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3
Editor . S. Radhakrishna


అగ్నిసమాధి"
నరేష్, పూర్ణిమ

# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ

అసలు తల నొప్పి అంటేనే భరించలేని బాధ. దాన్ని పోగొట్టుకోడానికి సులువైన మార్గము. కొంచెము అమృతాంజన్ తీసుకొని కణతల మీద బాగా గట్టిగా నిమిరి పట్టించండి. వెంటనే తల నొప్పి తగ్గిపోయి హాయిగా వుంటుంది.

అమృతాంజన్ ఇతర మందులవలెగాదు అమృతాంజన్‌లో చేరివున్న శక్తివంతమైన 10 ఔషధాలు అమోఘంగా పని చేసి రాసిన చోట పై చర్యవల్ల అతి త్వరగా ఇట్టే నొప్పిని నివారిస్తుంది ఏ అపాయం వుండదు

85 సంవత్సరాలకు పై బడిన ప్రసిద్ధి కల్ల అమృతాంజన్ వొంటి నొప్పులకు, బెణుకులకు, జలుబులకు గొంతు నొప్పులకు కూడా చాలా అమోఘంగా పనిచేసి నివారిస్తుంది.

ఎప్పుడూ అమృతాంజన్ చేతికి అందుబాటుగా వుంచుకోటం మంచిది. ఎందుకంటే ఎప్పుడు అవసర మొస్తుందో చెప్పలేము.




## అమృతాంజన్

**శీఘ్ర నివారిణి. నమ్మకమైనది. ఏ ఇతర బాధనూ కలుగచేయదు.**